# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

సెప్టెంబరు 1960

సంపుటము 37 : : సంచిక 9

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1960



## అక్టోబర్ సంచికలో

# వార్తలు

## శ్రీ చింతా దీక్షితులుగారి కాలధర్మం

సుప్రసిద్ధ కథానికా రచయితలు శ్రీ చింతా దీక్షితులుగారు ఆగస్టు 26 వ తేదీన మదరాసురాష్ట్రంలోని కడలూరులో స్వర్గస్థులయారు. వీరివయస్సు 70 సంవత్సరాలు.

వీరు తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకా దంగేరు గ్రామంలో 1891 లో జన్మించారు. రాజమహేంద్రవరంలో బి. ఎ; మద్రాసులో ఎల్. టి. చదివి విద్యాశాఖలో పలుపదవులు నిర్వహించారు.

అచ్చమైన తెలుగుకథ శ్రీ దీక్షితులుగారి ఊహలో తొలిసారిగా జన్మించింది. దేశీయ వాతావరణం వీరికథలలో కడుసహజంగా ప్రవర్తిల్లింది. ఏకాదశి, దీక్షితుల కథలు, శారీరావుకథలు మొదలయినవి వీరి కథాసంపుటాలు.

వీరిని బాలవాఙ్మయ పితామహులని అనవచ్చు. వీరు బాలవాఙ్మయం సేకరించారు; స్త్రీలపాటలు మొదలైన జానపద వాఙ్మయంకూడా సేకరించారు. 'లక్క పిడతలు' అనే గేయసంపుటికి తెనుగు భాషాసమితి బహుమానం, రాష్ట్రపతి బహుమానం లభించాయి. సీతీ, సూరీ, వెంకీ—అనే శీర్షికతో 'భారతి'లో వెలువడిన కథలు, ఆపాత్రలు తెలుగువారికి చిరపరిచితాలు. వీరి కథలు కొన్ని హిందీలోకూడా అనువదించబడ్డాయి. చిరకాలం విద్యాశాఖలో ఉద్యోగం చేయడంవల్ల విద్యార్థుల మనస్తత్వాన్ని గుర్తించారుగనుక ఇలాటి జీవ ద్రచనలు తెలుగుతల్లికి కానుకలర్పించారు.

శర్మిష్ఠ, వరూధిని, రేణుక మొదలైన నాటికలూ వ్రాశారు.

వీరు స్వరచనలలాగే సరళహృదయులు, పరమభక్తులు, రమణమహర్షి అనుయాయులూను. రమణమహర్షి భాషితాలను అనువదించారు.

## శ్రీ కాశీ కృష్ణాచార్యులకు రాష్ట్రపతి యోగ్యతాపత్రం

స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా ప్రముఖ సంస్కృత విద్వాంసులు 'అవధాని శిరోమణి' శ్రీ కాశీ కృష్ణాచార్యులకు—ప్రశంసాపాత్రమైన సేవ చేసినందుకు—రాష్ట్రపతి యోగ్యతాపత్రం లభించింది.

75 మంది పోలీసు ఉద్యోగులకు, రాష్ట్రపతి పతకాలు లభించాయి.

## రాష్ట్రకాంగ్రెస్ ఎన్నికలసంఘం ఎన్నిక

రాష్ట్రకాంగ్రెస్ ఎన్నికలసంఘం వివాదంలో ఉభయవర్గాలకు రాజీకుదర్చడానికి మద్రాసుముఖ్యమంత్రి శ్రీ కామరాజ్ చేసినప్రయత్నం విఫలంకావడంవల్ల ఎన్నికలసంఘానికి పోటీజరిగింది. ఈ ఎన్నిక నిర్వహణకు ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారు అధ్యక్షతవహించారు. అఖిలభారత కాంగ్రెస్ ప్రతినిధిగా శ్రీ సాదిక్ అలీ పర్యవేక్షకుడుగా హాజరయ్యాడు. అధికారపక్షానికి నాలుగు స్థానాలు, ఐక్యసంఘటనకు ఐదుస్థానాలు లభించాయి. గెలిచిన అధికారపక్షాభ్యర్థులు వీరు: శ్రీయుతులు అల్లూరి సత్యనారాయణరాజు, వి. బసిరెడ్డి, మల్లిపూడి పల్లంరాజు, పి. వి. నరసింహారావు. ఐక్యసంఘటన అభ్యర్థులు వీరు: శ్రీయుతులు కాసు బ్రహ్మానందరెడ్డి, వల్లూరి బసవరాజు, ఎ. సి. సుబ్బారెడ్డి, జె. వి. నరసింగరావు, పి. వి. జి. రాజు.

## సైప్రస్‌కు స్వాతంత్ర్యం

82 సంవత్సరాలుగా బ్రిటిష్ పాలనలో పారతంత్ర్యంతో క్రుంగిన సైప్రస్ ఆగస్టు 16 వ తేదీన స్వతంత్రమైంది. సైప్రస్ స్వతంత్ర రిపబ్లిక్‌గా అవతరించినట్లు గవర్నర్ ప్రకటనచేశాడు; రిపబ్లిక్ రాజ్యాంగం అమలులోకివచ్చినట్లు బ్రిటిష్ రాణిచేసిన ప్రకటనను చదివి వినిపించాడు.

సైప్రస్ మధ్యధరా సముద్రంలోని పెదదీవులలో మూడవది. దీనిపొడుపు 140 మైళ్ళు. వెడల్పు 60 మైళ్లు. రాజధాని నికోసియా. జనాభా ఐదున్నరలక్షలు. ఆరు పట్టణాలు, 627 గ్రామాలు ఉన్నాయి. మొత్తం జనాభాలో నూటికి 79 మంది గ్రీకులు, 18 మంది టర్కీవారు.

## అమెరికా గూఢచారి పవర్స్‌కు పదేళ్లు శిక్ష

కడచిన మే నెలలో సోవియట్ యూనియన్ గగన వీధిని అతిక్రమించి, గూఢచారి చర్యలు సాగించిన అమెరికా యు-2 విమానం చోదకుడు శ్రీ ఫ్రాన్సిస్ గారీ పవర్స్‌కు సోవియట్ సైనిక న్యాయస్థానం పదేళ్లు కారాగారశిక్ష విధించింది. ఈ పదేళ్ల శిక్షలోను మూడేళ్లు ఇతడు తప్పక ఖైదులో వుండాలి.

# విశ్వనాథమధ్యాక్కఱలు: వేములవాడశతకం

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

మంగళంబునఁ బెట్టి నన్ను వేయించి మాఱ్చుచున్నావ
యంగళంబునన నేకాయకిఁ బెట్ట నెవరు వద్దనిరి
ముంగలఁ బింగల దెసఁ గ్రిందఁ బై ముట్టించు భస్మ
శృంగారి! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి.

కనుచున్న వినుచున్న దెల్లఁ దెలిసికోఁ గలుగుట లోనఁ
దనరారు నొక తెలివిచేతనే కదా తాఁ దెల్వి నేన
యనుకోనవలెఁ గాక, తెల్వి నేను వేఱా! తెల్వి నీవ
యిన నేనో! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి.

నేనేమి సర్వమ్ము నిన్నుఁ దెలిసికొనువాఁడ మాత్ర
మైన దోఁ దెలిసికోఁబడెడు లక్షణ మది యేది నీది
నేనేమి జ్ఞాతను జ్ఞేయుఁడను నీకు జ్ఞేయత యొక్క
టే నకే వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి.

ఆనంద మొక్కఁడే నీ స్వరూప మంచన దాని యాను
పానులు తెలియ నైనవియె యనుభవింపను వలెఁ గాక
కానీ తెలిసికొన్నఁగాని యనుభవజ్ఞానంబు కలుగ
దే నాకు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి.

అనుభవించితిన నీవైన యానంద మప్పుడైనఁగాని
యనుభవించెడి వాఁడ నేను వేఱు వేఱగునె తా నదియు
ననుభవ మన్న శబ్దమ్ము నర్థమ్ము నడుగునే వాని
నెనుపనే వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి.

తెలిసికొంటకు నిన్నుఁ దొలుత నాలోనఁ దెలివి యుండవలె
తలఁపఁగా ననుభవించుటకు వలయు భూధాత్వర్థమైన
తొలివసు వది నేను కాను వీలులేదు రహస్య మింత
మొలయింతు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి.

# విశ్వనాథ మధ్యాక్కఱలు: వేములవాడ శతకం

ఒక తెల్లకుగ్గుపిండగింజ పోలిక నున్న కాలాణు
వేట శతసహస్ర వృద్ధినొంది సూర్యాచంద్రముల
విస్తృతియై కాలమై నీవు దానిలో తిరిసి గ్రాసిసేయ
నృత్యపాల వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి.

అణువైన కాలమ్ము నాల్గుభాగాలు నచ్చుమా తెలుపు
పౌనపాదుగా నలుపు సగముగా నల్పు ముప్పావు నలుపు
నగరిగాం దోల్లటి ముక్క యున్న శ్వేతమ్ము నీ లింగ
మిన ద్రుశా! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి.

దాసియంతెట నది మృత్యువు కరుదెంచు దాక నిట్లుండు
నే నిట్లు లుండుట నాకు నేమియు నిష్టము లేదు
ఏ నిట్లు లుండుట కిదు దయలేని యొంటియుంపు గాక
నే నెంతు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి.

చావు రానీయవు తొలంగ కుండ నిక స్మరియింపనీవు
భావితోచగనీవు చిత్రమును నిలంబడనీయవీవు
ఈవు కాదంచును నెఱవో ఓగనీయవు ముక్తి
హేవాక వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి.

గ్రహచారమునుబట్టి రాకపోకలు కైకోను నేను
గ్రహచార మది నీకు సంవిదాకార కైవల్యనాథ
నిహారింపుమీ! నాదు నీకయిన చిత్తవీథిలో నెపుడు
ఇహదూర వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి!

అసలు యథార్థంబు తెలిసి బ్రతుకుట యమిత కష్టంబు
మునరెసు మోహంబు బ్రతుకులోం దిరి పుట్టించు మోహ
విసరంబు వీసియు వాసనాశక్తి విడని బ్రతుకు
ఇసుకసీ వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి.

బ్రతుకుటయే యెంతో దినము దినము దుర్భర మయిపోయె
మతి సుఖవాంఛ యెక్కడిది సుఖ మన్నమాట కర్థమ్ము
వ్యక్తమయి శాంతి లేకున్కిం బ్రాణసంక్షోభమై మృతియె
హితమయి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి.

# ఆర్యుల తొలినివాసం భారతదేశం కాదా?

శ్రీ ఎస్. వి. శేషగిరిరావు

కడచిన యాభై అరవై ఏండ్లలో 'ఆర్యుల తొలి నివాసం' మీద అనేక తర్జనభర్జనలు జరుగుతూ వస్తున్నాయి. అనేకమంది ఉద్దండులైన విద్వాంసులు భిన్నభిన్న సిద్ధాంతాలను ప్రతిపాదిస్తున్నారు. తిరుగులేనివిగా కనిపించే అతిసామాన్య విషయాలను వీరందరూ గణనలోకి తీసుకోలేదు. వాటిని సమీక్షించటమే ఈ వ్యాసంయొక్క ముఖ్యోద్దేశం.

ఆర్యుల ఆదిమనివాసం మధ్యఆసియా అని ప్రొఫెసర్ లస్సెన్, స్పీగల్, ష్లెగల్, జెన్సన్ ప్రభృతులు ప్రతిపాదించారు. యూరప్ అని బోమ్మచ్ఛ, ఫాన్ హోవల్, క్యూనో, ఫ్రెడరిక్ ముల్లర్, లండల్ మొదలగువారు వాదించారు. ఉత్తర ధ్రువమని డాక్టర్ వాడెన్, లోకమాన్యతిలక్‌లు నిరూపించేందుకు ప్రయత్నించారు. కాని వీరందరూ ఆర్యులు భారతదేశంలో జనించలేదనిమాత్రం ఏకాభిప్రాయంతో ఉన్నారు. ఈ సిద్ధాంతాలను ఖండిస్తూ ఆర్యుల తొలినివాసం భారతదేశమే అనే పాశ్చాత్య పండితులు లేకపోలేదు. (ఫోచీచ్, లూయిన్, జన్‌లీయట్). ఎంతమంది పాశ్చాత్యులు ఒక సిద్ధాంతానికి అనుకూలురు, ప్రతికూలురు అని వ్రాసుకొనటంవల్ల చేకూరే ప్రయోజనం అంత ఉండదు. స్థూలంగా సమస్యను పరిశీలించటం అవసరం.

(1) వీటన్నిటిలోనూ ఎక్కువబలమైనదిగా కనిపించేవాదం లోకమాన్య తిలక్‌ది. వారు సంస్కృత భాషలో ఉద్దండపండితులు. తమ విజ్ఞానాన్నంతా మూసలోపోసి, వేదాలను గాలించి ఉపపత్తులు చూపుతూ, ఆర్యులు ఉత్తర ధ్రువవాసులని సిద్ధాంత నిర్ధారణ చేశారు. వారు భూగర్భ పరిశోధలను ఆధారంగా తీసుకోలేదు. ఆ సిద్ధాంతంయొక్క శాస్త్రీయతను శంకించటంకూడా కష్టం.

కాని తిలక్ జీవించి ఉండగా ఖగోళ విజ్ఞానానికి సంబంధించిన సత్యం ఒకటి బయలుపడలేదు. ధ్రువమనేది స్థిరంగా ఉండక వలయాకారంలో కదలుతూ ఉంటుంది. ఈ చలనాన్ని 'ప్రిసెషన్' అని అంటారు. భూమి యిరుసు ఖగోళాన్ని ఎక్కడైతే స్పృశిస్తుందో ఆ బిందువు ధ్రువము. ఆ బిందువు ఏర్పడేచోట ఏదైనా నక్షత్రముంటే దాన్ని ధ్రువనక్షత్రమనివ్యవహరిస్తారు. మరికొన్ని వేల సంవత్సరాల తర్వాత ధ్రువం ప్రస్తుతం ఉన్న ధ్రువనక్షత్రాన్ని వదలి కదలిపోతుంది. 10 లేక 12 సంవత్సరాల తర్వాత 'వీగా' నక్షత్రం దగ్గరగా ధ్రువబిందువు చేరుకుంటుంది. అప్పుడు దాన్ని ధ్రువనక్షత్రమని అనవచ్చును. వీగా నేటి ధ్రువానికి 6° దూరంలో ఉంది.

ఈ కారణంగా, వేదాలు రచించబడేనాటికి ధ్రువం బీహారు-ఒరిస్సా ప్రాంతాలలో ఉండి క్రమంగా ఈశాన్యంగాను, పశ్చిమంగాను, ఉత్తరంగాను జరిగి నేటి స్థానానికి చేరుకొంది. కాబట్టి ఆర్యులు యిక్కడివారే. వారు కదలలేదు. ధ్రువమే వారిని వదలివెళ్ళింది. దురదృష్టవశాత్తు తిలక్ జీవించి ఉండగా ఈసత్యం తెలియనందువల్ల ఆయన ఆర్యులు ఉత్తర ధ్రువవాసులనే సిద్ధాంతంతో ఆగిపోయారు. లేనిచో వారు తప్పక దీన్నికూడా సమన్వయపరచి ఆర్యుల తొలినివాస మిదేనని సిద్ధాంతీకరించేవారనటంలో సందేహం అవసరం లేదు.

పాట్నా విశ్వవిద్యాలయంలో వృక్షశాస్త్ర పరిశోధనలు జరుపుతున్న డాక్టర్ బీర్‌బల్ సహాని బీహారులో కొన్ని భూగర్భ పరిశోధనలు సాగించారు. వారికి ధ్రువమండలంలో నివసించే వృక్షజంతు అవశేషాలు భూగర్భంలో కనిపించాయి. తమ పరిశోధనలను వారు సమీక్షిస్తూ ఒకప్పుడు ధ్రువమండలం బీహార్ - ఒరిస్సాలలో ఉండిన దనేందుకు బాగా ఆధారాలున్నాయని అన్నారు.

కాబట్టి తిలక్ సిద్ధాంతం అసంపూర్ణంగా ఆగిపోయిందేకాని అది ఏవిధంగానూ 'ఆర్యులు యిక్కడివారే' అనే సిద్ధాంతాన్ని ఖండించదు.

(2) మహాభారత రచనాకాలంమీద పెద్ద వివాదాలేమీ లేవు. మనదేశంలో పసిపిల్లలకు కూడా రామాయణం తర్వాత మహాభారత చరిత్ర జరిగిందని స్పష్టంగా తెలుసు. రామాయణం అసలు సంస్కృత సాహిత్యంలోనే తొలికావ్యం. రుజువు కూడా కావాలంటే

(5) ఆర్యులకు దస్యుదాస్యులకు మధ్యగల భేదం జాతిపరమైందికాదు. "ఆర్య" అనేపదం జాతిని సూచించదు. అది గుణవాచకం. ఆర్యుడంటే సద్గుణ సంపన్నుడని సభ్యతగలవాడని ధర్మాచరణుడని అర్థం. రాక్షసరాజు రావణుడుకూడా జన్మచేత బ్రాహ్మణుడే. కాని ధర్మాన్ని అనుసరించనందువల్ల రాక్షసుడని పిలువబడ్డాడు. అతడు పైగా శివభక్తుడు. సామవేదానికి స్వరాన్ని శ్రుతిని రాగాన్ని కూర్చిందికూడా రావణుడనే అంటారు. ఒకచోట రావణుని సంబోధిస్తూ విభీషణుడు "ఆర్యా" అన్నాడు. మండోదరి ఆర్యుల ఆచారానికి అనుగుణంగా, ఎప్పుడు రావణుని సంబోధించినా "ఆర్యపుత్ర" అనే అన్నది. ఈనాటికీ శివాలయాలలో ఉత్సవాలు జరిగేటప్పుడు రావణ వాహనాన్ని ఉపయోగిస్తుంటారు. జాతిదృష్ట్యా రావణుడు యిక్కడివాడే. కాని దుష్టుడు కావటం మూలాన, ధర్మాన్ని అనుసరించనందున దస్యుడుగా నిందించబడ్డాడు. మొత్తం భారతదేశమంతా పంచగౌడ, పంచద్రావిడ స్థానాలుగా విభజించబడింది. ఈ మొత్తంభాగంలో నివసించేవారంతా ఆర్యులే! హిమగిరిమీద కూర్చున్న పరమశివునిగూర్చి పార్వతి కన్యాకుమారివద్ద తపస్సు చేసింది!

(6) పాశ్చాత్య చరిత్రకారులు ఆర్యులు ద్రావిడులను, దస్యులను చిత్రవధ చేశారని వ్రాశారు. ఋగ్వేద కాలంనాటి ఆర్యులు దురాక్రమణదారులు కాదు. దౌర్జన్యాలనుంచి తమను సంరక్షించమని కోరినట్లుగా వారు దేవతలను ఆరాధించటంలోనే ఇది తెలుస్తున్నది. ఆర్య ధర్మాన్ని నిరసించినవారు చేస్తున్న దుర్మార్గాలనుంచి సమాజాన్ని, వ్యవస్థలను రక్షించుకొనేందుకు వారు ఈ శత్రులతో యుద్ధంచేయాక తప్పింది కాదు. అప్పుడప్పుడూ విదేశీ శత్రులతో కూడా స్థానికులు చేతులు కలిపేవారు. 6

విదేశాలనుంచివచ్చే దురాక్రమణదారులను కూడా ఆర్యులు ఎదుర్కోవలసి వచ్చేది. ఈ దురాక్రమణదారులను గురించిన, వారి నగరాలను గురించిన వర్ణనలు కొన్ని వేదాలలో యివ్వబడ్డాయి. ఆ నగరాల పేర్లు కూడా అందులో పేర్కొనబడ్డాయి. వీటిలో కనీసం ఒక్క నగరాన్నయినా ప్రాచీన దక్షిణ భారతనగరాలతో పోల్చ వీలుందా? పాశ్చాత్య చరిత్రకారులు ఈ విషయంలో రుజువులు చూపలేకపోతున్నారు. 7

(7) మొహెంజదారో, హరప్పాలలో బయల్పడిన త్రవ్వకాలనుబట్టి ఆర్యులు రాకముందే అక్కడ ద్రావిడులు మంచి నాగరికతను స్థాపించుకున్నారనీ, వారి నగరాలను ఆర్యులు దగ్ధంచేశారనీ పాశ్చాత్యులు వ్రాశారు. ద్రావిడుల నాగరికత ఆర్య నాగరికతకన్న ఉచ్చమైనదని మార్క్సిస్టులు అభిప్రాయపడుతున్నారు. మనం ఋగ్వేద నాగరికతను సింధు నదతీర నాగరికతతో పోల్చిచూస్తే, ఈ రెండూ ఒకటేననీ, కాలంలో కొంత భేదం ఉంటే ఉండవచ్చని తెలుస్తుంది. సింధు ప్రజలు శైవులు, లింగార్చకులు. సింధులోయ త్రవ్వకాలలో బయల్పడిన నాణెములు, ఆభరణములు, జంతువుల చిత్రాలు ప్రతిమలు మొదలైనవన్నీ ఋగ్వేదపు వర్ణనలతో సరిపోతున్నవి. ఇంద్రుడు దగ్ధంచేసిన పురాలు కూడా యివే కావచ్చు.8 ఈ పోరాటాలు ఆర్యుల మధ్య జరిగిన అంతర్యుద్ధాలనటం సబబుగా ఉంటుంది. విదేహ కూడా ఆర్యుల మధ్య జరిగిన అంతర్యుద్ధాలకు బలియై పోయినట్లు శతపథ బ్రాహ్మణంలో ఉంది. కాబట్టి సింధు లోయలో కూడా వికసించింది ఆర్య నాగరికతే. సింధు నాగరికత ద్రావిడుల దనటం, అది ఆర్యుల, దూకుడులకు కూలిపోయిందనటం భావ్యంకాదు.

## 2

పాశ్చాత్యదేశాలలో సమాజశాస్త్రకారులు మొట్టమొదట కొన్ని సిద్ధాంతాలను ఊహించుకొని తర్వాత వాటి రుజువులకోసం ప్రయత్నించారు. చరిత్ర విషయాలలోను అంతే. డార్విన్ పుట్టకముందే అతి ప్రాచీన చరిత్రను రాతియుగాలక్రింద లోహయుగాల క్రింద విభజించారు. కాని డార్విన్ తన సిద్ధాంతాన్ని నిర్వచించటంలో ఈ చారిత్రక వాదానికి కొంత పట్టు దొరికినట్లయింది. అయితే సుమేరియా, అసీరియా, బాబిలోనియా, ఈజిప్టు నాగరికతల అవశేషాలు అలాంటి వాదానికి బలాన్ని చేకూరిస్తే చేకూర్చవచ్చు. నాగరికతలో ఈ దేశాలకు భారత దేశానికి వేల సంవత్సరాల భేదమున్నప్పుడు అవే సూత్రాలు భారత

6. U. K. Apte.

7. Dr. Ambedkar.

8. రాధాకుముద్ ముఖర్జీ : Hindu civilization.

# ఆర్యుల తొలినివాసం భారతదేశం కాదా?

దేశంపట్లకూడా అన్వయించటం దుస్సాహసమే అవుతుంది. అయితే అందుకు కారణాలు లేకపోలేదు.

ఋగ్వేద వర్ణనలనుబట్టి చూస్తే భారతదేశం ఆ నాటికే మహోన్నత నాగరికతకు చేరుకుందని తెలుస్తుంది. ఆనాటికి ఈ అసీరియా మొదలైన దేశాలలో నాగరికత కాదు గదా దాని తొలిరూపంకూడా ఏర్పడలేదు. మనుషులు పశువులకుమల్లే అడవుల్లో నగ్నంగా తిరుగుతూ, అవసరం వచ్చినప్పుడు ఆహారాన్ని తింటూ కామతృష్ణ తీర్చుకుంటూ బ్రతికేవారు. కాని కాలాంతరాలవల్ల ఇటీవలి కాలంలో పాశ్చాత్యదేశాలు భౌతిక నాగరికతలో అసాధారణ విజయాలు సాధించాయి. భారతదేశం వెనుకపడిపోయింది. చివరకు పాశ్చాత్యభౌతికశక్తికి బానిసైపోయింది. తాము అధికులమనేభావం సెమిటిక్ రక్తంలో మొదటినుంచీ జీర్ణించిపోయినా అది క్రమంగా బలిసిపోయింది. తమ సిద్ధాంతాలకన్న గొప్పవి లేవనీ, తమకు మించినవారు లేరనీ, భారతదేశం శాశ్వతంగా తమ పాదసేవచేయాలని ఉర్రూతలూగారు. ఇవాళ మనం పాశ్చాత్యులపాలనకింద లేకపోయినా, అదేగర్వంతో మన మీద విరుచుకపడుతున్న సెమిటిక్ సిద్ధాంతం ఇంకొకటుంది. అదే కమ్యూనిజమ్. వీళ్ళెవ్వరూకూడా భారతదేశం ఆధిక్యమును గుర్తించే స్థితిలో లేరు. అందువల్ల భారత చరిత్రకు మసిపూసి వక్రభాష్యాలు చెప్పి దాని ఘనతను త్రొక్కివేసేందుకు అంతా ప్రయత్నిస్తున్నారు.

ఈ ప్రయత్నంలో మొదటి మెట్టుగా వీరు వేదాలకాలనిర్ణయం చేసేందుకు పూనుకున్నారు. ఆ ప్రయత్నంలో భారతదేశపు నాగరికత బాబిలోనియా అస్సీరియా నాగరికతల తర్వాతిదే నని వ్రాశారు. భారతదేశంలోని తొలి నాగరికతను నిన్న మొన్నటిదిగా చిత్రించటంవల్ల పైన పేర్కొన్న ప్రయోజనం కొంతవరకు నెరవేరుతుంది. వేదాలలోని విషయాలు ఆధారంగా తీసుకొని అలాంటి నిర్ణయాలకు వస్తే దాన్ని ఆమోదించవచ్చు. కాని వారు బాబిలోనియాలోని భూగర్భ పరిశోధనలు ప్రమాణంగా తీసికొని మనదేశంలో అక్కడక్కడా దొరికే కుండ పెంకులు ఎముకలు ఆధారంగా భారత చరిత్ర ప్రాచీనత మీద దెబ్బతీశారు. ఈజిప్టు నాగరికత మనకన్న పురాతనమైనదని చెపుతూ, వేదాలు క్రీ. పూ. 1500 నాటివని నిర్ధారణచేశారు. సుమేరియా నాగరికత మాత్రం క్రీ.పూ. 6000–4000 నాటిదట! ఈ నిర్ధారణ లన్నీ ఊహా కల్పితాలు. ప్రాచీన నాగరికతల కాలాన్ని నిర్ణయించటం సులువేమీ కాదు. అక్కడక్కడ దొరికే పుర్రెలు కుండలు ఇవి ఎంతవరకూ సరియైన చరిత్రను అందివ్వగలవు? మహెంజొదారో హరప్పాలలో త్రవ్వకాలు జరిగేవరకు భారత నాగరికత మరీ ఇటీవలిదని మనకు పాఠాలు చెప్పారు. ఆ త్రవ్వకాలలో అంతా మారిపోయింది. మన చరిత్ర - సంస్కృతి, వీటి ఆధిక్యము వాటిలో అంతర్గతం గాగల విశేషంమీద కాక అక్కడక్కడా ఆకస్మికంగా దొరికే శిథిలాలమీద ఆధారపడిపోయిందన్నమాట! పశ్చిమాసియాలోని సుమేరియా నాగరికతను పాతరాతియుగంగా, కొత్తరాతియుగంగా విభజించవచ్చు కాబట్టి ఇక్కడి చరిత్రను కూడా అలా విభజించాలి! ఆ విభజనకోసం అక్కడక్కడా ఎముకలు దొరుకుతున్నాయని చూపించాలి. అంతేకాని సంస్కృతభాషలో దొరికే సాక్ష్యాలను వీరు గుర్తించరు. మహాభారతంలో ఆనాటి నక్షత్రాల స్థానాలను నిర్ణయిస్తూ కొన్ని వర్ణనలున్నాయి. వీటిని ఆధారంగా చేసుకొని ఖగోళశాస్త్రపు సిద్ధాంతాలు ఆధారంగా లెక్కకడితే మహాభారత నాగరికత క్రీ.పూ. 3000 సంవత్సరాల నాటిదని తేలింది. ఆధునిక ఖగోళ శాస్త్రం తప్పా? లేక మహాభారతవర్ణనలను మనం త్రోసివేయాలా? కాని పాశ్చాత్యులు మాత్రం ఎముకలు త్రవ్వి తీసి మహాభారత నాగరికత క్రీ. పూ. 1000 నాటి దని వ్రాస్తారు. ఈ రెంటిలో ఏది శాస్త్రీయమైనది? ఈ విధంగా మన తొలినాగరికతా కాలాన్ని నిర్ణయించటంలో దాన్ని సాధ్యమైనంత వెనకకు నెట్టి మన ఆధిక్యముమీద తొలిదెబ్బతీశారు.

ఎంత దెబ్బతీసినా భారతదేశపు గొప్పతనాన్ని తుడిచివేయటం సాధ్యమయ్యే విషయం కాదని తెలిసేసరికి ఇంకో పాచికవిసిరారు. భారతదేశానికి వలసపోయి అక్కడ నాగరికతను వ్యాపింపజేసిన ఆర్యులకు ఐరోపా జాతులకు మూలజాతి ఒకటేనని ఇంకో సిద్ధాంతం లేవదీశారు. దీని ఉద్దేశం కూడా అదే. "మేమూ ఆర్యులూ ఒకేస్థానంనుంచి వలసపోయాం. ఆర్యుల నాగరికత వికసిస్తూ వికసిస్తూ ఒకచోట ఆగిపోయింది. మేం మాత్రం పురోగమిస్తూనే ఉన్నాం." అని చెప్పవచ్చు.

ఇంకో కారణం కూడా ఉంది. అమెరికా ఆస్ట్రేలియాలలో శాశ్వతంగా పాతుకుపోయినట్లుగా ఇక్కడ కూడా స్థిరపడిపోవాలని కలలుగన్నారు. అందుకోసం భారతదేశం ఎవ్వరి సొంతమూ కాదని ఒక సిద్ధాంతాన్ని రూపొందించవలసిన అవసరం ఏర్పడింది. ఈ దేశంలోని ఏ జాతీ భారతీయమైనది కాదని, ఆర్యులు స్థానికులైన ద్రావిడులను దస్యులను అణగద్రొక్కి ప్రవేశించారనీ, ఆర్యులకన్నా బలవంతులు గాబట్టి ముస్లింలు తర్వాత ప్రవేశించారనీ, ముస్లింలకన్నా మేము బలవంతులం గాబట్టి పరిపాలిస్తున్నామనీ, దానిలో తప్పేమీ లేదనీ, ఇది అతిసహజమనీ— వాదించవచ్చు. అందుకే ఈదేశం ఆర్యుల సొత్తు కాదనీ, ఎవరికి బలం ఉంటే వారక్కడ పాలన సాగించవచ్చునీ మనకు నూరిపోశారు.

విదేశీయులు వెళ్ళిపోయినా వారు వ్రాసిన చరిత్ర పాఠాలు మనపిల్లలకింకా బోధించబడుతూనే ఉన్నాయి. వాటిని సంస్కరించటంలో ఇప్పటికే ఆలస్యమయింది. మనం త్వరపడాలి.

# అనురాగం - ఆత్మహత్య

## శ్రీ ఆర్. ఎం. చిదంబరం

మనసు సంధ్యాకాశం—ఏ క్షణంలో రంగులు ఎలా మార్చుకుంటుందో ఏ బాహ్యశక్తీ నిర్ణయించలేదు. చేసే పనుల మంచిచెడ్డల్ని, సవ్యాపసవ్యాలను క్షణానికో రకంగా సమర్థిస్తుంది. అనుభవం మీద నిజం తెలుసుకోమని ప్రోత్సహించి, చీకట్లోకి విసిరివేస్తుంది. కళ్ళు మూతలుపడి, మెదడు మొద్దుబారాక కాని ఈ నిజం తెలిసిరాదు. తెలిసిన తరువాత చేసే దేమీ వుండదు కనక తత్వచింతనలోకి దిగిపోవాలి.

రాధ అద్దంముందు నిలబడి 'ఎందుకు? ఏమిటి? ఎవరికోసం?' అన్న ప్రశ్నలకు సమాధాన మివ్వలేక అజ్ఞాతంలో దాక్కున్న సౌందర్యాన్ని 'ఓ కొత్త మార్గంవెంట వెడదాం – రమ్మం'టుంది. అది వెయ్యి గులాబీ పువ్వుల్లా వికసించి, పరిమళాన్ని వెదజల్లి, అనురాగాన్నీ, ఆశల్ని రేకెత్తించి సుషుప్తిలో మునిగిపోవాలనుకుంటోంది. ఈ మహాప్రవాహం తన అదుపు దాటింది. స్వర్గంలో ఆవులించి, వెన్నెట్లో నిద్రపోయి, చల్లటి నీటితుంపరలమధ్య మేల్కొన్న ఆ సౌందర్యం వన్నెలు దిద్దుకుంది. నగిషీలు గీసింది.

తన అందం ఓ జీవానికి ఆకృతి నిస్తోంది!... గర్వించతగ్గ విషయం! మనసులో ఉదయమైన ఈ కోర్కెలను బలవంతాన అణచివుంచి ఆచరణలో పెట్టాలి. ఎవరికన్నా తెలిస్తే విమర్శిస్తారు. సలహాలిస్తారు.

'అమ్మాయ్! ఎక్కడికో బయలుదేరినట్టున్నావ్! అంత అవసరం కాకపోతే మానేయకూడదూ?...వర్షం వచ్చేట్టుగా వుంది.'

నాన్న మాటల్లో కాఠిన్యంలేదు.

'కాలేజీ లెక్చరరు ఒకావిడయింటో టీపార్టీ వుంది. రమ్మని మరీ మరీ చెప్పింది. వెళ్ళక తప్పదు.' అని నసిగింది.

'అలాగా!...వాళ్ళందర్నీ కలుసుకోవాలని ఎంతోకాలంనుంచి అనుకుంటున్నా, అవకాశం కలిసిరావటంలేదు – నీలాగే తతిమావాళ్ళందరూ వస్తారు నేనూ వస్తాను.'

రాధ గుండెలో రాయిపడింది. ఒక్క క్షణంలో వెయ్యి సూర్యులుదయించినట్టు ముచ్చెమటలుపోశాయి. అమ్మో!...నాన్నవస్తే తన పథకం తల్లకిందులవుతుంది.

ఏమనుకున్నారో యేమో నాన్న ఫక్కున నవ్వారు.

'నీ స్వేచ్ఛకు అడ్డురానులే!...ఊరికే అన్నాను- వెళ్ళేటప్పుడు కారులో వెళ్ళు – నడచి వెళ్ళకు – మధ్యలో వర్షం పట్టుకుంటే చిక్కు. డ్రైవరుతో చెప్పి వస్తాను.' అని బయటకు వెళ్ళారు. రాధ గట్టిగా నిట్టూర్చి పుస్తకంలో దాచివుంచిన వుత్తరంతీసి మరోసారి – కాదు – పదోసారి చదువుకుంది.

'మైడియర్ రవణా!

మనం కలుసుకుని చాలాకాలమైంది. ఎన్నోసార్లు జీవితపు విలువల్ని గురించి చర్చించుకున్నాం. మన అభిప్రాయాలు ఎప్పుడూ ఎదురెదురుగా పరుగెత్తాయి. ఈనాడు నిజం తెలుసుకున్నాను మిత్రమా!...జీవితానికి భవిష్యత్తు, వర్తమానం లేవు. గడచిన సంఘటనల మీద నిర్మితమవుతుంది. నిరాశ – ఆశాభంగం – అహంభావం – చీకటిలో గొంతుకోయటం – వీటిని కరిగించి పోతపోస్తే జీవితం తయారవుతుంది. ఆశలు – ఆశయాలు – వెలుగు – అనురాగం – ఇవన్నీ విలువలేని ఆభరణాలు. వాటితో జీవితాన్ని అలంకరించటానికి ప్రయత్నిస్తాం – ఒక్క అరంగుళం దూరంలోవుండగా ఏదో శక్తి నీ చేతుల్లో జీవాన్ని లాగివేస్తుంది ఆభరణం కిందపడి ముక్కలవుతుంది. మళ్ళీ ఆ ముక్కల్ని ఏరి అతికి అలంకరించే ప్రయత్నంలో పడతాం. సూక్ష్మంగా ఆలోచిస్తే ఇదే బతుకు. ఈ నిజం తెలుసుకోటానికి ఎదురుగాలులతో పోరాడి, చిక్కి, శల్యమై, కృశించిపోవాలి. అప్పుడు తెలిస్తేమాత్రం ఏం లాభం? నిరాశలో సమాధి చేయవచ్చు – కనుక ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాను. విన్నాక జడుసుకోకు – ఇదే నా చివరి పలకరింపు – మరి మనం కలుసుకోం – ఒక్క

నెలరోజులు దాటాక భూమికీ, నాకూ బంధంవుండదు. అంగారకగ్రహంలో రహస్యాలు కనుక్కుంటాను. వృథాగా నన్ను ముక్తిమార్గంవైపు పోనీయక అడ్డు పడకు —'

ప్రతిమాటా గుండెను చీల్చివేసింది. ఇలాంటి వ్యక్తులు అద్దంలో తమ ప్రతిబింబం చూసుకుని 'అబ్బే! ఇది నా ముఖం కాదు.' అంటారు. 'కాదయ్యా! ఈ ముఖం అచ్చంగా నీదే!' అంటే 'ఋజువు చూపించు' అంటారు గామోలు! రాధ ఆలోచనలు కొన్నిగంటలు వెనక్కి పరుగెత్తాయి.

ఇంగ్లీషు లెక్చరరు సెలవుపెడితే ఆ క్లాసుకు తను వెళ్లవలసివచ్చింది. విద్యార్థుల్ని ఎదుర్కొనటం మెలా గన్న భయంతో క్లాసులో అడుగుపెట్టింది. వెంటనే వెనక బెంచీలనుండి అస్త్రాలు దూసుకువచ్చాయి.

'బ్యూటీ పర్సానిఫైడ్ !'

'క్రీమ్ ఆఫ్ సొసైటీ!'

'కాదు...హెలెన్ ఆఫ్ ట్రాయ్ - మనవారితో పోలిస్తే రంభ, ఊర్వశి, మేనక...'

రాధ ఏమీ అనలేక నవ్వుకుంది. అయినా వాళ్ళను నిందించి ప్రయోజనంలేదు. తను అందంగా వుండబట్టి మందబుద్ధులు చురుకుగా పనిచేస్తున్నాయి. ఆ గంట కాలం ఎలాగో గడిపేసి తిరిగి వస్తుంటే, టేబిలుమీ దున్న పుస్తకం కనపడింది - ప్రపంచ చరిత్ర అది - కవరుమీద మూర్తి పేరుంది. క్రిందటి పీరియడు హిస్టరీ కనక వచ్చి మర్చిపోయుంటాడు. తిరిగిచ్చేద్దా మని పుస్తకం తీసుకుని బయటకు వచ్చింది. 'నన్ను మర్చిపోకు సుమా!' అన్నట్టు ఆ వుత్తరం జారిపడింది. రహస్యాల్ని శోధించటం స్త్రీల సహజ గుణం - తమ వల్ల కాకపోతే మగవాణ్ణి కనుక్కోమని పీక్కుతిం టారు. అతను, పాపం శ్రమపడి తెలుసుకుంటాడు. 'సరే! ఇంక నీ అవసరంలేదు - వెళ్లు' అంటారు. అది మూర్తి తన మిత్రుడు రమణకు రాసిన వుత్తరం - నెల రోజుల్లో అతను ఆత్మహత్య చేసుకుంటాడని దాని తాత్పర్యం.

రాధ మెల్లగా అడుగులు వేస్తూ స్టాఫ్ రూం చేరుకుంది. కిటికీదగ్గర నిలబడిచూస్తే మూర్తి కనిపిం చాడు. అతను వేసే ప్రతి అడుగులోనూ మృత్యువు తాలూకు నీడలు కనిపించాయి. కంటి కెదురుగా కని పించే వస్తువును గురించైనాసరే, అవసరం వస్తేనేకాని ఆలోచించం. అతను సరిగ్గా తల దువ్వుకోడు. చక్కటి దుస్తులు వేసుకుని టిప్‌టాప్‌గా కాలేజీకి రాడు. ఒంటరిగా, దూరంగా వుంటాడేకాని కలుపుగోలుతనం అతనికి తెలియదు: అలా అత నెందుకున్నాడని ఎవరూ ఆలోచించలేదు. ఈ వుత్తరం రహస్య మందిరపు తాళంచెవి అందిచ్చి, లోపల ఏముందో పరీక్ష చేసుకో మంది. ఇంతకూ అతని కా కోర్కె ఎందుకు కలిగింది? ఆత్మను చంపుకోవాలన్న అభిప్రాయం ఏదో లోపం ఉంటేనేకాని కలుగదు. అతనికి ఏం తక్కువ?

విద్యార్థు లందరూ గౌరవిస్తారు. ఏ విషయం మీదైనా సరే, అనర్గళంగా ఉపన్యసిస్తాడని వినికిడి. పెద్ద ఆస్తిపరుడు - వాటాలకోసం ఎగబడే వా రెవరూ లేరు. 'లేమి' అతని సమస్యకాదు...పోనీ అంద చందాలు? ఊహు...అసలు కాదు - విశాలమైన కళ్లు గొంభీర్యంగా చూస్తుంటే చాలు - స్త్రీ హృదయం తేలిగ్గా ఆకర్షింపబడుతుంది. అతను ఏ అమ్మాయినైనా ప్రేమించి ఓడిపోయుండవచ్చు - మగవాణ్ణి ఆడించే శక్తి ఒక్క ఆడదానికే వుంది. వెదకి వెదకి ఏనిర్ణయా నికీ రాలేక విసుగెత్తి రాధ ఆలోచించటం మానుకుంది. —ఎలాగైనా మూర్తిని బలవంతంగా లాక్కొచ్చి నవ్వుల్లోకి విసిరేయాలి - జీవితంలో వెలుగు కూడా వుందని గ్రహించేట్టు చేయాలి.

కారు ఓ ఇంటిముందు ఆగింది.

అడుగులు భయంతో ముందుకు పడ్డాయి. వెయ్యి మాటలు అనాలనుకుంటే ఒక్కమాట వెలువడుతుంది. ఇంటి కెదురుగా చిన్న పూలతోట - మల్లె - గులాబీ - చంద్రకాంతం - ఎన్నో రకాలు - చిన్న స్వర్గంలా ఉంది. ప్రకృతి సౌందర్యానికి మెరుగులు దిద్దినగర్వంతో రంగులు పూసిన ఆనందంతో - మొక్కలు తల లూగి స్తున్నాయి.

హాల్లో అడుగుపెట్టింది. ఎవరూ లేరు - గోడ గడియారం మాత్రం నిశ్శబ్దాన్ని చీల్చివేస్తోంది. ఎవర్ని పిలవటం? ఏమని పిలవటం? తన రాక అసందర్భం గానూ, సంశయాత్మకంగానూ వుంటుంది. కాలేజీ విద్యార్థు లెవరైనా చూస్తే ఏమనుకుంటారు? ఇంకా నయం. మూర్తి వూరిబయట ఉండబట్టి ముళ్ళపొదల్ని దాటుకు రాగలిగింది.

'ఎవరమ్మా మీరు?...ఏం కావాలి?' అంటూ ఓ ముసిలాడు వచ్చాడు.

చేతిలో 'వాటర్ కాన్' వుంది. తోటమాలి కావచ్చు.

'మూర్తిగారు లేరూ?'

'ఇంకా యిస్కూలునుంచి రాలేదండి.'

'స్కూలు కాదు. కాలేజీ అను. అదేవిటి? కాలేజీ రెండు గంటలకే అయిపోయింది కదా! ఇంకా రాకపోవట మేం? నీతో ఆలస్యంగా వస్తానని చెప్పి పోయారా?'

'అదేం లేదండి - ఆయన ఎప్పుడొస్తారు - ఎప్పుడెడతారు ఆయనకే తెల్దు. ఆ దేవుడిక్కూడా తెల్దు. ఉన్నట్టుండి ఎడతారు. ఒక్కోనాడు అప లింటికి రానేరారు. ఈమధ్య మరీ అధ్వాన్నమైపోయింది.' అతను ఛటుక్కున ఆగిపోయాడు. 'ఇదేవిటి! ముక్కూ మొహం తెలియని అమ్మాయి ముందు యజమాన్ని గురించి చెప్పటం ఎంత పొరపాటు!' అన్న భావన కళ్ళల్లో కదలింది. అది సహజత్వానికి ప్రతిబింబం - మనసులోవున్న ఆ వేదనను ఎవరితోనైనా నివేదించాలి; దానికి సందర్భాసందర్భాలు అవసరంలేదు. మనసు తేలికయ్యాక తప్పు తేటతెల్లమవుతుంది. ముసలాడు మూర్తి ప్రవర్తన చూసి విసుగెత్తి, ఎవరితోనైనా చెప్పుకోటానికి అవకాశంకోసం ఎదురుచూస్తున్నట్టనిపించింది. 'సరే!...నీపని చూసుకో! నేను ఆయన వచ్చేదాకా ఆగుతాను.' రాధను రెండుక్షణాలు ఆశ్చర్యంగా చూసి గొణుక్కుంటూ పోయాడు ముసలాడు.

రాధ గదంతా కలయచూసింది. ప్రస్తుతం ఆమె ఉన్నది డ్రాయింగు రూం. రాధ నవ్వుకుంది. అదో 'వేస్టు పేపర్ బాస్కెట్'లా వుంది. కిటికీ వారగావున్న టేబిలుమీద మడతలుపడి సగం వెలిగిన టేబిలుక్లాతు పేపర్ వెయిట్ ను ఎదిరించి గదంతా తిరగాలంటోంది. గాలి తోడువచ్చినా, పేపర్ వెయిట్ మాత్రం భల్లూకంలా పట్టుకుని వదలటంలేదు. తల్లక్రిందుగాపడిఉన్న ఆష్ట్రే - కిటికీదగ్గర సాలెపురుగుల సమ్మేళనం - చిందరవందరగాపడివున్న పుస్తకాలు, వంకరగా తిరిగిన గోడమీది ఫోటోలు - సూక్ష్మంగా పరిశీలిస్తే, ఆ గదిలో ప్రతివస్తువూ సత్యాగ్రహం చేస్తున్నట్టనిపించింది.

ఒక కాలేజీలెక్చరరు ఇంత అశ్రద్ధగా వుంటాడని ఆమె వూహించలేకపోయింది. మనోవికాసానికి సరైన వాతావరణం అవసరం. తియ్యగా నవ్వుతూ తిరిగే మనుష్యులు - శుభ్రంగా, వర్షానికి తడిసి ఆరిన సముద్రంతీరంలావున్న యిల్లు—చక్కగా అమర్చబడిన వస్తువులు. ఇవన్నీ మనిషి మనసుకు ఆహ్లాదాన్ని కలిగించి, ఇంకా-ఇంకా-కాలపు అవధులు దాటేవరకూ జీవించాలన్న కోర్కెను కలిగిస్తాయి. కుళ్ళు, దగా, మురికి అవినీతి వున్నచోట మానవుడు మృత్యువుకు భయపడడు. చందమామనుచూసి 'కారు మబ్బు' అంటాడు. చల్లగాలి సోకితే 'అగ్నిజ్వాల' అంటాడు.

రాధ టేబిలుక్లాతు సరిచేసి పుస్తకాలన్నీ సర్ది వుంచింది. ఆష్ట్రే టేబిలుమధ్య వుంచింది. పది రోజులక్రితం సమాధిచేరుకున్న ఫ్లవర్ వేజ్ లో పువ్వులు తీసిపారేసి చంద్రకాంతాలు - గులాబీలు కోసుకొచ్చి వుంచింది. తమ ఏకాగ్రతను చెడగొట్టినందుకు సాలెపురుగులు కళ్ళెర్రచేసి కబళించలేక దూరంగా కదలిపోయాయి. మధ్యమధ్య మూర్తి వస్తున్నాడేమోనని వీధివంకచూసేది. వంటగదిలో సామాను కూడా సర్దేసరికి నుదుటిమీది నీటిబిందువులు కిందకు జారాయి. ఆ క్షణంలో కలిగిన తృప్తిని వూహలోకూడా కొలవలేం. ముసలాడు వాటర్ కాన్ తీసుకొచ్చి టేబిలుమీ దుంచాడు.

'ఏయ్ ముసలాడా! నీకు మతిలేదూ?...ఇంతసేపు కష్టపడి గదంతా బాగుచేస్తే ఆ డబ్బా అక్కడ పెడతావేం?...బయటే దాని స్థానం. ఈ ఇల్లు వూడ్చటం - సామాను సర్దటం - ఏవీ నీ పనులు కావా?' అని గద్దించింది. తాత కొంచెం భయపడ్డాడుకూడా. ఒకవేళ మూర్తి ఎవరితోనూ చెప్పకుండా చెయ్యకుండా గప్ చిప్ గా ఆమెను పెళ్ళి చేసుకున్నాడేమో!

'అబ్బే! అదేం కాదండి!...మెట్టరుగోరు ఎప్పుడూ ఈ పని సెప్పలేదు. అందుకే మన కెందుకని వూరుకున్నా.' అన్నాడు వెకిలిగా నవ్వుతూ. ఏదో జ్ఞాపకంవచ్చి రాధ మళ్ళీ వంటింట్లోకి వెళ్ళింది.

'అరెరె!...ఏయ్ తాతా!...నీమీద గాలి వాలిందయ్యా! అసలు ఇన్నాళ్లూ ఈ గదిలో నేనా నేనున్నది!...నమ్మటం కష్టం! ఏం బాగా అమర్చేశావు! నీజీతం రెట్టింపు చేసినా ఫరవాలేదు.'

రాధగుండెలు గబగబ కొట్టుకున్నాయి. మూర్తి వచ్చేశాడు. తను చేస్తున్నపని మంచో - చెడో నిర్ణ

యించేందుకు, జాగ్రత్తపడేందుకు అవకాశం లేదు. మహాప్రవాహం ముంచుకొస్తుంటే 'అది మనవైపుకు రాదు. మరో దెసగా కదలిపోతుం'దనుకోటం భ్రమ... ఎలాగైనా అతని కంటపడకుండా బయటపడితే??

'నాకేం సేతనవును బాబూ!...ఎవరో అమ్మాయి గారు వచ్చారు. ఇదంతా ఆవిడగారిపనే!'

రాధ హాల్లోకి వచ్చి అతనికి నమస్కరించింది. మృత్యువుకు నెలరోజుల దూరంలోవున్న మూర్తి ఆమెను చూసి ఆశ్చర్యపోయాడు. ప్రతినమస్కారం చేయాలన్న ఆలోచన కలగనే లేదు.

'మీరా!...రండి! రండి!' అన్నాడు. మొదటిసారిగా అతను నిలువుటద్దం ముందు తన ప్రతిబింబం చూసుకుని సిగ్గుపడ్డాడు. అందమైన అమ్మాయి పక్కన వుంటేనేకాని, మగవాడికి సౌందర్యపు విలువలు తెలియవు గామోలు!

'మీరు క్లాసులో ఈ పుస్తకం మర్చిపోయారు. ఇచ్చిపోదామని వచ్చాను.' అంటూ పుస్తకం అందించింది.

'ఎందుకింత శ్రమ! కాలేజీలోనే ఇచ్చేయలేకపోయారా? ..., కాని, మీరు రావటం ఒకందుకు మంచిదే అయింది లెండి - ఈ చెత్తా చెదారం అంతా ఎవరు బాగుచేస్తారు?...చాలా థాంక్స్!...ఇంకా నిలబడే వున్నారు! కూర్చోండి.'

రాధ భయంగా నవ్వి కూర్చుని పొడుగాటి జెడను మెడమీదుగా ముందుకు లాక్కుంది.

'అలాక్కాదు! మీ ఇంటి కెప్పుడూ నేను రాలేదు. ఓసారి చూసిపోదామని ఈ అవకాశం తీసుకున్నాను...అందుకే పెద్దలు ఆడదిక్కులేని ఇల్లు అడవిలాంటిదన్నారు. అవునంటారా?'

'ఆ సిద్ధాంతాన్ని ఔనని ఆమోదించేందుకు ఇంకొంచెం అన్వేషణ చెయ్యాలి. అందాకా పెండింగులో ఉంచండి...మాశారా! నాకు అతిథి మర్యాద కూడా తెలియదు. కాఫీ పెడతాను. మిత్రులు వస్తే పక్కనున్న హోటలుకు తీసుకుపోతాను. మీ విషయంలో...' అంటూ లేవబోయాడు.

'మీకా శ్రమ తప్పించాను. ఈపాటికి స్టౌ మీద నీళ్ళు కాగుతూవుంటాయి.' అంది వారిస్తూ.

మూర్తి పుస్తకంలో పేజీలు అటూ ఇటూ తిప్పుతూ ఏదో వెదకసాగాడు. అనుకున్నంత అయిందన్నమాట!...రాధ అతన్నే పరీక్షగా చూస్తోంది.

'ఏమిటండోయ్, గాఢంగా వెదికేస్తున్నారు? నోట్లకట్టకాదు కదా! నేనేం దొంగనుకాను. ఉపకారానికి నడితే అపకారం ఎదురైనట్టు...'

అబ్బే!...అదేం కాదండి...ఇందులో ఏదో ఉత్తరం వుంచినట్టు జ్ఞాపకం_' అంటూ ఆగిపోయాడు.

'ఉత్తరమా?...ఒకవేళ పోస్టుచేసేశారేమో!...ఇంతకూ అదేమైనా ప్రేమలేఖా?' అంటూ నవ్వేసింది రాధ.

'ప్రేమలేఖ నాకు నేనే రాసుకోవాలి... ఎవరో మిత్రుడికి రాసిన ఉత్తరం - ఎక్కడైనా జారి పడివుంటుంది. ఫరవాలేదు _ మళ్ళీ రాసుకుంటాను.'

రాధ ఏదో అడగాలనుకుని పెదిమలు కదల్చి ధైర్యం చాలక వూరుకుంది. మరో పది నిమిషాల్లో కాఫీ తయారైంది. ఎలా మాట్లాడాలో - అతనిలో ఆశావాదాన్ని కలిగించే దెలాగో తెలియక ఏదో పుస్తకంతీసింది. మొదటిపేజీ చూడగానే కళ్లు నిలిచిపోయాయి.

నటరాజు నాట్యం చేస్తున్నాడు. అరమోడ్పు కన్నులు - అందర్నీ ప్రేమించి క్షమించే ప్రశాంతత - మబ్బుల్లా తేలుతున్నట్టు కేశాలు ఎగిరిపడుతున్నాయి. ఎవరో నాట్యశాస్త్రం తెలిసిన చిత్రకారుడు వేసిన బొమ్మ - కాకపోతే ముద్రలు అంత కచ్చితంగా ఎలా వుంటాయి?

పేజీ తిప్పింది రాధ.

రాధ కృష్ణుడి పాదాలదగ్గిర కూర్చుని మురళి వింటోంది. దూరంగా గోసంతతి తోకలెత్తి ఆనంద పారవశ్యంతో నృత్యం చేస్తున్నది. సెలయేరు జలజల పారుతోంది. మురళీగానం ఆకాశాన్ని సైతం నాట్యం చేయిస్తోంది. కదలుతున్న మబ్బులు ఆగిపోయి పాట వింటున్నాయి. తదేకదీక్షగా చూసేసరికి ఆ గానం ఆమెకు నిజంగా వినిపించింది. రాధ కళ్ళల్లో విరహం కృష్ణుడు గమనించటంలేదు. పేజీలు తిరగవేస్తూ వెళ్ళింది. అందులో కొన్ని పెన్సిలుతో గీసినవి. కొన్ని రంగుల చిత్రాలు - వరూధిని మొదలుగాగల ప్రబంధ నాయికలు - ఎక్కడో నిత్య

జీవితంలో చూసినట్టే కనిపించారు. భారతంలో యుద్ధ ఘట్టాలు - గోపికల నాట్యభంగిమలు - ఎన్నో - ఎన్నో ఆ పుస్తకంనిండా దివినుండి దిగివచ్చిన సౌందర్య బింబాలు——

'కాఫీ చల్లారిపోతోంది. మీకోసం నేను వెయిట్ చేస్తున్నా...'

గులాబీపూల మాలలా అల్లుకుపోతున్న ఆలోచన్ని మూర్తి తెంపివేశాడు. రాధ అతనికేసి భావగర్భితంగా చూసింది.

'ఈ చిత్రాలు మీకు నచ్చాయా?...' అనడిగాడు మూర్తి.

'అపూర్వ కళాఖండాలు-మహాద్భుత నైపుణ్యం.. ఛ! ఛ! చిన్నతనంలో చదువుకున్న సమాసాలు ఒక్కటే సమయానికి అదుకోవు -'

'వేళాకోళ మాడుతున్నారా?...'

రాధ చప్పున అతనికేసి చూసింది.

'సారీ!...నా మాటల్ని మీరు తప్పుగా అర్థం చేసుకున్నారు. మీ రింతటి గొప్ప చిత్రకారులని కలలో కూడా వూహించలేదు...'

ఆనందం క్షణకాలం నిలిచింది...వెంటనే విషాదం. మూర్తి సరిగ్గా నెలరోజుల్లో ఆత్మహత్య చేసుకుంటాడు! అతని కళ చీకటిలో అంతమవుతుంది. అసందర్భం! అలా ఎన్నటికీ జరగటానికి వీల్లేదు. అతనిలో దాగివున్న కళ నుద్ధరించటానికోసమైనా తను త్యాగం చేయాలి.

'మీరు హిస్టరీ లెక్చరరుగా వుండటం ఏం బాగా లేదు...ఏ హైస్కూల్లోనైనా డ్రాయింగు మేష్టారుగా వున్నా బాగుండేపోను!...ఇప్పుడైనా మించి పోయిన దేమీ లేదు. శుభ్రంగా శాంతినికేతన్ వెళ్లండి....ఎందుకొచ్చిన చరిత్ర! రాజులు-వారి దండయాత్రలు - ధ్వజస్తంభాలు - రాణులకోసం కొట్లాట - తండ్రిని కొడుకు చంపటం - ఆ పైన కన్నీరు కారుస్తూ పెద్దభవంతిని అతని జ్ఞాపకార్థం నిర్మించటం - ఇదంతా అనవసరం. ఆనాటి పరిస్థితులు మళ్ళీ రావు. అలాంటప్పుడు దాన్ని బోధించి సాధించేదేమీ లేదు. ముసలమ్మలు మనవలకు కట్టుకథలుగా చెప్పుకోవచ్చు.'

'చరిత్రను - దాని ప్రాముఖ్యాన్ని విమర్శించటం న్యాయం కాదు. మీ కిష్టం లేదంటే చదవకండి. పత్రికలలో చరిత్రనుగురించిన ప్రస్తావన వుంటే కళ్ళు మూసుకుని పేజీలు తిరగవేయండి...మనం చేసే వుద్యోగాలకూ, అభిరుచులకూ సామీప్యం లేదంటే ఒప్పుకుంటాను. ఉదాహరణకు, మీకు ట్యూటరుగా వుండటం ఎంత మాత్రం యిష్టంలేదని నాకు తెలుసు.'

'అలా ఎందు కనుకుంటున్నారు?...అబ్బాయిలు ఏడిపిస్తున్నారనా? ఒక్కొక్కడికి వందరూపాయలు ఫైను వేస్తే రోగం కుదురుతుంది.' అంది పొద్దున్న విద్యార్థి బృందం తనకు ప్రసాదించిన బిరుదాన్ని నెమరు వేసుకుంటూ.

'అది వాళ్ళతప్పు కాదు...కాళిదాసులా కవిత్వం చెబుదా మన్న ఆకాంక్ష కావచ్చు...మగవాడిచేత ఆలోచింపచేసే శక్తి ఒక్క ఆడదానికే వుందికనక.'

'ఊ!...అలాగా!' అని మాటల్ని సాగదీసి ముందుకు వంగి 'పోనీ——నేను ఏ వుద్యోగం చేస్తే బాగుంటుందో సెలవిస్తారా?' అనడిగింది. మూర్తి సమాధానంకోసం తడుముకోటంచూసి తనే చెప్పుకుపోయింది. 'సినిమాలో హీరోయిన్-ఆర్టిస్టుడియోలో మాడల్-ఎయిర్ హోస్టెస్-పోనీ - బట్టల దుకాణంలో బయట గాజుపెట్టెలో అడ్వర్టైజింగ్ మాడల్-' ఇద్దరూ నవ్వుకున్నారు. మూర్తి బయటకు వెళ్ళి ఆకాశంవంక చూసివచ్చాడు.

'వర్షం వచ్చేట్టుంది!'

'నాన్నగారు ముందే చెప్పారు;...కారు తడిసి పోతుంది!'

'మీకంటె కారు ముఖ్య మన్నమాట! ఎవరో రెయిన్‌కోటు తడవకుండా సంచీలో వుంచుకుని వర్షంలో నడిచిపోయినట్టు.'

రెండు నిమిషాలు ఇద్దరూ మౌనాన్ని గౌరవించారు.

'మీరు నాకు చిత్రలేఖనం నేర్పకూడదూ?'

'మైగాడ్!...ఆడవాళ్ళపోటీ ఎక్కువై మగవాళ్ళకు ఉద్యోగాలు దొరకటంలేదు. బొమ్మలు గీసుకుని బతుకుదా మనుకుంటే, ఆ రంగంలో కూడా మీ దండయాత్రలా?'

'మీరు వేళాకోళం చేస్తే, చెప్పను...' కళ్ళు చిత్రంగా తిప్పి, తల నలభై డిగ్రీల కోణంలో వుంచి, కిటికీలోంచి బయటకు చూసి నవ్వింది.

'నిజానికి దాపరిక మెందుకు?...సరే! రేపట్నుంచి సరంజామాతో రండి...ఫీజు విషయంలో నేను చాలా కచ్చితంగా ఉంటానండోయ్!'

'థాంక్స్!...కావలిస్తే ఎడ్వాన్సు తీసుకోండి... పారిపోతానన్న భయంకూడా ఉండవచ్చు.'

రాధ నమస్కరించి కారులో బయలుదేరింది. గాలివేగం ఎక్కువైంది. ఎక్కడో ఆకాశం అసంతృప్తిగా గర్జించింది.

'ఎందుకీ నటన?' అనెవరో ఆమెను ప్రశ్నించారు - రాధ సూటిగా సమాధానం చెప్పక 'ఇవాళ రెండో తారీఖు - నెలరోజులు గడవాలి.' అని రెట్టించిన వేగంతో ముందుకు సాగిపోయింది.

వర్షం మొదలైంది.

* * * *

పదిరోజులు గడిచాయి.

అతని మాటల్లో, చేతల్లో కల్పనలుచేసే భావనలో చిత్రమైన మార్పులు వచ్చాయి. తెల్ల కాగితంమీదున్న బొమ్మకు రంగులు వేస్తే ఎంత శోభాయమానంగా ఉంటుందో, అతని జీవితమూ అంతే అయింది.

అయితే, రాధ సమస్యలో యిరుక్కుంది.

మన స్తత్వంమీద ఆమె చేసిన ప్రయోగం గెలుపులో అంతం కావచ్చు. కాని దీనికి ముగింపు ఎక్కడ? ఎప్పుడు? మంచితనానికి ఆత్మత్యాగం ముగింపు - అహంకారానికి శాంతి ముగింపు - కోరికకు సాఫల్యం ముగింపు - అలా ఈ ప్రేమకు వివాహం ముగింపా? ఆ మాట తల్చుకునేసరికి రాధ ఒళ్లు జల్లుమంది. హఠాత్తుగా, అతని కంటపడకుండా మొహం తిప్పేస్తే, ఆశాభంగం గిరగిర తిప్పి లోయల్లోకి విసిరివేస్తుంది. చంద్రమండలం చూపిస్తానని సగంవరకూ తీసికెళ్ళి 'అదుగో!.. ఆ కనిపిస్తున్న బాటవెంబడి తిన్నగా వెళ్ళు' అని విదిలించివేస్తే బాటసారి 'ఒంటరిగా వెళ్ళలేను - వెనక్కి తిరిగిపోతాను.' అంటాడు. కనుక, గమ్యస్థానం చేరేవరకూ అతని వెంటవుండి, నవ్విస్తూ, నవరత్నాలు కురిపిస్తూ సాగిపోవాలి.

'అబ్బ!...ఎంత జాగ్రత్తగా గీసినా అసలు ఆకారమే రావటం లేదు.' అంది డ్రాయింగు పుస్తకం బల్లమీద విసుగ్గా విసిరేస్తూ రాధ. మూర్తి నవ్వి పుస్తకం తీసి చూశాడు. అతను వేయమన్నది కాకిబొమ్మ.

'మీకు పక్షిజాతిమీద అపార ప్రేమ గామోలు!.. కాకికి, కొంగలా పొడుగాటి కాళ్ళు - బాతులా వెడల్పాటి పాదాలు - ఏనుగులా పెద్ద చెవులు - గుడ్లగూబలా కళ్లు - ఇదేమైనా కార్టూ ననుకున్నారా? మీరు బొమ్మకింద 'కాకి' అని రాసినా ఎవరూ నమ్మరు. అమెరికాలో ఏ చిత్రనిర్మాతకైనా ఈ బొమ్మను పంపితే చాలు - ఈ పక్షి నాధారంగా తీసుకుని, ఓ కథ అల్లిపారేసి, 'బిలియన్ మిలియన్ బి. సి.' అనో, 'క్రీచర్ కమ్స్ ఫ్రం ది మూన్' అనో చిత్రం తీసి పారేస్తాడు.' అని విరగబడి నవ్వాడు. రాధ కూడా ఓర్పుగా నవ్వింది.

'నే నేం చేయను చెప్పండి!...వేళ్ళు నా స్వాధీనంలో ఉండటంలేదు... అభిలాష వుంటే చాలదు. నేర్పరితనం ఉండాలి.'

'పట్టుదల ఉండాలి. మీరు విన్ సెంట్ వాన్‌గో గురించి విన్నారో లేదో - అతను సంవత్సరాల తరబడి అహర్నిశం కష్టపడి చిత్రలేఖనం నేర్చుకున్నాడు. మీ కెదురుగా ఉన్న ఆ కూజా బొమ్మ వేయండి...ఊ! ...ఆర్డర్ ఈజ్ ఆర్డర్!...పెన్సిలు తీసుకోండి.'

రాధ తనలో తాను నవ్వుకుంది. మానవజీవితమే ఓ నటనైనప్పుడు, అందులో మరో నటన - తనకు చిత్రలేఖన మంటే అంతులేని అభిలాష వున్నట్టూ, నేర్చుకోటానికి తహతహలాడుతున్నట్టు నటించటం అసందర్భం కదూ! నటించటాని కూడా సామర్థ్యం ఉండాలి. ముఖంలో ఏమాత్రం మార్పు కనిపించినా, ఎదుటి వ్యక్తి అనుమానిస్తాడు. ఈ తెర చిరగకుండా రాత్రింబగళ్లు కాపలా కాయాలి. పెన్సిలు తీసుకుని కూజా బొమ్మ గీయసాగింది. ఆకారం కుదరలేదు. రెండుమూడుసార్లు చెరిపివేసింది. ఉన్నట్టుండి వులిక్కిపడింది. అనుకోని సంఘటన జరిగింది. ఎదురుగా కూర్చున్న మూర్తి ఎప్పుడు కదిలాడో ఏమో _ ఆమె చేయి పట్టుకున్నాడు.

'భయపడకండి!...మీ చేత కూజా గీయిస్తాను.' అంటూ ఆ పొడుగాటి వేళ్ళ కదలికను క్రమబద్ధం చేశాడు. రాధ కోపాన్ని అణచుకుంది.

* * * *

ఇరవైతొమ్మిది రోజులు గడిచాయి.

రాధ కాలెండరుకేసి చూసింది. రేపు ఒకటో తారీఖు. గుండె గబ గబ కొట్టుకుంది. రేపటితో

మూర్తి పెట్టిన గడువు పూర్తవుతుంది. కాలేజీలో సంతాపసభ జరుగుతుంది. నిరుద్యోగిగా ఉన్న ఎవరో హిస్టరీ ఎం. ఎ. అదృష్టం పండుతుంది. ఈ గదులు మరెవరైనా అద్దెకు తీసుకుంటారు. 'మూర్తి ఎందుకు ఆత్మహత్య చేసుకున్నాడు?' అని అందరూ ప్రశ్నిస్తారు. సమాధానంకోసం అన్వేషణలు సాగిస్తారు... అలా ఎందుకనుకోవాలి? అతనిలో నిరాశా నిస్పృహలు లేవు. శూన్యంపైపు చీకటికళ్ళతో చూసే కోరిక లేదు. తనెందుకు భయపడాలి? ఒక్కరోజులో గెలుపు తనది. రాధ పిక్‌నిక్‌కి కావలసిన సరంజామా సర్దుతోంది.

'నాన్నగారు ఏమన్నారో తెలుసా? ... వర్షాకాలంలో పిక్‌నిక్ ఏమిటని—'

'ప్రకృతి నిజస్వరూపం చూడాలంటే ఇదే సరైన సమయం - తెన్నెవరూ చూడటానికి రారన్న ధైర్యంతో సంకెళ్ళు తెంచి పారేసి స్వైరవిహారం చేస్తుంది.'

బయట చినుకులు పడసాగాయి.

నీటిబిందువులు చెట్టాపట్టాలు వేసుకుని, కౌగితం మీద గీతల్లా, ఇసుకలో బారలు చేసుకుంటూ పోతున్నాయి. వర్షం వస్తుందని ఎదురుచూడని కండచీమల గుంపు ప్రాణాలు దక్కించుకోటానికి ఎక్కడికో పరుగెడుతున్నాయి. చెట్లు ముఖం చిట్లించి గుసగుసలాడాయి. పక్షులగుంపు వున్నట్టుండి మాయమైంది. రాధ సూట్‌కేస్‌లో సామానులను సర్దింది. వుడెన్ పాడ్ - డ్రాయింగు పుస్తకం - పెన్సిలు - మఫ్లరు ఏ ఒక్కటీ ఆమెను మోసగించి మరపులోకి పోలేక పోయాయి. అంతా పూర్తయ్యాక రాధ వెనక్కితిరిగి చూసేసరికి మూర్తి స్కెచ్ పూర్తి చేశాడు. అతను చూసిన అదే ప్రకృతి - ప్రతి అణువులోంచి వాస్తవికత తొంగిచూసింది. కండచీమలమీద కనికరం కలిగింది గాబోలు - ఓ చెట్టుకింద చలికి వణుకుతూ నిలబడున్నట్టు చిత్రించాడు. రాధ ఆశ్చర్యంతో నోటి మాటరాక వూరుకుంది.

'మనిషి తన శక్తిని తాను తెలుసుకోలేడు. ఇతరులు ఎత్తిచూపితే నమ్మడు.' నెమ్మదిగా, తనలో తాను అనుకుంది.

రాధ ఇంటికి తిరిగొచ్చేసరికి బాగా చీకటి పడింది. గేటు తెరిచే వుంది. లోపలిగదిలోంచి నీలి రంగుదీపం మిణుకుమిణుకుమంటూ పలకరించింది. నాన్న పదింటికల్లా నిద్రపోరు. ఏ వేదాంతగ్రంథమో చదువుతూంటారు. అదీగాక ఆ రాత్రి ఏదో సంస్కృత నాటకం రేడియోనుండి ప్రసారమవుతూంది. భయపడుతూ గదిలో అడుగుపెట్టగానే మంచంమీద కనిపించారు.

'ఎవరూ!... రాధేనా!... వచ్చావామ్మా! ఈ మధ్య నువ్వింటికి చాలా ఆలస్యంగా వస్తున్నావు. వర్షం ఎప్పుడు కురుస్తుందో, ఎప్పుడు నిలుస్తుందో, ఎవరికీ తెలియదు.'

రాధ గుండెలు వేగంగా పరుగెత్తాయి. నిజం చెప్పాలనుకున్నా, దాని పర్యవసానం వూహించి తటపటాయించింది. నాన్న తన్ను ఎలా అర్థం చేసుకుంటారో ఏమో! నిజం ఒక్కొక్కప్పుడు చేదు మందులాంటిది. దాన్ని దాచివుంచినంతమాత్రాన తియ్యగా వుండదు. ఎప్పుడో ఒకప్పుడు ఆ మందు తాగక తప్పదని తెలిసినప్పుడు ముందుగా తాగేయటం మంచిది. రాధ మూర్తి గురించి చెప్పింది. ఆత్మహత్యా వాంఛనుగురించి ప్రస్తావించలేదు. ఓ గొప్ప చిత్రకారు డంది.

'నాన్నా! మీరు జయపురి కొండలు - అక్కడి శిల్పాలు చూడాలని ఎంతో కాలంనుంచి అంటున్నారుగా! రేపు మన పిక్‌నిక్ ఖాయం! మూర్తిగారు కూడా వస్తానన్నారు.'

నాన్న నవ్వారు.

'నువ్వు వట్టి పిచ్చిపిల్లవు సుమా!... ఇరవైయేళ్లు దాటినా పసితనం పోలేదు. నేనెందుకు ముసుగు కప్పుకుని పడుకున్నానో ఆలోచించావా?' రాధ సిగ్గుపడి నాలిక్కరచుకుంది.

'క్షమించండి నాన్నా!'

'ఫరవాలేదు!... సాయంత్రంనుండి తలనొప్పి - జ్వరం - ఒళ్ళంతా నొప్పులు- రేపు నేనెలా రాగలను?'

'మూర్తి ఏమనుకుంటాడు?' అని ప్రశ్నించుకుంది రాధ.

'పోనీలెండి నాన్నా! మీ ఆరోగ్యంకంటె ముఖ్యమైన దేమీ లేదు. మానేద్దాం. మరోనాడు వెళ్ళొచ్చు. ఆ కొండ లెక్కడికీ పారిపోవుగా! నేను వేడి

కాఫీ తీసుకొస్తాను. రెండు అనాసిన్ బిళ్ళలు వేసుకుంటే జ్వరం దిక్కు లేకుండా ఎగిరిపోతుంది.'

'అబ్బ!...నాకోసం నీ ప్రోగ్రాం వాయిదా వేయకు. నాకీ జ్వరం కొత్తకాదు. అప్పుడప్పుడు వచ్చేదే! పైగా అతను కూడా వస్తున్నాడాయె! తప్పకుండా వెళ్లు.'

మరొకప్పుడైతే రాధ ససేమిరా కదలననేది. ఏదో అర్థంకాని శక్తి ఆమెను వశం చేసుకుంది. మూర్తి పెట్టిన నెలరోజుల గడువు రేపటికి పూర్తవుతుంది. వస్తానని రానంటే నిరాశపడి నిజంగా అఘాయిత్యానికి దిగితే? రాధ ఆలోచనల్లో అనురాగం, ద్వేషం, ఆశాభంగం - ఏవీ లేవు. చిన్న పిల్లాడు వేదాలు చదవటానికి ప్రయత్నించటం లాంటి పిచ్చికోరిక.

* * * *

జయపురికొండలు వూరికి ఎనిమిది మైళ్ళ దూరంలో వున్నాయి. చిన్న చిన్న శిఖరాలనుండా పోయే సరళరేఖగీస్తే, భూమికి సమాంతరంగా వుంటుంది. కొన్ని వందల సంవత్సరాల క్రితం ఆ కొండల్లో గుహలు దొలిచి బౌద్ధభిక్షువులు నివసించేవారు. ఆ చుట్టు పక్కల పల్లెజాతి ప్రజలు నివాసం ఏర్పరచుకొన్నారు. కొండమీద కురిసే వాన క్రమంగా కిందకు పాకి, నిర్మలాకాశాన్ని ఆవరించుకునే మబ్బుల్లా, నేలను ఆక్రమించి పిల్ల కాలవలా పారుతుంది. వర్షాకాలంలో ఆ కాలవ ఎప్పుడు నిండుగా వుంటుందో, ఎప్పుడు ఎముకలగూడులా వుంటుందో ఎవరూ చెప్పలేరు.

మూర్తి, రాధ ఆ ప్రాంతానికి చేరుకునేసరికి పది గంటలైంది. సూర్యుడు చురుక్కుమన్నాడు. రాత్రి తడిసిన నేల ఎండకాగుతోంది. కొండమీది గుహలు చూస్తూ ముందుకు సాగిపోయారు. కొన్ని వందల సంవత్సరాలనాటి సంస్కృతి - ఆచార వ్యవహారాలు - నిష్ఠా నియమాలు అన్నీ ఆ గుహలనుండి గ్రహించవచ్చు. కొండకొనమీదనుండి చూస్తే నీటితో నిండుగా వున్న లోయలమధ్య 'మునిగిపోతున్నాం - రక్షించండి' అన్నట్టు చేతులు చాపుతున్న చెట్లు కనిపిస్తాయి. జన్మస్థానం తెలియని ఓ సన్నటి నీటిపాయదల ప్రతిగుహను పరామర్శించి పోతోంది. సర్వారిష్టాలకూ మూలకారణం 'కోరికన్న బౌద్ధమత సూత్రాన్ని ఆ గుహల్లో చూడవచ్చు. రాతి తలగడలు - ఎండ - వాన - చలి వేటికీ చలించని శరీరాలు తప్ప ఆ కటిక శిలమీద విశ్రాంతి తీసుకోలేవు. రాధ మూర్తిని గమనిస్తూనే వుంది.

'ఇదంతా చూస్తుంటే ఇక్కడే ఉండిపోదామనిపిస్తోంది...అడుగు వెనక్కి పడదు. కొన్ని వేల మంది భిక్షువులు కాషాయవస్త్రాలు ధరించి, ఔన్నత్యం-పదవులు - అందచందాలు - పూలబాటలాంటి భవిష్యత్తు - వీటిని చేతులారా తుంచివేసి ఎందుకు జీవించారో అర్థంకాదు. ఈ త్యాగబుద్ధివలన వారిలో కలిగే తృప్తి, శరీరసౌఖ్యాలు - సిరిసంపదలు యిచ్చే తృప్తి కంటె గొప్పదన్నమాట - నేనూ సన్యాసినై పోతాను.' అన్నాడు మూర్తి.

రాధ పొరపాటుచేశా ననుకుంది. అతన్నిక్కడకు తీసుకు రాకూడదు. అతని చేత ఆలోచింపచేసే శక్తి ఈ రాళ్ళకు లేదు.

రాధ ఫక్కున నవ్వింది.

'ఆ భిక్షువుల జీవిత లక్ష్యం గొప్పదే కావచ్చు' ఎందుకో దాన్ని నేను పొగడలేను. మనం బతికేది హాయిగా అనుభవించటానికి - ఆనందించటానికి - ఉదాహరణకు చూడండి - ఇంత చక్కటి ప్రకృతి సంపద-'

మూర్తి మరోమారు చూశాడు. కొండను ఢీకొని బలాబలాలు పరీక్షించుకోటానికి పరుగెత్తుకు వస్తున్న మేఘాలు - భూమికంటె కొన్నివేల అడుగుల ఎత్తున ఉన్నామని గర్వంగా చూసే చెట్లు - తలలో పాపిడలా కదలిపోయే కాలిబాట - స్వేచ్ఛకు అడ్డొతగులుతున్న రాళ్ళను కసికొద్దీ ఢీకొనే ప్రవాహాలు.

'మనుష్యులలో పరస్పరాకర్షణలు - ఇవన్నీ అనుభవించటానికి కాకపోతే మరెందుకు? వీటిని చూసి ఏవగించుకొని, ఆత్మను పీక నొక్కివేసి బతకటానికి దేవుడు సృష్టించలేదు.'

'అలా కాదు రాధా!'

'ఆగండి!...మీరు చెప్పబోయేది నాకు తెలుసు. అదంతా మనోబల పరీక్షకోస మంటారు. మనం సులువుగా మోసపోతామో లేదో కనుక్కోటానికంటారు. అంతేనా?...అలా అనుకునేందుకు తగిన ఆధారాలు లేవు. రుజువూ లేదు. అంటే, మనముందు రెండు సిద్ధాంతాలున్నాయి. రెండూ వూహాలోంచి పుట్టినవే - సరైన పునాదులు లేనివి. అలాంటప్పుడు మనకు నచ్చే సిద్ధాంతాన్ని నమ్మి ఆచరిద్దాం.'

రాధ ఇంత ఘాటుగా విమర్శించటం అతనెన్నడూ వినలేదు.

'సరే!...అంగీకరించాం - జీవితాన్ని ఓ కళగా అనుభవించాలి.'

అంటూ పుస్తకం, పెన్సిలు తీసుకుని బుద్ధ విగ్రహంముందు కూర్చున్నాడు. సుమారు తొమ్మిదడుగుల ఎత్తు - దానికి రెండుపక్కలా వరుసగా రాతి బెంచీలు - అది బౌద్ధుల సమావేశ మందిరం - మూర్తి స్కెచ్ వేయటంలో నిమగ్నుడైపోయాడు.

సాయంత్రం ఆరుగంటలు—

మబ్బులు దట్టంగా కమ్మేశాయి. వర్షం వస్తుందని నిర్ధారణ కాగానే రాధ కొంచెం భయపడింది. ఎలాగో వొకలాగ ఇల్లు చేరుకోవాలి. - సామాను సర్దేసుకుని కార్లో కూర్చున్నారు. కాని పరిస్థితులు ఒక్కసారిగా ప్రతికూలించాయి. కారు కదలటం మానుకుంది. దాని జబ్బుకు మందు ఆ ఇద్దరికీ తెలియదు. అలాంటి నిర్జనప్రదేశంలో రాత్రి గడపట మెలా? నాన్న సలహా వినకపోవటం పొరపాటేమో ననిపించింది. కాని రైలుదాటాక స్టేషనుకు వస్తే ఏం లాభం? ఆకాశం నిర్దయగా ఉరిమింది.

అక్కడకు వచ్చే యాత్రికుల సుఖదుఃఖాలు కనుక్కోవడంకు నియమింపబడిన అధికారి కొండదిగువ ఓ చిన్న ఇంటో ఉంటున్నాడు. ఇద్దరూ అక్కడకు చేరుకున్నారు. అధికారి పక్కనే కూర్చున్న ముసిలాడు ఏవో జానపదగీతాలు పాడుతున్నాడు. ఆ గానంలో ఉరకలువేసే అమాయకత్వాన్ని చూసి, అసూయతో గాలి ఆ మాధుర్యాన్ని మింగివేసింది. మూర్తి తమ పరిస్థితి వివరించాడు.

'మరేం భయపడకండి!...ఈ రాత్రి కిక్కడ ఉండవచ్చు - టౌనుకు వెళ్లలేరు.' అన్నాడు అధికారి.

'ఫుండుమీది కారంలా, కారు కూడా సత్యాగ్రహం చేసింది. లేకపోతే ఎలాగో వొకలాగ దాటేయగలం!' అంది రాధ దిగులుగా. ఆమెకీ అనుభవం కొత్త.

'మీ పెత్రికాని, విమానం వున్నా వెళ్ళలేరు. దానికి రెండు కారణాలు: - మొదటిది - ఈ ప్రదేశం సముద్రమట్టానికి చాలా ఎత్తులో ఉంది. వర్షంతో రోడ్డు తడిసిఉంటుంది కనక కారులో వెళ్ళటం ప్రమాదకరం. - రెండోది - కొండదిగువనున్న కాలవ ఈపాటికి వంతెనమీదుగా పారుతూఉంటుంది. ఈ రాత్రికి మీకింక మోక్షంలేదు.'

అధికారి అంతవరకూ మూర్తి చేతిలోవున్న పుస్తకం చూడలేదు. ఒకొక్కక్క పేజీ తిరగవేస్తూ ఆశ్చర్యం ప్రకటించాడు.

'చాలా బాగున్నాయండి!..మీ పేరు మూర్తి?.. పత్రికల్లో ఎక్కడా మీ చిత్రాలు చూసినట్టు గుర్తు లేదు...మీరు దేనికీ పంపలేదా?' మూర్తి తల అడ్డంగా వూపాడు. - గదిలో అడుగు పెడుతుంటే వెనక్కి పిలిచాడు మూర్తిని.

'రే పుదయం జ్ఞాపకంలేక చెప్పకపోవచ్చు - ఇప్పుడే చెప్పేస్తాను. అయిదారు నెలల్లో ఢిల్లీలో పెద్ద చిత్రకళా ప్రదర్శనం జరుగుతుంది - అది మీకు తెలిసే ఉంటుంది. ఏదైనా గీసి పంపండి. తప్పకుండా బహుమతి వస్తుంది...ఉచితంగా సలహా యిచ్చాను కనక సగం నాకు పారేయండి.' అన్నాడు నవ్వుతూ.

రాధ ఆశ్చర్యపోయింది. ఒక్క పదినిమిషాల పరిచయం ఎంతటి సాన్నిహిత్యాన్ని స్థిరపరిచింది! బహుశ ఇక్కడి కొండలు, నిర్మలాకాశం - అందర్నీ ప్రేమించ మంటున్నాయేమో!

అదో పెద్ద గది. పాతికమంది వరుసగా పడుకోవచ్చు దేవుడు లేని గుడిలా చిందర వందరగా ఉంది. మూర్తి కిటికీదగ్గర నేలమీద కంబళి పరచి పడుకున్నాడు. మరో మూల రాధ పడుకోటానికి యత్నించింది. సమస్యలతో నిండుకున్న మనసుకు, నిద్రకు చాలా దూరం. బయట వర్షం కురుస్తోంది. ఎక్కడో, ఏవో జంతువులు అరుస్తున్నట్టు భ్రమ. మూర్తి నిద్రకుపక్రమించినట్టు కనపడినా, ఎందుకో నమ్మలేకపోయింది. ఏదు కావస్తోంది - అంతే - అప్పుడే నిద్రేమిటి? ఒకవేళ తన గడువు దగ్గరపడుతోంది కనుక మౌనం వహిస్తున్నాడా?...ఉన్నట్టుండి అర్ధరాత్రి కిటికీలోంచి కింద కురికితే!...ఎన్నోసార్లు ఆ ఉత్తరం గురించి అడగా లనుకుంది - ధైర్యం వెనుకంజ వేసింది.

'మీకు ఆత్మహత్య చేసుకోవా లనుందా?' - రాధ భయంతో -

'లేదు...' మూర్తి ఆశ్చర్యంలో—

# అనురాగం - ఆత్మహత్య

'మరైతే ఆ ఉత్తరం ఎందుకు రాశారు?' - కొంచెం విసుగు -

'ఏ ఉత్తరం?...ఓస్! అదా! వూరికే రాశాను. ఆవేళ ఇంగ్లీషు లెక్చరరు రాలేదు. నువ్వు వస్తావని నాకు తెలుసు - పుస్తకంలో ఉత్తరం వుంచాను. నీ మనసు నవనీతంలాంటిది. త్వరగా కరగిపోతుందని నాకు తెలుసు-' - విజయగర్వం -

'ఛీ !...ఇదంతా నట నన్నమాట' - అణచుకో లేని కోపం—

'అసలు జీవితమే ఓ నాటకం - అంతర్నాటకాలకు అధిక ప్రాధాన్యం లేదు. రా !...సుఖంగా వుందాం - ప్రేమనేది తేలిగ్గా దొరికేది కాదు - నిశిరాత్రి - ఎవరూ లేరు - అనువైన వాతావరణం.'— అట్టహాసమైన నవ్వు -

'ఛీ!...ఛీ!...వదలు!' చెంప ఛెళ్ళుమంది.

రాధ నవ్వుకుంది. అలా కాకుండా మరోవిధంగా జరగవచ్చు.

'మీకు బతుకు భారంగా ఉందా?'

'అవును రాధా!...ఎటుచూసినా సమస్యలు - గుండెమీద చేయివేసుకుని నేను బాధల కతీతుణ్ని - అనలేను...అలాంటప్పుడు జీవించి ఏం లాభం? చివరకు మిగిలేది, సాధించేది ఏదీ లేదుకనక ఆగిపోవటం మంచిది.'

'వద్దు...వద్దు...అలాంటి భావాన్ని దూరంగా తరిమివేయండి. సౌందర్య పుష్పం వెయ్యిరేకులుగా విరిసి ప్రకృతిగా మారింది - అదొక కావ్యం లాంటిది. చదివి, విని అనుభవించాలి.'

తను ప్రాధేయపడుతుంది. అతను వినడు. గబగబ చీకటిలో ఎక్కడికో పరుగు లెడతాడు - కంగారుగా వెళ్ళి చేతులు పట్టుకుని ఆపివేసింది.

'మిమ్మల్ని చావనివ్వను - మీరు గొప్ప చిత్రకారులు !'

'అయితే నన్ను ప్రేమిస్తావా?...పెళ్ళి చేసుకుంటావా?'

రాధ ఒక్కడుగు వెనక్కి వేస్తుంది... అతన్ని ఎన్నడూ ప్రేమించలేదు. ఇదంతా నటన - నల్లటి బొమ్మకు రంగులువేసి, నగిషీలు చెక్కి 'సౌందర్యం' అంటే అదే నంది, అతను నమ్మడు - ఎలా?

'ఏం!...మాట్లాడవేం? ... నాకు తెలుసు - ఏ స్త్రీ నన్ను ప్రేమించదు - నాది ఎడారి బతుకు-' అతను చెయ్యి విదిలించుకుని పోబోతాడు.

'కాదు...కాదు...' అంటుంది తను. అతను వెనక్కివచ్చి తల్లో పూలు గట్టిగా వాసనచూసి ఒక్కసారిగా కావలించుకుంటాడు.

కిటికీ తలుపులు గట్టిగా కొట్టుకున్నాయి. ఆలోచనలు తెగిపోయాయి. ఆకాశం మళ్ళీ ఉరిమింది. నెమ్మదిగా లేచి నిలబడింది. గాలి ఉద్ధృతం ఎక్కువైంది - లాంతరు ఆరకుండా ఉంచేందుకు యత్నిస్తోంది.

'నిద్రపోయారా అప్పుడే?...' అనడిగింది రాధ.

మూర్తి లేచి కూర్చున్నాడు.

'నాకు చాలా భయంగావుంది సుమండీ! నాన్నగార్ని తల్చుకుంటే గుండె గుభేలు మంటోంది. ఈ చీకట్లో బయలుదేరి రారు కదా!'

'వద్దామనుకున్నా ఆయన రాలేరు...గాలివాన ఇల్లు కదలనీయదు. ప్రకృతి నిజస్వరూపాన్ని చూసి ఎందుకు భయపడాలి? చల్లగాలికంటె - ప్రశాంతమైన సాయంత్రం కంటె - మబ్బుల్లేని నీలాకాశంకంటె - పూర్ణచంద్రుడి వెన్నెలకంటె - ఇక్కడే నాకు బాగుంది. అలా వెళ్ళి కొండకోనమీద కూర్చుంటాను.'

రాధ ఒక్కడుగు వెనక్కి వేసింది.

'త్వరగా వెళ్ళండి - సరాసరి, ఒక్క గాలి విసురుకు ఆ లోయలో పడతారు..రవణ మీస్నేహితుడా?'

'అవును - ఇద్దరం ప్రాణస్నేహితులం - కలకత్తాలో వున్నాడు - అతని పేరు నీ కెలా తెలుసు?' రాధ ఈ ప్రశ్న వస్తుందని వూహించలేదు.

'అదా...అదా...ఏదో పుస్తకంమీద చూశాను.'

సంభాషణ ముందుకు సాగటంలేదు. అవతల గదిలో వున్న గోడగడియారం పది కొట్టింది. మూర్తి వాచీ చూసుకున్నాడు. తొమ్మిదిన్నరైంది -

'రెండు గడియారాలు ఎప్పుడూ ఒకే కాలాన్ని తెలియజేయవు - అలాగే మానవహృదయాలు కూడా-' అని నవ్వుకున్నాడు. తల్లోంచి జారి పడబోతున్న మల్లెపూలదండను సరిచేసుకుంటూ, అర్థమైనట్టు రాధ తల వూపింది.

'ఆ ఆఫీసరు మనిద్దర్ని గురించి ఏమనుకుంటున్నాడో తెలుసా?...'

రాధ కనుబొమలు పైకెత్తి చూసింది.

'దంపతులని...' విరగబడి నవ్వాడు. రాధ భయంగా చూసింది.

'ఏం! కోపం వచ్చిందా? ఆడ, మగ కలిస్తే అలాగే అంటారు. ఒకవేళ నిజంగా పెళ్లి చేసుకుంటానంటే మాత్రం నువ్వు కాదంటావా ఏవిటి?'

'మీ వేళాకోళాని కేంగాని, నేను చెప్పినట్టు చేయండి - ఇందాకా ఢిల్లీలో ఏదో చిత్రకళా ప్రదర్శనం జరుగుతుందన్నాడతను - మీ రెందుకు పాల్గొనకూడదు?...అదే మీ లక్ష్యం అనుకోండి.'

'రైట్ - ఒప్పుకుంటాను - మరో లక్ష్యం కూడా వుంది - నిన్ను పెళ్ళిచేసుకోటం.' అని కొంటెగా నవ్వాడు. రాధకు నిజానిజాలు అర్థంకాలేదు.

'మీ అభిప్రాయాలను సరిగ్గా తెలుసుకోలేకపోయినా నా మనసులో మాట చెప్తాను - మీరు కష్టపడి బొమ్మలు గీయండి - చిత్రకళే మీ సర్వస్వం అనుకోండి - గెలుపు మీదే - ఇంకా ఆరునెలల గడువుంది. మీరు పంపే చిత్రానికి బహుమతి వచ్చితీరుతుంది. అదే నా అభిలాష.'

మూర్తి జవాబు చెప్పకుండా కిటికీలోంచి చేయి చాపి వర్షం కురుస్తున్నదీ లేనిదీ చూశాడు.

'ఒక్క చినుకు కూడా పడటం లేదు. కారు బాగుపడుతుందేమో చూద్దాం - ఇంటికి పోవచ్చు.'

'అలా మొండికెత్తి బయలుదేరితే బోల్తాపడి చస్తాం.'

'పోతే పోతాం - బాధలు తప్పుతాయి.'

'అదుగో! ఆ తత్వమే వద్దన్నది. జీవితాన్ని ఓ కళగా అనుభవించాలని ఎన్నిసార్లు చెప్పాను మీకు!'

ఉన్నట్టుండి అతని కళ్ళల్లో వెలుగు తళుక్కుమంది. రెండడుగులు ముందుకువేసి రాధ కళ్ళల్లోకి చూశాడు. ఓ మహాకావ్యం కనిపించింది. చదవగలడు కాని అర్థంచేసుకోలేడు. ఏమనుకున్నాడో, ఏమో కాని, ఛటుక్కున ఆమె చేతులు రెండూ పట్టుకుని ఏదో అనటానికి ప్రయత్నించాడు. పెదిమలు అసందర్భంగా కదిలాయి. మబ్బుల్లో దాక్కున్న వర్షంలా- మొగ్గలో దాగిన పువ్వులా - అనురాగంలో దాక్కున్న ప్రేమలా - వెలుగులో దాక్కున్న సందేశంలా - అతని మాటలు గుప్తంగా వుండిపోయాయి! ఆకాశం మళ్ళీ గర్జించింది. రాధ చేతులు విదిలించుకుని వెళ్ళి పడుకుంది. గడియారం పదకొండు కొట్టింది. వాచీ చూసుకుంటే ఆగిపోయింది.

*　　*　　*　　*

రాధకు మెలకువ వచ్చేసరికి రెండుగంటలైంది. బద్ధకంగా తిరిగిన కళ్లు మూర్తి పడుకున్న చోటు ఖాళీగా వుండటం గమనించాయి. ఉలిక్కిపడి లేచి గదంతా వెదికింది. వెర్రికాని వెదకటానికి అదేమైనా పెద్ద భవనమా!...ఎక్కడా అతని జాడలేదు. కిటికీలోంచి బయటకు చూసింది. లోతైన లోయలో నీరు నిండుగా పారుతోంది. ఆ నీటిలో ఎవరో తేలుతున్న భ్రమ! వర్షం లేదు. చలిగాలి మాత్రం బెదరిస్తోంది. మబ్బులవెనక్కి జరిగిన చందమామమాత్రం కొంచెం కొంచెం తొంగిచూస్తున్నాడు. ఆ వెలుగులో కొండచరియలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అధికారిని లేపి జరిగింది వివరించింది.

'ఆయన చిత్రమైన మనిషిలా కనపడుతున్నాడు. మీరు కంగారుపడొద్దు' అని ముసిలాణ్ణి నిద్రలేపాడు.

టార్చిలైటు వేసుకుని ముగ్గురూ బయలుదేరారు అదొక అంతులేని ఎడారిలా రేటిది. అందులో ఫలానా ఇసుకకణం కావాలంటే సులభంగా దొరకదు.భయంతో రాధ కాళ్ళు ముందుకు నడవటం లేదు. ఆ నాటికి మూర్తితో పరిచయమై సరిగ్గా ఒక్క నెలవుతుంది. మూర్తి తననిర్ణయం మార్చుకున్నట్టు ఇంతకాలం నటించి,అన్నమాట దాటని హరిశ్చంద్రుడిలా ప్రాణాలు తీసుకున్నాడన్నమాట! ఈ నెలరోజులు తనుపడిన శ్రమ - అనుభవించిన ఆవేదన, అసంతృప్తి - అన్నీ పిచ్చివాడికి సంగీతం నేర్పినట్లయ్యాయి. అన్వేషణ ఓ చోట ఆగింది.

'అదుగో!'...అన్నాడు అధికారి.

మూర్తి! కొండకొనకు దగ్గరగా నిలబడి ఆకాశం కేసి చూస్తున్నాడు. పాదాన్ని తడుపుతూ చిన్న ప్రవాహం పారుతోంది. ఏకాంతంలో ఐక్యమైపోయిన అతన్ని ఏ మహాశక్తీ కదలించలేదేమో! రాధ చరచర వచ్చి అతని చేయిపట్టుకుంది.

'బాగుందండి! మీరు అన్నంతపని చేస్తారని కలలో కూడా అనుకోలేదు - ఈ అర్ధరాత్రి - చలిలో ఒంటరిగా!...దీని తాత్పర్యం?' అతను తడబడ్డాడు. పట్టుబడిన దొంగలా దిక్కులు చూశాడు.

'నన్ను క్షమించు రాధా!...మీ అందరికీ బాధ కలిగించాను. నిద్రలో వున్నారు కదా, మేలుకోరను కున్నాను.'

'ఆయన చిత్రకారుడు కదండీ!...' అని సాగ దీశాడు అధికారి - ఇద్దరూ గదిచేరుకున్నారు.

'మీరు ఆత్మహత్య చేసుకుందామనేనా వెళ్లింది? అని గద్దించి అడిగింది రాధ.

'ఆత్మహత్య?...నేను!...ఎందుకని?'

'ఎందుకా?...జీవితానికి భవిష్యత్తు, వర్తమానం లేవు. గడచిన సంఘటనలమీద నిర్మితమవుతుంది. నిరాశ - ఆశాభంగం - అహంభావం - చీకటిలో గొంతు కోయటం - వీటిని కరగించి పోతపోస్తే జీవితం తయా రవుతుంది. ఆశలు - ఆశయాలు - వెలుగు - అనురాగం ఇవన్నీ విలువలేని ఆభరణాలు. వాటితో జీవితాన్ని అలంకరించటానికి ప్రయత్నిస్తాం. ఒక్క అంగుళం దూరంలో వుండగా ఏదో శక్తి నీచేతిలో జీవాన్ని లాగివేస్తుంది. ఆభరణం కిందపడి ముక్కలవుతుంది. మళ్ళీ ఆ ముక్కల్ని ఏరి అతికించే ప్రయత్నంలో పడతాం. సూక్ష్మంగా ఆలోచిస్తే ఇదే బతుకు. ఎదురు గాలులతో పోరాడాలి...కనుక మీరు ఆత్మను చంపే ద్దామనుకున్నారు...అవునా?' మూర్తి వెర్రిగా చూశాడు. ఈ భావాలు తనవే! ఎవరితోనో అన్నట్టు - ఎవరికో రాసినట్టు గుర్తు...ఎప్పుడో, ఎలాగో తెలియ లేదు. మూర్తి సిగ్గుపడి మాట్లాడలేదు.

'మీరు మళ్ళీ పారిపోకుండా ఈ రాత్రంతా నేను కాపలా వుండాలి గామోలు!' అని నవ్వింది.

*  *  *  *

మూర్తికి చిన్నతనంనుండి చిత్రలేఖనమంటే సరదా - తోటి విద్యార్థులు డ్రాయింగు క్లాసులు ఎగ్గొట్టినా, అతనుమాత్రం హాజరయ్యేవాడు. ఒకటి రెండు పరీక్షలలో బహుమతులు కూడా వచ్చాయి. కాని, దాని కతను ప్రాధాన్య మివ్వలేదు. ఎప్పుడైనా తోచిన బొమ్మలు గీయటం - రెండు మూడు నెలలు పోయాక సరిదిద్ది రంగులు వేయటం - అంతే - కాని ఆనాటి రాత్రి జరిగిన చిత్రసంభవాలు అతని మనసులో ఒకానొక గదిలో వెలుగునింపాయి. రాధ కూడా అత నికి సాయపడింది. మనసుకు చీకాకు కలిగినప్పుడు - భరింపరాని దుఃఖం ఎదుర్కొన్నప్పుడు - ఆ ఆవేదనను మరో దెసకు మళ్ళించాలి. జీవితంలో ఓడిపోయిన షెల్లీ రాసిన మనోవేదన మహాకావ్యమైంది. ఎటు చూసినా ఆశాభంగం కారుమబ్బులా కమ్ముకున్నప్పుడు చిత్రకళలో దిగిపోయాడు వాన్‌గో - అలాగే మూర్తి మనసు మార్చివేయా లనుకుంది రాధ.

పత్రికలలో చిత్రకళ గురించి ప్రచురిత మయ్యే వ్యాసాలు చదివాడు. రవివర్మ - బాపిరాజు - ఠాగూర్ - మిల్లెట్ - దేగాస్ - డాడెట్ - చిత్రకారుల బొమ్మలు తెప్పించి గదినిండా అలంకరించాడు. అతని దైనందిన కార్యక్రమం పూర్తిగా మారిపోయింది. కాలేజీకి వెళ్లే వరకూ ఏవో గీస్తూనే వుంటాడు. రాధ అతనిలో పరి వర్తన తీసుకువచ్చింది. ప్రతిసాయంత్రం వచ్చి కూర్చునేది. అలా అయిదునెలలు గడచిపోయాయి. ప్రముఖ పత్రికల్లో తన చిత్రాలు ప్రకటించాడు.

ఓనాడు రాత్రి పదకొండు.

రాధ ఆలోచిస్తూ కూర్చుంది. మూర్తి జీవితంలో తను అడుగుపెట్టి ఆరునెలలైంది. ఇంతకాలంగా ఆకృతి పొందుతూవచ్చిన భయం నిండుగా నిలబడి ఆమెను ఆవరించింది. మంచుగడ్డ నీటి రూపాంతరమైనా, దానికో ప్రత్యేకతవుంది. నీటిలో ఎంతకాలం దాన్ని దాచివుంచగలం? స్నేహితానికి, ప్రేమకు మధ్య పల్చటి తెరమాత్రమే అడ్డం - అది చిరిగిపోకుండా అహర్నిశం కాపలా కాసినా ప్రయోజనం వుండదు - ఓ నిశి రాత్రి దానంతటదే మంచుతెరలా విడిపోతుంది. తను ఈ వాతావరణానికి ఉద్దేశింపబడిందికాదు. మూర్తి రవణకు రాసిన ఉత్తరం మరోసారి నెమరువేసుకుంది. నాన్న నిద్రపోతున్నారు. అగాధంవైపు నడచిపో తున్న ఓ వ్యక్తిని మధ్యలో ఆపివేసి మరో త్రోవ చూపించి 'అదుగో పూలతోట! సృష్టిలోవున్న పూలన్నీ అక్కడ కనిపిస్తాయి. సౌందర్యం సెలయే పాయలుగా చీలి వాటిలో దాగివుంటుంది. అజంతా - హంపీ - పురాతన గ్రీకు సామ్రాజ్యం - మొహంజో దారో, హరప్పాల నాగరికత - అన్నీ అక్కడే వున్నాయి. అదంతా చూస్తూ ఆనందించు - అదే నీ గమ్యస్థానం!' అంది.

'నేను చూసి తిరిగివచ్చేదాకా నువ్విక్కడే వుంటావా?...లేక నీకోసం వెతుక్కుంటూ అగాధం వైపుకు వెళ్ళాలా?' అనడిగాడతను.

అర్థం కానట్టు కనుబొమ ఎగరేసింది.

'అంటే - నీ సౌందర్యం ముందు అవన్నీ కృశించి పోతే?...'

ఆమెకు ప్రశ్న అర్థమైంది - ఎలాగైనా అతను జీవిస్తే చాలు - సరేనని నిరీక్షిస్తూ కూర్చుంది. అతను తిరిగి వచ్చాడు.

'ఉన్నావా? ... వెళ్ళిపోయావేమో ననుకున్నాను. అదంతా జీవంలేని రాతి సౌందర్యం - మాట్లాడలేని మూగప్రకృతి. పువ్వులు అందంగానే వున్నాయి. కాని నవ్వవు - తియ్యగా కబుర్లుచెప్పవు- మనసులో కోర్కెలు పుట్టించవు - నాకవేమీ వద్దు - నువ్వే కావాలి.' అన్నాడు. ఆమె గుండెలో రాయి పడింది. తను ప్రయోగించిన బాణం తిరిగి తనకే తగిలింది.

ఎవరో తలుపు తట్టారు. ఆలోచనలు కరగిపోయాయి. తలుపు తీసేసరికి మూర్తి వచ్చాడు.

'ఎవరు?...మీరా!' రాధ ఏదో అనబోయి ఆగిపోయింది. నాన్న ఇంకా నిద్రపోతూనే వున్నారు.

'ఈ రాత్రిపూట శ్రమ కలిగిస్తున్నందుకు క్షమించు. నా స్నేహితుడొకడు ఇక్కడే వుంటున్నాడు. ఇంతదూరం వచ్చాక నిన్ను చూడకుండా వెళ్ళగలనా?' రాధ ఫ్లాస్కుకోసం లోపలికి వెళ్ళింది. మూర్తి టేబిలుమీదున్న పుస్తకం తీశాడు. ఏదో వుత్తరం జారి కిందపడింది.

'హృదయరాణికి—

ఈ మధ్య నువ్వు ఉత్తరాలు రాయటం లేదు. నాన్న నీకు వంట్లో బాగాలేదని రాశారు. నీకోపం ఎందుకు వచ్చిందో అర్థంకావటంలేదు. మన్యమన్య పరధ్యానంగా వుంటున్నావట. ఇదంతా నిజంకాదని తెలుసు. పుస్తకం తెరిస్తే నీ రూపం ప్రత్యక్షం. చదువెలా సాగుతుంది?...పోనీ నువ్విక్కడకు వచ్చేయకూడదూ...' ఇంకా ఏవో వర్ణనలు.

'మరి నాలుగు నెలల్లో ట్రెయినింగు పూర్తవుతుంది? వస్తున్నా.' అంటూ ముగింపు.

'ఉత్తరం చదవటం పూర్తయిందా?' అనడిగింది కాఫీ కప్పు టేబిలుమీద వుంచుతూ రాధ. మూర్తి సిగ్గుపడ్డాడు.

'మీరు లెక్చరరు - పాఠంతోబాటు నీతినియమాలు బోధించటం మీ విధి...మరొకరి వుత్తరాలు చదవవచ్చా'?

'సారీ రాధా!...మానవసహజమైన కుతూహలం - అంతే...అదలా వుంచి ఈ వ్యక్తి ఎవరు?' రాధ కిటికీదగ్గరకు వెళ్ళి వెనక్కితిరిగి అతనికేసి పరీక్షగా చూసింది.

కొండమీదనుండి కిందకురికి కాళ్ళు విరగ్గొట్టుకున్న ఆవేదన.

'వరసకు బావ. ఒకప్పుడు ఇక్కడే వుండి చదువుకునేవాడు. స్కాలర్ షిప్పుతో చదువుకోటానికి ఇంగ్లండు వెళ్ళాడు.'

'అతను తిరిగిరావటం, శుభలేఖలు అచ్చువేయించటం ఒక్కసారే జరుగుతాయనుకుంటాను.'

రాధ తిరిగి టేబిలుదగ్గరకు వచ్చింది.

'అతనంటే నా కిష్టం వుండాలిగా!...' అంది.

'రాధా!..ఒక్కమాటగుడుతాను.నిజం చెప్తావా?

'ఒకవేళ నేను అబద్ధం చెప్పినా, అది నిజం కాదని మీరెలా నమ్మగలరు? అబద్ధం,నిజం అక్కచెల్లెళ్ళు.'

'నీపరిహాసానికేంగాని...నువ్వు...నువ్వు...'

రాధ గుండె దడదడలాడింది.

'చెప్పండి...' అంది.

'ఎప్పుడైనా, ఎవర్నైనా ప్రేమించావా?'

రాధ కొంతసేపు వూరుకుని, నిజం చెప్పాలని నోరు తెరిచేలోగా నాన్న దగ్గుతూ దిగివచ్చారు.

'ఎవరమ్మాయ్ అది!...ఓహో!...మీరా!...'

రాధకు ముళ్ళమీదున్నట్టుంది. నాన్న ఎలా అర్థం చేసుకుంటారో ఏమో! పది నిమిషాలు ఏవో మాట్లాడి మూర్తి వెళ్ళిపోయాడు.

ఆ మర్నాడుదయం రాధ తన వుద్యోగానికి రాజీనామా యిచ్చింది.

సాయంత్రం రాధ వచ్చేసరికి మూర్తి ఇంట్లో లేడు. పుస్తకాలన్నీ చిందరవందరగా పడివున్నాయి. గోడమీది ఫోటోలు భూమికి సమాంతరంగా లేవు.

రాధకు తను మొదటిసారిగా ఆ ఇంట్లో అడుగుపెట్టిన రోజు జ్ఞప్తి కొచ్చింది.

'మూర్తిగారు ఇంట్లో లేరా?' అనడిగింది.

'పొద్దున్ననగా వెళ్లారు. ఇంతవరకూ రాలేదండి.' అన్నాడు ముసిలాడు.

మల్లెపూల పరిమళం ముక్కుపుటాల్ని దొలిచి వేసింది.

'ఈ గదంతా మళ్ళీ ఇలా తయారైందే?'

ముసిలాడు తన పనితనానికి మెచ్చు వస్తుందని గావాలు సిగ్గుపడ్డాడు.

'అదేమోనండి - రోజూ ఆయనే సద్దుకునేవారు. ఎక్కడ సామాను అక్కడుండేది. ఇయాల మర్చిపోయారు. ఇదంతా నూస్తుంటే ఆయన ఎనకటి మనిషై పోతున్నారని బయంగావుంది - యిసిత్రమైన మేట్టరు గోరు -' ఆ వైచిత్ర్యం తనకు తెలుసుకాని, అతనికేం తెలుసు?-ఫ్లవర్ వేజ్ లో వాడిపోయిన పువ్వులు తీసేసి కొత్తపువ్వులుంచింది. పుస్తకాలన్నీ సర్ది, ఎక్కడి వస్తువక్కడుంచింది. టేబిలుదగ్గర నేలమీదపడున్న సిగరెట్టు పీకలు లెక్కపెట్టింది.

'ఇవన్నీ ఎక్కడివి?'

'ఎక్కడివేంటండి! ... మేట్టరుగారు కాల్చి పారేసినవి. ఈ మూడురోజులుగా ఆయన అదేపనిగా కాలుత్తున్నారండి ... అదేం మాయో - ఆ మధ్య పూర్తిగా మానేశారు.'

పేపర్ వెయిట్ కింద రవణకు రాసిన ఉత్తరం కనిపించింది.

'ఈ ఉత్తరం చదువుకుని, నువ్వు చాలా ఆశ్చర్యపోతావు. ప్రేమను నేనెన్నడూ నమ్మలేదు. నాకొకావలసిందేమిటో తెలుసుకోలేకపోయాను. ఈ అయిదు నెలలు అన్వేషణ సాగించి నిజం తెలుసుకున్నా. నేను రాధ అనే అమ్మాయిని ప్రేమించాను - ఆమె కూడా - అందచందాలు వర్ణించమంటావా?... నేను కవిని కాను - శుభలేఖకోసం ఎదురుచూస్తాండు- నెలరోజులు నెలవుమీద వచ్చేయి.'

రాధ పళ్లు పటపట కొరికింది. తను పొరబడింది. అనురాగం - స్వేచ్ఛ - ఆనందం - ఐశ్వర్యం - ఇవన్నీ మానవులకు కట్టుబడి వారి యిష్టాయిష్టాల కనుగుణంగా నడచుకోవు. రాధ తిరిగి వెళ్ళిపోదా మనుకుంటుంటే మూర్తి వచ్చాడు.

'నాకోసం వచ్చి, చూడకుండానే తిరుగుముఖం పడుతున్నావ్!...గదంతా సర్దినందుకు కృతజ్ఞత.'

రాధ విధిలేక కూర్చుంది. సంభాషణ ఎవరికీ రుచించలేదు. ఆ ఇద్దరిలో ఎవరి మనసూ స్వచ్ఛంగా లేదు - అగ్నిపర్వతాలు బద్దలవటానికి సిద్ధంగా వున్నాయి.

'లోపలకు రండి - ప్రదర్శనకు గీసిన బొమ్మ చూపిస్తాను. నిన్న రాత్రే పూర్తిచేశాను.' రాధ అతన్ని వెంబడించింది.

పెద్ద కాన్వాసు. చిత్రం చూసి రాధ కొయ్యబారిపోయింది. వరుసగా కొండల ఎత్తుపల్లాలు - పక్కనే ప్రశాంతంగా పారుతూన్న నది. నక్షత్రాలు మిణుకు మిణుకు మంటున్నాయి. చందమామ మబ్బుల చాటునుండి 'రానా!...వద్దా!' అంటున్నాడు. నీటి ఒడ్డునవున్న రంగు రంగుల పువ్వుల్ని కోసుకుందామన్న చాపల్యం చెయ్యి చాపమంది. ఆ నదీ తీరంలో ఓ మూల కూర్చుని ఈ ప్రకృతిని తిలకిస్తున్న ఆ అమ్మాయి?

అవును. అది తనే! ముమ్మూర్తులా అది తన ప్రతిబింబం! ఆనాడు మొదటిసారిగా మూర్తిని చూడ్డానికి వచ్చినప్పుడు చేసుకున్న అలంకరణ - శరీరంలో రక్తం త్వర త్వరగా పరుగులెత్తి తతిమా భాగాలకు ఈ వార్త నందించింది.

'ఇక్కడ నేనెలా వొచ్చాను?' అనడిగింది.

'నీకంటె అందమైన అమ్మాయి నా కంట పడలేదు కనక-' అని నవ్వాడు. రాధ మౌనంగా వుంది.

'నీ కిష్టం లేకపోతే, దీన్ని చింపివేస్తాను.'

'వద్దు...ఆ పనిమాత్రం చేయకండి. ఊరికే అడిగానుకాని, ఇలాంటి చిత్రం నేనింతవరకూ చూడనేలేదు. ఇందులో వాస్తవికత వుంది. నీరు జలజలమని పారుతున్న చప్పుడు వినిపిస్తోంది. నక్షత్రాలు మిణుకు మిణుకుమంటున్న భ్రమ! తప్పకుండా పంపండి. ఫస్టు ప్రైజ్ మీదే!' మూర్తి నిర్లక్ష్యంగా నవ్వాడు.

'నాకు బహుమతి అక్కర్లేదు రాధా! నువ్వు బాగుందంటే చాలు. అందుకోసమే రాత్రి - పగలు కష్టపడ్డాను...నాక్కావలసింది ప్రేమించే హృదయం.'

'అక్కడ దొరుకుతుందో చెప్పండి. వెదకి తీసుకువస్తాను...లేకపోతే ఇద్దరం కలిసి వెతుకుదాం.'

'నిజంగా చెప్ప మంటావా?'

'ఊ!'

'ఎందుకు లే!...సమయం రాగానే చెప్తాను... అన్నట్టు అడగటం మర్చిపోయాను. నువ్వు రెండు మూడురోజులుగా కాలేజీకి రావటం లేదు. ఎవరో నువ్వు రిజైన్ చేశావన్నారు. నేను నమ్మలేదనుకో!... నువ్వలా ఎన్నడూ చేయవని నాకు బాగా తెలుసు. అందులోనూ నన్నడక్కుండానా...ఎందుకో, నువ్వు కనపడకపోతే నా మనసు సరిగ్గా వుండదు. అది హృదయ దౌర్బల్యం కాదనిమాత్రం చెప్పగలను.'

'బాగుంది...చక్కటి వుద్యోగం ఎవరైనా వదలుకుంటారటండీ?' అని అబద్ధం ఆడేసింది.

రాధ ఇంటికి వెళ్ళాక ఉద్వేగాన్ని అణచుకుని మూర్తికి పెద్దవుత్తరం రాసింది. మళ్లీ చదువుకుంటే ఆమెకే భయం వేసింది. నిజాన్ని అంత సులువుగా అందివ్వకూడదు. ఉత్తరం చించివేసి మరో కాగితం మీద ఇలా రాసింది.

'నేను రేపు సాయంత్రం లక్నో వెడుతున్నా. అక్కడ మా అక్కయ్య డాక్టరుగా వుంటోంది. ఉద్యోగానికి రాజీనామా ఇచ్చినమాట వాస్తవం. ఈ స్వల్పవిషయానికి అబద్ధం ఆడినందుకు క్షమించండి. మీరు నాకు చాలా ఋణపడి వున్నానన్నారు... ఎందుకో అర్థంకాదు. నేను మీకు చేసిన వుపకారం ఏమిటి?...ఆ చిత్రాన్ని వెంటనే పంపించండి. తీరిక దొరికితే జవాబు రాయండి.'

ఆ వుత్తరం చదువుకుని అత నెంత బాధపడతాడో ఆమెకు తెలుసు. ఈ నాలుగు ముక్కలు నేరుగా అనే ధైర్యంలేదు. బలవంతంగా కళ్ళు మూసుకుని నిద్రపోటానికి ప్రయత్నించింది.. ఎక్కడో ఆకాశం వురిమింది. చినుకులు పడసాగాయి. అకాల వర్షం.

* * * *

చరిత్రలో లక్నో నగరానికి ఎంతో ప్రాముఖ్యం వుంది. కట్టడా లన్నీ పురాతనకాలంతో పెనవేసుకున్నాయి. ఎలాంటి అలజడి లేకుండా ప్రశాంతంగా జీవించే ప్రజలు - రాధ అక్కయ్యతో కలిసి వూరు చూడ్డానికి వెళ్ళినా 'బడా ఇమాంవాడా'లో దారి తప్పింది. ఇద్దరూ వేరయ్యారు.

అదో పెద్దభవనం. లోపల బోలెడు వంకర దారులు. ఏ తోవంట వెడితే ఎక్కడకు చేరుకుంటామో ఎవరూ చెప్పలేరు. అలా తిరుగుతూ, అక్కయ్యా కన పడక అక్కడేవుండిపోవలసి వస్తుందేమో నని రాధ భయపడింది. ఒక చోట హఠాత్తుగా మూర్తి ఎదురయ్యాడు.

'అరె!...మీరా?'

అవును రాధా! ... నమ్మలేకుండా వున్నావు కదూ! ... ఉత్తరంముక్క రాసిపారేసి తుర్రుమంటే నాకు దారి తెలియదనుకున్నావా? లక్నో చూడా లన్న కోరిక నాకూ వుంది. పురాతన నగరం.'

'పురప్రజల తరఫున మీకు స్వాగతం!...కొంప తీసి మీరు కూడా రాజీనామా గీసిపారేసి రాలేదుకదా!'

'నేను లేదన్నా, నిజం చెప్తున్నానని ఎలా అనుకోగలవు?...కనుక నువ్వే కనుక్కోటం మంచిది.'

రాధ మౌనంగా వుండిపోయింది. అబద్ధం ఆడి మోసగించినందుకు, రాళ్లలాంటి నాలుగు మాటలు విసిరినా బాగుండేది!... తెగ తెంపు లయ్యేవి...అలా ఎన్ని సార్లు తిరిగినా బయటకు వచ్చేదారి కనపడలేదు. మూర్తి నవ్వాడు.

'మన జీవితం కూడా ఇలాంటిదే! ఎన్నిసార్లు తిరిగినా ముక్తిమార్గం కనిపించదు. దేనికోసమో వెతుకుతూ వుండటం - అలసి నిద్రపోవటం - మళ్ళీ లేచి అన్వేషణ ప్రారంభించటం - ముసలితనం వచ్చాక తిరిగే ఓపికలేక ఓమూల కూలబడి 'ఓ భగవంతుడా! నాకు తోవ చూపు.' అంటం - అంతే కదూ?'

రాధ ఏదో అందా మనుకుంటుంటే కమల కలుసుకుంది.

'దోబూచులాట బాగుంది స్మా!' అంటూ మూర్తి కేసి ప్రశ్నార్థకంగా చూసింది.

'ఈయనే మూర్తిగారు! గొప్ప చిత్రకారు లని నీతో చెప్పేదాన్ని కదూ! రెండు నెలలు ఓపికపట్టు - ఈయన భూమ్మీద వుండరు.'

'అంటే?' అంది కమల భయంతో.

# అనురాగం - ఆత్మహత్య

రాధ పొరపాటు గ్రహించి ఛటుక్కున నాలిక్కరుచుకుంది.

'అంటే అందరూ ఆకాశాని కెత్తేస్తారు - కీర్తిశ్రీ వరిస్తుంది. మరి భూమితో ఏం పని?...అవునా!... ఇది మా అక్కయ్య - కుమారి కమల! డాక్టరు కమలని కూడా పిలవొచ్చు. మా ఇద్దరికీ వయసులో రెండేళ్లే తేడా!' కమల నమస్కరించింది.

మూర్తి ఆమెను రాధతో పోల్చి చూశాడు. రాధ వెన్నెలైతే కమల వుదయసూర్యుడు. రాధ కళ్ళల్లో మన కిష్టమైన భావాలు చూడొచ్చు. కమల కళ్ళను, కళ్ళజోడు కప్పివేసి నిజాన్ని దాచేసింది. ఇద్దరి నవ్వుల్లోనూ ఎంతో విభేదం.

'మీరు లక్నో అంతా చూశారా?...వస్తున్నట్టు ముందుగా తెలియజేస్తే ఎంతో బాగుండేది!...' అంది కమల.

'ఇప్పుడైనా ఏం మునిగిపోయింది?...మీతో వస్తాను. పదండి.' ముగ్గురూ బయలుదేరారు

అక్కడికి పదినిమిషాలదూరంలో 'ఛోటా ఇమాంబాడా' వుంది. అదొక మసీదులాంటిది. దానికి దగ్గరిలో 'బారాదరి' అనే పురాతనపు కట్టడం వుంది. అక్కడ మొగలాయీ చక్రవర్తుల చిత్రపటాలన్నీ వున్నాయి. మూర్తి వాటిని పరీక్షిస్తూ చాలాసేపు అక్కడే వుండిపోయాడు. మరికొంతదూరం వెడితే పెద్దగడియారం - దాని వ్యాసం ఆరడుగులు. దూరం నుండి చూడవలసిందే కాని ఎవరూ దగ్గరకు వెళ్ళకూడదు. ఒకప్పుడు అది గంటలుకొడితే లక్నో అంతటా వినిపించేది. కాలక్రమేణ దానిశక్తి సన్నగిల్లిందో యేమో మరి. ఇప్పుడు రాత్రిపూట మాత్రమే ఆ శబ్దం వినిపిస్తుంది. మ్యూసియం, అజాయబ్ ఘర్ అన్నీ చూశారు.

'ఇంక ఒక్క బెలీగారద్ మాత్రమే మిగిలింది' అంది కమల.

'పదండి...' అన్నాడు మూర్తి.

'అక్కడకు నేను రాలేను. నాకు భయంగా వుంటుంది.' అంది కమల.

ఇద్దరూ ఆమెకేసి ఆశ్చర్యంగా చూశారు. తిన్నగా గోమతీతీరం చేరుకున్నారు. నీరు ప్రశాంతంగా పారుతోంది. యుద్ధానికి తయారుగా నిలబడ్డ సైనికుల్లా ఇరువైపులా బారులుతీర్చిన ఇళ్ళవరుసలు. మబ్బుల ప్రతిబింబాలు నీటిలోపడి చిత్రంగా కదులుతున్నాయి. ఉన్నట్టుండి కమల వాచీ చూసుకుని, లేచి నిలబడింది.

'సారీ!...నేను ఏడు గంటలకు విజిట్ కి వెళ్ళాలి మీరు వస్తారా?'

'నువ్వెళ్ళు అక్కా!...దీపాలు వెలిగాక ఈ నది ఎలా వుంటుందో చూడాలనుంది.'

కమల కొంతదూరం వెళ్ళాక మళ్ళీ తిరిగి వచ్చింది.

'మూర్తి గార్ని తీసుకు రావటం మర్చిపోకు సుమా! ఊరు కొత్త!...ఈ విజిటింగ్ కార్డు మీ దగ్గ రుంచుకోండి.'

'ఏం!...ఒకవేళ ఆయన రానంటే, భుజంమీద ఎత్తుకునో - లేక తాళ్ళతో కట్టిపడేసి రిక్షాలోనో - తీసుకు రమ్మంటావా?' కమల నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

కొంతసేపు మౌనంగా వుండి 'రాధా!...ఎందుకలా పారిపోయి వచ్చావు? నన్ను పూర్తిగా మార్చివేశావు. నేను ఆశించేది ఇంకా చాలా వుంది. ఇదేమైనా న్యాయంగా వుందా?' అనడిగాడు చిన్నపిల్లాడిలా మూర్తి.

'మీ అభిప్రాయం నా కర్థం కావటం లేదు. అక్కయ్య రమ్మంది వచ్చాను. హఠాత్తుగా బయలుదేరటం మూలాన స్వయంగా చెప్పే అవకాశం దొరకలేదు.'

'అందుకని, ఇరవై నిమిషాల దూరంలోవున్న నాకు, నలభైగంటల తరువాత చేరుకునే వుత్తరం రాశావు - రాధా!...మనం కాస్త మనసులు విప్పుకుని ఉన్నదున్నట్టు మాట్లాడుకుందాం. ఎన్నోసార్లు నీతో చెప్పాలని ప్రయత్నించి మానుకున్నాడు. మనం పిక్నిక్ కి వెళ్ళినప్పుడు - అర్థరాత్రి మీ యింటికి వచ్చినప్పుడు - అన్నీ అవకాశాలే. కాని నువ్వేమనుకుంటావోనని అణచి వుంచాను. మనిషి మనసులో భావాల్ని తెలుసుకోటానికి చేష్టలే ఆధారమైతే మన ప్రేమ నిజం కావాలి!'

రాధ మాట్లాడలేదు. ఇసికలో పిచ్చిగీతలు గీసింది.

'రాధా!...నువ్వు మౌనంగావుంటే కుదరదు. ప్రశాంతంగావున్న నా జీవితంలో అడుగుపెట్టి ఆశ

పెట్టావు. చివరకు ఏమీ ఎరుగని దానిలా మూగనోము పట్టావు.'

'ఆగండి...మీరు ప్రశాంతంగా వున్నారని నేనెన్నడూ అనుకోలేదు. మీరు రమణకు రాసిన వుత్తరం జ్ఞప్తికి తెచ్చుకోండి.

మూర్తి ఆశ్చర్యపోయాడు.

'ఉత్తరం?...ఏ వుత్తరం?'

రాధ వివరించింది. మూర్తి విరగబడి నవ్వాడు.

'గొప్పరిసెర్చి చేశావు రాధా!...నీకు నోబెల్ బహుమానం ఇవ్వవలసిందే!...అయితే నిజం విను. అది వుత్తరం కాదు. ఓ నాడు ఏం తోచక కథ రాయటం మొదలుపెట్టాను. అదే నా మొదటి ప్రయత్నం. ఉత్తరంతో ప్రారంభించాను. రమణ నా మిత్రుడు కనక అతని పేరు పెట్టాను. నేను ఆత్మహత్య చేసుకోటమేమిటి?'

అతను మళ్ళీ నవ్వటం మొదలుపెట్టాడు.

రాధ రాతి బొమ్మై పోయింది. గోమతి ఒక్కసారిగా ఆకాశమంతఎత్తు లేచి ఆమెను ముంచివేసింది. ఇనాంవాడా దగ్గరున్న గడియారం పెత్తిమీద విరుచుకు పడింది. మొగలాయీల పురాతనపుకట్టడాలు ఒరిగిపోయాయి. సూదిమొనమీద బ్రహ్మాండమైన భవన నిర్మాణం. పడమటి దిక్కున అస్తమిస్తున్న సూర్యుడి మంటలు ఆమె కళ్ళ దగ్గరగా వచ్చాయి. ఇళ్ళకు తిరిగి పోతున్న పక్షుల గుంపులు ఆమె వివేకాన్ని హేళన చేస్తూ, గుసగుసలాడాయి. రాధ మూర్తివంక చూసింది. అతను నవ్వటం లేదు. కళ్ళల్లో ఆవేదన, ముఖంలో నిరాశ. పెదవులమీద కొండంతబరువు...దీని కంతకూ తనే కారణం!...మనసు విరిగి అతను ఆత్మహత్య చేసుకుంటే అందుకు తనే బాధ్యురాలు. తల తిరిగి పోతోంది. రాధ చేతుల్తో ముఖం కప్పుకొని వెక్కి వెక్కి ఏడవ నారంభించింది.

'రాధా...ఎందు కేడుస్తున్నావ్?'

'నన్ను క్షమించండి!...నేను ఎవర్నీ ప్రేమించ లేదు. మీ వుత్తరం కథని నాకు తెలియదు. మిమ్మల్ని ఫూండ్ చేశాను...మీలో ఆశ కల్పించి జీవించేట్టు చేద్దామని ప్రయత్నించాను. నా ఆలోచనలు అసందర్భం. అభిప్రాయాలు తప్పు.'

ఆమె ఎంత ఏడ్చినా బాధ కరగదు. మూర్తి దేనికీ జవాబు చెప్పలేదు. లేచి నిలబడ్డాడు.

'వెళ్ళిపోతున్నారా?...' అంది.

'అవును రాధా!...ఇద్దరం పొరపాటుపడ్డాం. ఆ నాడే మీ బావగురించి పూర్తిగా అడిగి తెలుసుకుందామనుకున్నాను. నువ్వు మధ్యలో తుంచివేశావ్.. నువ్వు ఏడవకూడదు. తెలిసిందా? ఎప్పటికి మల్లె కొంటెగా నవ్వుతూ, అందర్నీ ఏడిపిస్తూ వుండాలి. ఈ మాటల్లో పరిహాసం లేదు. నిజంగా చెప్తున్నాను.'

'మా ఇంటికి రండి. అక్కయ్య రమ్మంది' అని గొణిగింది.

ఆ మాటలు విన్నాడో లేదో - బరువుగా అడుగులు వేస్తూ కదలిపోయాడు. సన్నగా, పొడుగ్గా వున్న మూర్తి తలవంచుకుని మసక చీకట్లో, ఇసకలో, బాధగా నడచిపోతూంటే రాధ గుండెలు పగిలిపోయాయి. పరుగెత్తుకువెళ్ళి వెనక్కి పిలుద్దామనుకుంది...కాని అతను తిరిగిరాడు.

ఇంటి కొచ్చేసరికి ఎనిమిది దాటింది. కమల ఆమెకోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

'మూర్తిగారు రాలేదా?'

ఏళ్ళ తరబడి కలిసివున్నా కొందరు ఒకర్నొకరు అర్థం చేసుకోలేరు. మూర్తి కమలకు ఇంతలో దగ్గరయ్యాడా?...రాధ పిచ్చిగా నవ్వింది.

'ఏమిటా నవ్వు?...నా ప్రశ్నకు జవాబుచెప్పు.'

'రాలేదు...'

'ఎందుకని?...'

'ఏమో! ఆయన్నే అడుగు. మధ్య నన్ను చంపకు.' అనేసి మంచంమీదపోయి పడుకుంది. ఎంత ఆపుకుందామనుకున్నా కన్నీరు ఆగదు. ఆ రాత్రి ఒంటిగంట.

రాధ నిద్రపట్టక అటూ యిటూ దొర్లుతోంది. మూర్తి ఆమహానగరంలో ఎక్కడో ఏడుస్తూ వుంటాడు. బహుశ ఈపాటికి గోమతి గర్భాన్ని చేరుకుంటాడు. పోలీసులు శవపరీక్ష చేస్తారు.

'అయ్యో పాపం! ఎంత అందంగా వున్నాడు! ఒడ్డుమీదపడున్న ఈ పుస్తకం అతనిదే గామోలు! దానిమీద 'మూర్తి-ఎం-ఎ-లెక్చరర్' అని రాసుంది. ఎందుకు ప్రాణాలు తీసుకున్నాడో ఏమో!...డబ్బు

లేకమాత్రం కాదు. వేళ్ళకున్న వుంగరాలు - రోలెక్స్ గోల్డువాచీ - జేబులో నోట్లకట్టలు...'

'కాలుజారి పడ్డాడేమో!...లేక ఈతకోసం వెళ్ళి సుడిగుండంలో చిక్కుకున్నాడేమో!'

'ఎవరో అమ్మాయి ప్రేమించినట్టు నటించి మోసగించివుంటుంది.'

ఈ చివరి కారణం అందరికీ నచ్చింది. ఈ వార్త వూరంతా పాకింది. మర్నాడు పత్రికలలో రకరకాల శీర్షికలు. 'ప్రేమించి మోసగించిన పడతి' - 'అనురాగం ఆత్మహత్యకు' - 'ఆడదాని ఆటలు' - 'ఎవరా అమ్మాయి?...జైలులో పెట్టండి.' అంటారు అందరూ.

రాధ ఆలోచించటం మానేసి ఏదో పుస్తకం చదవసాగింది.

తలుపు దబదబ బాదుతున్న చప్పుడు. 'డాక్టరమ్మగారూ!' అని సింహద్దిలో ఎవరో పిలిచారు. కమల తలుపు తీసింది. పదిమంది ఎవర్నో మోసుకొచ్చి బల్లమీద పడుకోబెట్టారు.

'బెలీగారద్ దగ్గర ఈ మనిషి సొమ్మసిల్లి పడివున్నాడు. అర్థరాత్రిపూట ఆ దోవంట ఎవరూ వెళ్ళరు. నలుగుర్నీ పోగుచేసుకుని, ఆస్పత్రికి తీసుకువెడదామనుకున్నాము. జేబులో ఈ విజిటింగు కార్డు కనిపించింది. మీ తాలూకుమనిషని తీసుకువచ్చాం.' అన్నాడు ఆ గుంపులో ఒకతను.

'థాంక్స్!...ఆయన మాకు తెలిసినవాడే!' అంది కమల.

అందరూ వెళ్ళిపోయాక రాధ నెమ్మదిగా గదిలోకి వచ్చి చూసింది.

ఆమె అనుమానం సరైందే!...అతను మూర్తి!.. పది నిమిషాల్లో అతనికి తెలివి వచ్చింది.

'అక్కయ్యా!...బెలీగారద్ అంటే ఎందుకు భయం?'

'సిపాయిల తిరుగుబాటు జరిగినప్పుడు చాలామంది ఆ ప్రదేశంలో నరికివేయబడ్డారు. వాజద్ ఆలీషా భార్యలు భూమికింద భవంతిలో వుండేవారు. అక్కడకు వెడితే, ఈ నాడు కూడా రక్తపువాసన వేస్తుంది. మూర్తి జడుసుకుంటాడు. అందుకే అక్కడికెవరూ ఒంటరిగా వెళ్ళరు...ఒంటరిగా వదలి రావద్దన్నాను - విన్నావు కాదు.

* * * *

ఆమర్నాడుదయం కమల వచ్చి చూసేసరికి మూర్తి జ్వరంతో వణుకుతున్నాడు. కళ్ళు రెండూ ఎర్రగా వున్నాయి. రాధ కాఫీ తీసుకొచ్చింది. టెంపరేచర్ చూశాక కమల ఇంజక్షనిచ్చింది.

'మీకు నామూలంగా చాలా శ్రమ!...అసలు నేనిక్కడికెలా వచ్చాను?'

'నేను కోరుకున్నాను కనక - గెలుపు నాది.' అంటూ నవ్వుతూ రగ్గు మెడదాకా కప్పింది కమల.

మూర్తికి జ్వరం హెచ్చుతూ వచ్చింది. రాధ గంట గంటకు టెంపరేచర్ చూసి,చార్టులో గుర్తు పెట్టింది. కమల లేనప్పుడు తనే మందు ఇచ్చేది. ఒకవేళ అతను శాశ్వతంగా కన్నుమూస్తే అందుకు బాధ్యులెవరు?

'మీకు మీ వాళ్ళెవరూ లేదా?...ఇలా వుందని వైరిద్దాం.' అంది రాధ.

'లేరు...' అన్నాడు బాధగా మూలుగుతూ.

'లేకేం?...నే వున్నాను. వూరుకోండి.' అక్కచెల్లెళ్ళు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

జ్వరం టైఫాయిడ్ లో దిగింది. రాధ క్రమంగా దూరమైంది. అనురాగం మంచిదైనా దూరంగా వుంచితేనే మంచిది. ఒక్క కంటిచూపుతో కొండలూ నదులూ ఎడారులు అన్నింటినీ రూపుమాపవచ్చు. వేళకు మందివ్వటం - పళ్ళరసం పిండి అందివ్వటం - పక్క వేయటం అన్నీ కమలే నిర్వహించింది. రాధను సాయపడమని ఆమె అడగలేదు. డిస్పెన్సరీలో రోగుల విషయంలో కూడా అశ్రద్ధగా వుండసాగింది. అంతరాంతరంలో ఏదో కొత్తభావం మొలకవేసింది.

నలభై రోజులలో మూర్తి లేచి అటూ యిటూ తిరగసాగాడు. కమల కాలేజీ ప్రిన్సిపాలుకు ఉత్తరం రాసి రెండు నెలల సెలవు మంజూరు చేయించింది. ఇంట్లో వున్నంతసేపూ అతనిదగ్గరేవుండి ఏవో కబుర్లు చెప్పేది. డ్రాయింగు పుస్తకం, పెన్సిలు అతని ముందు పడేసి బొమ్మలు గీయమనేది. కారంబోర్డు ముందు కూలేసి ఆడమనేది——వీలైనప్పుడల్లా రాధ కూడా పేకాటలో పాల్గొనవలసిందే——సినిమాకు వెడితే అతని పక్కనే తను కూర్చోవాలి.

'కమల కూడా అతన్ని చివరికి మోసం చేస్తుంది. ప్రేమిస్తున్నానని ముందే ఎందుకు చెప్పకూడదు?' అనుకునేది రాధ.

'ఇలాంటి శుశ్రూష దొరికేపక్షంలో ప్రతివాడూ టైఫాయిడ్ జ్వరాన్ని రారమ్మని ఆహ్వానిస్తాడు——' అన్నాడు మూర్తి.

'అందరికీ ఆ అదృష్టం కలగదు. అవునా రాధా?' అంటూ కలుక్కుమంది కమల. కళ్ళజోడు కొంచెం కిందకు జారింది.

'మీ ఋణం ఎన్నడూ తీర్చుకోలేను.'

'అబ్బబ్బ...ఈ ఋణం సంగతి ముందుగా ఎవరు కనిపెట్టారో తెలియదు కాని—అతనికి మనం చాలా ఋణపడివున్నాం...మేష్టారు! ఇందులో బలవంతం ఏమీలేదు. మొహమాటం అసలు లేదు. మిమ్మల్ని ఆస్పత్రిలో చేర్పించి వుందును. ఎందుకో మనసు సమ్మతించలేదు...అయినా అంత తొందర ఎందుకు? నెమ్మదిమీద ఋణం తీర్చుకోవచ్చు...ఇన్‌స్టాల్‌మెంట్ బేసిస్ అయినాసరే—నా అభ్యంతరంలేదు.'

'మీ కోరికను తోసిరా జనవలసివస్తోంది...ఎందుకంటే నేను రేపే వెళ్ళిపోతున్నా.'

కమల త్రుళ్ళిపడింది.

'ఎక్కడకు?...'

'ఇక్కడకు రాకపూర్వం ఎక్కడుండేవాణ్ణో అక్కడకు...'

'మీ ఆరోగ్యం ఇంకా సరికాలేదు. అప్పుడే వెళ్ళొద్దు. నేను వెళ్ళనివ్వను.'

కమల చనువుకు రాధ ఆశ్చర్యపడలేదు.

'కట్టిపడేసినా, తెంచుకుపోతాను.' అన్నాడు మూర్తి నవ్వుతూ.

మీకు మా ఎవరిమీదా అభిమానం లేదా?'

మూర్తి తెల్లబోయాడు.

'మీరు పొరబడుతున్నారు...మళ్ళీ వస్తానుగా! పోనీ—మీరు రండి.'

'కాదు...అత నెన్నడూ రాడు. అనుకుంది రాధ.

*    *    *

మూర్తి లక్నో వదలి వెళ్లి పదిరోజులైంది.

రాత్రి పదిగంటలైంది. రాధ కిటికీవారగా కూర్చుంది. వాల్‌లాంప్ వెలుతురు ఒక చెంపమీద మాత్రం పడుతోంది. పనిలేని సోమరిపోతుల్లా మబ్బులు తిరుగుతున్నాయి. చంద్రుడు ఎక్కడో దాక్కుంటే నక్షత్రాలు చిన్న చిన్న దీపాలు పట్టుకుని, చీకటిలో అతనికోసం వెదకుతున్నాయి. ఎవరో పాడుతున్న పిచ్చి గీతాన్ని గాలి చెవులదగ్గరకు మోసుకొచ్చింది. చెట్లు

ఆనాటి జీవితంలో మధురక్షణాలను నెమరువేసుకుంటూ, మధ్య మధ్య ఆనందంగా తల లూగిస్తున్నాయి.

రాధ మరోసారి ఆ బొమ్మకేసి చూసింది. చెక్కుచెదరని అదే సౌందర్యం. ప్రదర్శనలో బహుమతి పొందవలసిన ఆ చిత్రం తనదగ్గరకు చేరుకుంది. ఆ వుత్తరం చదువుకోవాలి—ఒకసారి కాదు. వందసార్లు-సారాంశం మాత్రం అదే.

'రాధకు—

నిన్ను నిందించటానికి ఈ వుత్తరం రాస్తున్నాననుకోకు. ఆనందంలో దుఃఖాన్ని చూడటం ఎంత తెలివితక్కువో, మనసులో భావాన్ని చూడటం అలాంటి పిచ్చిపనే! నావిషయంలో నువ్వు చూపిన శ్రద్ధకు, అనురాగానికి కృతజ్ఞత చెప్పటం మర్చిపోయాను.

ఈ చిత్రం నాదగ్గరుంటే, పాతసంగతులు జ్ఞప్తికొచ్చి మనసు బాధపడుతుంది. అందుకని నీకే పంపుతున్నా. అది నీ ప్రోత్సాహంవలన గీసినది. దాన్ని పోటీకి పంపమన్నావు — నాకు బహుమతి మీద కోరిక లేదని ఇదివరకు నీతో చెప్పాను- ఇప్పుడూ అంతే — సుషుప్తిలో వున్న నన్ను మేలుకొలిపావు. నువ్వు విదలించివేశావు — అది నీ తప్పు కాదనుకో — కనుక మళ్ళీ నిద్రపోతాను. ఈ బొమ్మను మాత్రం చింపివేయకు. పెట్టె అడుగున పడవేసి వుంచు — ఏ నాడైనా తీసి ఓమారు చూడవచ్చు.

ఏం...? ఈమాటు నేను తప్పకుండా ఆత్మహత్య చేసుకుంటానని అనుమానంగా వుందా?'

రాధ తనివితీర ఏడ్చింది. మూర్తి ఇప్పుడెలా వుంటాడు? ...... రాత్రి ఏ ఒంటిగంటకో ఇంటికి వస్తాడు. అతనింకా రాలేదని ముసిలాడు విసుక్కుంటూ, గొణుక్కుంటూ, అరుగుమీద కునికిపాట్లు పడుతుంటాడు. 'ఎందుకింత ఆలస్యంగా వచ్చారు? మీ ఆరోగ్యం చెడిపోదూ?' అనేవరూ అడగరు — తనైతే అడిగేది. గదంతా అడ్డదిడ్డంగా పడివున్న సామానుతో చీకాకుగా వుంటుంది. మర్చిపోదామన్నా సాధ్యంకాని సంఘటనలు — గవణకు రాసిన వుత్తరం చదివినప్పుడు కలిగిన ఆవేదన — కొండమీద అతనికోసం వెదకటం - ఏకాంతంలో ఒకర్నొకరు అర్థం చేసుకోటానికి శిన ప్రయత్నాలు - ఏదో చెప్పాలనుకుని మూగగా పోయిన క్షణాలు-గోమతీ తీరంలో ప్రేమను తిరస్కరించినప్పుడు బాధతో నడచిపోతున్న అతని విగ్రహం అన్నిటికంటె ఎక్కువగా చివరిసారిగా అతను పంపిన కానుక—ఇవన్నీ సూదిపోట్లు...

“ఇంతకూ అతని జీవితంలో ఎందుకు అడుగుపెట్టావ్?...అతన్ని ఒక్కసారైనా నువ్వు ప్రేమించలేదా?” అనెవరైనా అడిగితే—

“లేదు...అతను ఆత్మహత్య చేసుకుంటాడని అపోహపడ్డాను. అంటే అతనిలో ఏదో లోపం వుందన్నమాట. అతన్ని ప్రేమిస్తున్నట్టు నటించి జీవితం తియ్యటి మిఠాయిలాంటిదన్న అభిప్రాయం కలగజేయాలనుకున్నాను. జీవించాలన్న కోర్కె కలుగగానే మనసును మరోదిశగా మళ్ళించవచ్చనుకున్నాను - చిత్రలేఖనం మీదో, లేక మరో సౌందర్యంమీదో...అక్కడే పొరబడ్డాను. అతను నన్నే ప్రేమిస్తాడనుకోను. త్రోవ చూపుదామనుకున్నాను కాని, గమ్యస్థానం చేరేవరకూ కలిసి ప్రయాణంచేద్దామని ఎన్నడూ అనుకోలేదు. చివరకు నావూహ సరైందికాదని తెలుసుకున్నా... మన స్తత్వాలమీద ప్రయోగం ఫలించలేదు...”అంటుంది రాధ.

అడుగుల చప్పుడు విని వులిక్కిపడింది రాధ. కమల మెడికల్ చెస్ట్ టేబిలుమీదుంచింది.

'రాధా!...ఏడుస్తున్నావా?'

'లే దక్కయ్యా! ... ఎక్కువసేపు మేలుకు నుండటంవలన వేడిచేసి...' అని నసిగింది.

'డాక్టరుదగ్గర అబద్ధం చెప్పటానికి ఎంతో నేర్పరితనం వుండాలి. తెలుసా?...ఆ వుత్తర మేవిటి?'

రాధ వుత్తరం దాచటం మర్చిపోయింది. ఉత్తరం లాక్కుని చదివింది.

'అతను నిన్ను ప్రేమించాడా?...' అనడిగింది ఆశ్చర్యపోతూ. రాధ సమాధానం చెప్పలేదు.

'ముందుగా తెలిస్తే నేను దూరంగా వుందును... ఇద్దరం ఓడిపోయాం' అనుకుంది కమల.

కమల లోపలికిపోగానే రాధ నిట్టూర్చింది. తనకు తెలుసు. మూర్తి తప్పకుండా ఆత్మహత్య చేసుకుంటాడు. ఆ వార్తకోసం పత్రికలో ఎదురుచూడవచ్చు.

ఏమనుకుందో, ఏమో —గబగబ లేచివెళ్ళి ఆ చిత్రాన్ని వయ్యిముక్కలుగా చింపి కిటికీలోంచి జారవిడిచింది. ఆముక్కలు ఏకంకావటానికి ప్రయత్నిస్తూ, మూర్తిని వెతుక్కుంటూ, గాలిలో కదలిపోయాయి.

# బంగారు ప్రమాణము

శ్రీ రాచకొండ రామదాసు

దేశములమధ్య వ్యాపార సంబంధములనుగూర్చి ప్రసంగించునపుడు బంగారు ప్రమాణమును గూర్చి తరచుగా వినుచుందుము. మొదటి ప్రపంచ యుద్ధమునకు పూర్వము పెక్కు దేశముల ద్రవ్యనాణెపు బాహ్యాంతర మూల్యము లీ ఏర్పాటుపై ఆధారపడి యుండెను. దేశములమధ్య బంగారపు నిలువల కదలికకు (Gold movements), దేశముల ద్రవ్యవిధానమునకు, ఆర్థికస్థితిగతులకు దగ్గర సంబంధముండెను. బంగారు ప్రమాణమను పద్ధతిపై దేశీయ ద్రవ్యముల విదేశీ వినిమయపు విలువలు (Foreign Exchange Values) నిర్ణీతమగుచుండెను. 1931 వ సంవత్సరము తర్వాత సంప్రదాయ సిద్ధముగ శతాబ్దులాదిగా బంగారు ప్రమాణము ననుకరించి, ఆ పద్ధతిని సమగ్రముగా రూపొందించుటలో ప్రముఖపాత్ర వహించిన ఇంగ్లాండు దేశముతోపాటు ఇతర దేశముల నేకములు దానిని విడనాడెను. 1931 వ సం॥నాటి ఆర్థికమహామాంద్యము (Great Depression) ను బృహద్విభాజకమని (Grate Divide) వ్యవహరింతురు. ఏలనన ఆ నాటితో దేశాంతరవాణిజ్య, ద్రవ్యసంబంధములలో ఒక యుగపు మార్పుకల్గెను. అప్పటినుండి అంతర్జాతీయార్థిక క్షేత్రములోగాని, అంతర్దేశ ద్రవ్యవిధానములోగాని బంగారు లోహపు ప్రాముఖ్యము కొఱవడెనని తలపరాదు.

బంగారు ప్రమాణమను పద్ధతి ప్రత్యేకించి ఏ దేశస్థులును కల్పించినది గాదు. కాలక్రమమున అనుభవ ఫలితముగా రూపొందెనని చెప్పవచ్చును. సాధారణముగా "అ" అను దేశములో చెల్లుబడియందున్న ద్రవ్యమును విదేశస్థులు స్వీకరించుటకు సంసిద్ధులు కాకుండుటయందు తీవ్ర అవిశ్వాసముగాని, ప్రాతికూల్యముగాని కారణము కానక్కరలేదు. ఆ దేశపు కరెన్సీ ఏర్పాట్లు, ప్రభుత్వదార్ఢ్యము తెలియకుండుట లేదా కరెన్సీ యొక్క విదేశీ వినిమయపు విలువను స్థిరముగా నుంచుటకు దేశీయ ప్రభుత్వమెట్లు సంకల్పించెనో స్పష్టము కాకుండుట మూలమై యుండవచ్చును. ఈ అనిశ్చిత సందిగ్ధస్థితిని వైదొలగించుటకు విదేశీ వ్యాపార సంబంధములలో ప్రత్యేక వినిమయపు ఏర్పాటు ఆవశ్యకము.

బంగారు ప్రమాణమునకు రెండు ముఖ్యలక్ష్యములు కలవని చెప్పవచ్చును. మొదటిది కరెన్సీయొక్క అంతర్దేశ విలువ (Internal or domestic value) దిగజారకుండునట్లు పరిరక్షించుట. కాగితపు కరెన్సీ విరివిగా చెల్లుబడియగు నేటి కాలములో ద్రవ్యనిర్వహణ లక్ష్యములలో (Aims of monetary management) ఈ లక్ష్యము ప్రధానమనుటలో సందేహము లేదు. కాని బ్యాంకింగు చర్యల కట్టడి, ధరల నియంత్రణ, రేషనింగు తదితర భౌతికమగు కట్టుబాట్లు, ప్రభుత్వ ఆర్థికకర విధానముల ద్వారాకూడ ఈ లక్ష్యమును సాధించుట సాధ్యమని నేటి సిద్ధాంతము. బంగారు ప్రమాణము యొక్క రెండవ లక్ష్యము ద్రవ్యనాణెపు విదేశ వినిమయపువిలువ స్థిరభావము కల్గియుండునట్లు గావించుట. ప్రపంచ వాణిజ్యమునకు దేశాంతర ఆర్థిక, వాణిజ్య సహకారముల పురోభివృద్ధికి వినిమయపు విలువల స్థిరగతి మూలావసరము. సరుకుల ఎగుమతి దిగుమతులకు, దేశములమధ్య పెట్టుబడుల లభ్యతకు వినిమయనిష్పత్తి ఒకే స్థాయిలోనుండవలెను. అట్లుగాక తరచు మార్పుచెందుచున్నచో విదేశీ వాణిజ్యార్థిక సంబంధములకు హాని కల్గును. ఉదాహరణకు భారతదేశమునుండి ఎగుమతియగు తేయాకు టన్ను రూ. 6,000 చొప్పున విదేశములకు సరఫరా యగుచున్నదని యూహింతము. బ్రిటిష్ కరెన్సీయగు పౌండునకు, భారత ద్రవ్యమగు రూపాయకు వినిమయపు రేటు £ 1=15 రూ లేక 1 రూ= 1 షి 4 పెన్నీలున్నదని తలచి, రవాణా, సముద్ర భీమా, వ్యాపార సుంకముల ఖర్చులన్నియు పైవ్యాపార ధరలోనే చేరియున్నవని ఎంచినచో, భారతదేశము నుండి ఎగుమతి యగుచున్న తేయాకు బ్రిటనులో టన్ను 400 పౌన్ల ధరకు లభించును. రూపాయ - పౌను పరస్పర వినిమయపు ధర స్థిరముగా నుండునని యూహించి టన్ను రూ 6000 లకు కొనుటకు బ్రిటిషు వర్తకసంస్థ ప్రతినిధి వ్యాపారపు ఒడంబడిక ఏర్పరచుకొన్నచో రూపాయ-పౌను వినిమయపు ధర 1 రూ=2 షిల్లింగులు లేక 1 పౌను=10 రూపాయలుగా తారుమారైనపుడు బ్రిటిషు వ్యాపారసంస్థకు వ్యాపా[illegible] పరిస్థితులవలన తీవ్రనష్టము కల్గును. ఏలనన, [illegible]

రూ. 6000 చెల్లించుటకు 400 పౌన్ల బ్రిటిషు కరెన్సీ చెల్లించుటకు బదులు క్రొత్తధరనుబట్టి 600 పౌన్లు చెల్లింపవలసియుండును. అట్లుగాక అంతర్జాతీయ రంగములో ప్రత్యేకానుకూల స్థితిగతులవలన బ్రిటిషు కరెన్సీ విదేశీ వినిమయపు విలువ పెరిగిన దనుకొందము. 1 పౌను=20 రూపాయలు లేక 1 రూ=1 షిల్లింగు వినిమయపు ధరయని తలచినచో భారత వ్యాపారస్థులకు రూ 6,000 టన్నుల తేయాకునకు చెల్లించుటకు బ్రిటిషు వ్యాపారసంస్థ పౌన్లు 300 బ్రిటిషు విదేశీ వినిమయ బ్యాంకులో కట్టినచో ఋణపరిష్కారమగును. పై ఉదాహరణలో విదేశీ వినిమయపు రేట్ల మార్పువలన ఎగుమతి దిగుమతి వ్యాపారములో ఎట్టి తీవ్రపరిణామము లుత్పన్నమగునో స్పష్టమగును. పైగా వినిమయపురేట్లు వ్యాపారసంస్థల నియంత్రణమందు లేవు. విదేశీ (Invest ments) పెట్టుబడులు ఋణములు (Loans and Foreign investments) విషయములోను నిట్టిచిక్కులే కల్గును. ఈ అనర్థమును తొలగించి, విదేశీ వినిమయపు విలువలస్థిరభావమును సాధించుటకు రూపొందిన అంతర్జాతీయపు ఏర్పాట్లలో 1931 వ సం॥నకు పూర్వము బంగారు ప్రమాణ విధానము ప్రముఖ పాత్ర వహించెనని చెప్పవచ్చును.

ఆయా దేశీయార్థికావసరముల కనుగుణముగా కాలోచితముగా బంగారు ప్రమాణ మనేకరూపాంతరములను ధరించెను. పూర్తి బంగారు ప్రమాణము (Full Gold Standard) లేదా బంగారు కరెన్సీ ప్రమాణము (Gold Currency Standard) ఇంగ్లాండు దేశములో ప్రథమ ప్రపంచ యుద్ధమునకు పూర్వము వాడుకలో నుండెను. హిందూదేశములో కూడ బంగారుకరెన్సీ ప్రమాణము ప్రవేశపెట్టబడవలెనని 1898 వ సం॥లో ఫౌలరు కమిటీవారు సూచించిన పిమ్మట 1899 వ సం॥లో బంగారు సవరనులు, అర్థసవరనులు వాడుకలోనికి తేబడెను. కాని ఈ ప్రయోగము సఫలమగుటకు తగిన కాలవ్యవధి కల్పించక అల్పకాలములోనే ప్రభుత్వము తన విధానమును మార్చుకొనెను. విద్యాధికులు భారతదేశపుకరెన్సీవిధానము బ్రిటిషుద్రవ్యవిధానమునకు ప్రయోగసాధన మగుచున్నదని విమర్శింపజొచ్చిరి. దీనికి కారణము బంగారు నాణెములు దేశములో వాడుకకు ప్రవేశపెట్టుమాట యెట్లున్నను విదేశీ వినిమయపు ఏర్పాట్లకు బ్రిటిషు స్టెర్లింగుతో భారత ద్రవ్యమును అంటకలుపుట (Linking the Indian Rupee with the British Sterling), కౌన్సిలు బిల్లులు, రివర్సు కౌన్సిలు బిల్లులు ప్రయోగాత్మకముగా వాడుట మొదలగు చర్యలే. 1900 సం॥ తర్వాత 1931 వ సం॥ వరకు హిందూదేశపు ద్రవ్యవిధానమును బంగారు వినిమయ ప్రమాణమని (Gold Exchange Standard) వ్యవహరింపవచ్చును. కాగితపు కరెన్సీతోపాటుగాని, పూర్తిగాగాని బంగారు నాణెములు వాడబడుచున్న దేశములందు బంగారు కరెన్సీ ప్రమాణ మమలులో నున్నట్లూహించుట సభ్యమగును. బంగారు లోహమునకు బదులుగా బంగారు నాణెములు, లేదా నాణెములకు బదులుగా బంగారు లోహము ఎంత మొత్తములకైనను నియమితమగు ధరకు లభ్యమొనర్చుటకు కరెన్సీ అధికారులు సంసిద్ధులైయుండుట బంగారు ప్రమాణపు ముఖ్య లక్షణము. కొన్ని సందర్భములలో—ఉదాహరణకు, 1925 వ సం॥ నుండి 1931 వ సం॥ వరకు ఇంగ్లాండు దేశములో దేశపు అంతర్వ్యవహారములకు బంగారు నాణెముల వాడుక నిలుపుదల గావింపబడినను, కేంద్ర బ్యాంకు గాని తదితర సాధికార సంస్థగాని నియమితమగు ధరకు నిరవధికమగు మొత్తములలో దేశపు కరెన్సీకి బదులుగా బంగారు క్రయవిక్రయమును సాగించు నేర్పాటు రూపొందవచ్చును. ఇదియును బంగారు ప్రమాణపు రూపాంతరమే. దీనిని బంగారు లోహమాత్ర ప్రమాణ (Gold Bullion Standard) మని వ్యవహరింతురు. దేశపు కరెన్సీ, విదేశ వినిమయమునకై పోత బంగారము లేదా బంగారు కడ్డీలలోనికి మార్చునవకాశము కలదు. బంగారు కరెన్సీ పద్ధతి, బంగారు పోతకడ్డీ పద్ధతిగాక బంగారు ప్రమాణపు మూడవ రూపాంతరమే 1900 సం॥ తర్వాత మనదేశములో అవతరించిన బంగారు వినిమయ ప్రమాణము. ఈ పద్ధతి మెక్సికో, ఇతర దక్షిణ అమెరికా రాజ్యములందుకూడ ప్రచారములోనికి తేబడెను. చిన్న రాజ్యములకు, నిరుపేద దేశములకు ఈ పద్ధతి అనుసరణీయమని కేన్జ్ అను ప్రముఖ అర్థిక విజ్ఞాని అభిప్రాయము ప్రకటించెను. బంగారు ప్రమాణము ననుసరించెడు ఇంగ్లాండు, అమెరికా సంయుక్త రాష్ట్రములవంటి దేశముల కరెన్సీతో తమ దేశపు కరెన్సీకి స్థిరమగు విలువ కల్పించి, విదేశ వినిమయావసరములకు బంగారు ప్రమాణముగల ఇతర దేశ కరెన్సీలోనికి మార్చు నేర్పాట్లు చేయుట బంగారు వినిమయపద్ధతి యనవచ్చును. పైన చర్చించిన మూడు బంగారు ప్రమాణ రూపభేదములుగాక 1944 వ సం॥లో అంతర్జాతీయ ద్రవ్యనిధి ఆధ్వర్యమున సభ్యదేశములచే నంగీకరింపబడిన కరెన్సీ ఏర్పాట్లను బంగారు తులనాత్మక ప్రమాణము (Gold Parity Standard) అని "ఇకానమిస్టు" అను ఆంగ్లేయ వ్యాపార, అర్థిక విషయ ప్రధానమగు వారపత్రిక మాజీసంపాదకులుగా ప్రఖ్యాతి నొందిన జెఫ్రీక్రౌథరు నిర్వచించిరి. అంతర్జాతీయ

ద్రవ్యనిధిలో సభ్యత్వముగల దేశములు తమ తమ కరెన్సీలను బంగారములోనికిగాని, ప్రమాణ ప్రాయమగు విదేశీకరెన్సీలలోనికిగాని మార్చునవకాశము (Convertibility of Currency) క్రమముగా సాధింప దలచి అంతర్జాతీయ ద్రవ్యనిధి ఆ విషమ సమస్యను సభ్యదేశముల నిర్ణయమునకు వదలినను, నిధినియమముల ననుసరించి బంగారమునకు ప్రత్యామ్నాయముగా కరెన్సీయొక్క విదేశీ వినిమయ మూల్యమును స్థిరముగా నుంచు బాధ్యతను ఆయాదేశ ప్రభుత్వములు స్వీకరింప వలెననియు, ప్రతికూల వ్యాపార శేషము, చెల్లింపుల లెక్కలలో క్లిష్టపరిస్థితులు ఏర్పడినచో ఇతర దేశము లతోగాని, ద్రవ్యనిధితోగాని సంప్రదింపక ద్రవ్యపు విదేశ వినిమయపు విలువను కుంచించుట నియమ విరుద్ధ మనియు అంతర్జాతీయ ద్రవ్యనిధి నియమావళియందు ఉటంకింపబడెను. అంతేగాక సభ్యత్వముగలదేశాలు తమ దేశపు కరెన్సీ విలువను బంగారు ప్రమాణముధరనుబట్టి గాని, అమెరికా దేశపు డాలరునుబట్టిగాని నిశ్చయింప వలెను. అల్పకాలములో నేర్పడు విపరీత వ్యాపారపు కొఱవ (Deficits in Balance of Payments) వలన కరెన్సీల విదేశవినిమయపువిలువ కుంచితము (Devaluation of Currency) చేయు ప్రమాదమేర్పడినచో ద్రవ్య నిధినుండి అల్పవ్యవధి ఋణములను విదేశ కరెన్సీలలో తీసుకొనవచ్చును. దీనివలన ప్రయోజనములేక వ్యాపారపు లెక్కలలో శాశ్వత ప్రాతికూల్య పరిస్థితు లేర్పడినచో నిధి అధికారుల సంప్రదింపుతో దేశపు కరెన్సీయొక్క వినిమయపు విలువ తగ్గింపవచ్చును. సభ్యత్వదేశముల కరెన్సీలు బంగారమునుబట్టి విలువలు నిర్ణయించి, వానిని స్థిరబద్ధముచేయు ఏర్పాట్లను బంగారు తులనాత్మక ప్రమాణమని పేరిడవచ్చును. బంగారు ప్రమాణపు పూర్తిలక్షణములుగాని, అతికఠినమగు దాని ఆచరణ సూత్రములుగాని నేడు వాడుకలో లేకున్నను కరెన్సీల విదేశ వినిమయపు విలువలను నిశ్చయపరచుటందు, బంగారమునకు ప్రత్యేక ప్రాముఖ్యము గలదు.

కరెన్సీల విదేశ వినిమయపురేట్లు స్థిరభావము కల్గియుండుట విదేశ వాణిజ్యార్థిక సంబంధముల కెట్లావశ్యకమో, బంగారు ప్రమాణపు రూపభేదము లేవో ఇంతవరకు విశదీకరించితిమి. ఈ ఏర్పాటువలన వివిధ దేశపు కరెన్సీల పరస్పర వినిమయపు విలువ లెట్లు నిర్ణీతమగు చున్నవో, అంతర్జాతీయ వాణిజ్యరంగములో బంగారు ప్రమాణ మెట్లు స్థిరపరిస్థితులను సాధింపగల్గునో విపులీకరింపవలెను. ఇంగ్లాండుదేశము బంగారు ప్రమాణము ననుకరించుచున్నదని తలంతము. కరెన్సీ విషయములు ఇంగ్లాండు బ్యాంకు నిర్వహణకు లోబడియుండును. ఎంతటి మొత్తమునకైనను దేశీయ ద్రవ్యనాణెములకు బదులు బంగారమును, బంగారమునకు బదులు నాణెములను నిర్ణీతధరకు ప్రజలకు అందచేయువిధి ఇంగ్లాండు బ్యాంకుపై మోపబడును. ఇట్లు 1914 వ సంవత్సరము నకుముందు, తిరిగి 1925 వ సంIIనుండి 1931 వ సంII వరకును ఔన్సు బంగారమును మూడుపౌన్లు పదునేడు షిల్లింగుల తొమ్మిది పెన్నీలకు కొనునట్లు, మూడు పౌన్లు పదునేడు షిల్లింగుల పదిన్నర పెన్నీల కమ్మునట్లు ఇంగ్లాండు బ్యాంకు ఆదేశింపబడెను. 113 గ్రెయినుల బంగారము పౌను విలువ గల్గియుండును. ఎంత బంగారమునైనను నియమితమగు ధరకు కొనుచు, అమ్ముచున్న సంస్థయుండుటచే విపణివీధిలో బంగారపు ధర స్థిరపడును. బంగారు బులియన్ మార్కెటులోకూడ ఔన్సు బంగారుధర $1\frac{1}{2}$ పెన్నీల హద్దుదాటియుండుట కవకాశము లేదు. బంగారు ప్రమాణముగల ఫ్రాన్సు, అమెరికా సంయుక్త రాష్ట్రములలోకూడ ఇట్టి ఏర్పాట్లే యుండును. ఆ దేశములలో ఔన్సుబంగారము ఖరీదు ఆయాదేశపు కరెన్సీలో నిర్ణయమగును. 113 గ్రెయినుల బంగారము ఒక పౌను బ్రిటిషు కరెన్సీకిగాని 4.86 2/3 అమెరికను డాలర్లకుగాని సరిసమానమగుచో 1 పౌనుయొక్క వినిమయపువిలువ 4.86 2/3 డాలర్లయియుండవలెను. రెండు దేశములమధ్య బంగారు ఎగుమతి దిగుమతుల కెట్టి కట్టడి లేనియెడల ఈ వినిమయ నిష్పత్తిలో మార్పులు అత్యల్పమగు హద్దులను మీరజాలవు. లండను, న్యూయార్కు మహానగరములమధ్య వేలమైళ్ళ దూరమున్నది. ఒక కేంద్రమునుండి, వేరొక కేంద్రమునకు బంగారు రవాణా చేయుటకగు రవాణా, భీమా, వడ్డీ ఖర్చులనుకూడ విస్మరింపరాదు. ఒక పౌను వెలగల బంగారమును రెండు వాణిజ్య కేంద్రములమధ్య బదిలీ చేయుటకు వలయు ఖర్చులు $1\frac{3}{4}$ అమెరికను సెంట్లని భావింతము. ఇంగ్లాండు, అమెరికాదేశపు ద్రవ్యనాణెములందుగల బంగారు విలువనుబట్టి ఆ దేశముల మధ్య టంకశాల వినిమయ నిష్పత్తి (Mint Ratio of Exchange) ఒక పౌను 4.86 2/3 డాలర్లకు సరిసమానమని నిశ్చయింపబడును. విదేశ వాణిజ్య వ్యవహారములకు అమెరికను డాలర్లు బ్రిటిషు వ్యాపారసంస్థ కావశ్యకమైనచో విదేశ వినిమయపు క్రయవిక్రయసంస్థల ద్వారా డాలరు వ్యాపార బిల్లులను బజారులో పౌను-డాలరు వినిమయపు రేటునుబట్టి కొనవచ్చును. కాని వినిమయపు బజారులో పౌను-డాలరు రేట్లు నిత్యము మారుచునుండవచ్చును. సరుకుల ఎగుమతి, దిగుమతి వ్యాపార స్థితిగతులు, పెట్టుబడి ధనపు జారీవైఖరి (Direction of flow of Capital funds), రాజకీయ రంగములో మార్పులవలన వినిమయపురేటు ప్రభా

వితమగును. ఒక సమయములో ఇంగ్లాండు దేశపు చెల్లింపు శేషములలో నుద్భవించిన ప్రతికూల శక్తులవలన పౌను యొక్క వినిమయపు విలువ దిగజారి ఒక పౌనుకు ప్రతిగా 4.849 డాలర్లు (4.86 2/3 డాలర్లు - 1.75 సెంట్లు) మాత్రమే లభ్యమగుచున్నచో వినిమయపు బజారులో డాలర్లను కొనుటకు బదులు ఇంగ్లాండు బ్యాంకువద్ద బంగారమునుకొని న్యూయార్కునకు ఎగుమతిచేసి, అమెరికా కేంద్ర బ్యాంకింగు వ్యవస్థయగు ఫెడరల్ రిజర్వుసంస్థనుండి బంగారమునకు బదులు డాలర్లను తీసుకొనవచ్చును. వినిమయపు బజారులో ఏ రేటునకు డాలర్లు లభ్యమగుచున్నవో, ఆ రేటునకే డాలర్లను పొందవచ్చును. బంగారు ప్రమాణము ననుసరించు దేశములు దేశపు ద్రవ్యమునకు బదులు బంగారమును నిర్ణీత ధరకెంత మొత్తమునైనను అమ్ముననియు, బంగారమును పైదేశముల కెగుమతి చేయుటపై ఎట్టి ఆంక్షలు విధింపబడవనియు బంగారు ప్రమాణ లక్షణములుగా మనము గమనించితిమి గదా! కేంద్రబ్యాంకు ప్రజల విదేశవ్యవహారావసరములకు బంగారమును లభ్యపరుపగలిగినంత కాలము, పౌను వినిమయపు విలువ 4.849 డాలర్లకంటె తగ్గదు. ఇట్లే ఎట్టిపరిస్థితులలోనైనను దేశపు బంగారు నిలువలున్నంతవరకు, ఒక పౌనుకు బదులుగా 4.885 డాలర్లనుమించి చెల్లింప నావశ్యకత కల్గదు. కాని టంకశాల వినిమయ నిష్పత్తినుండి బంగారు ఎగుమతి అంశము (Gold Export point) £ 1=డా 4.849 బంగారు దిగుమతి అంశము (Gold Import point) £ 1=డా 4.885 హద్దులనుమీరి వినిమయపురేటు మారకుండుటకు బ్యాంకు రేటు విధానము మొదలగు పరపతి నియంత్రణ చర్యలద్వారా దేశీయ ప్రభుత్వములు తమ బంగారు నిలవలను నిలుపుకొనుటకు, దేశములో ఉత్పత్తి ఖర్చులను, వస్తువుల ధరలను తగ్గించుటకు సన్నద్ధమై యుండవలెను. వినిమయపు విలువ స్థిరత్వ సాధనకై దేశములో పరపతి సంకోచించుట (Credit Contraction), ఉద్యోగావకాశములను, జీతభత్యములను తగ్గించుట మొదలగు అంతఃశ్రేయః ప్రతికూల చర్యల ననుగమింపవలసి యుండును. దీనినే బంగారు ప్రమాణపు క్రమశిక్షణ (Discipline of the Gold Standard) అని వ్యవహరింతురు.

బంగారు ప్రమాణము యుద్ధానంతర ప్రపంచ పరిస్థితులకు అనుకూలము కాలేదనియు, అంతర్జాతీయావసరములకై దేశములు తమ ప్రత్యేకార్థిక వ్యవస్థను భంగపరచు చర్యలను స్వీకరించుట యసాధ్యమనియు ప్రథమయుద్ధానంతరము దేశములు తలపోయసాగెను. 1931 వ సం॥లో ఆర్థిక మహా మాంద్యము క్రమముగా దేశముల కన్నింటికి విస్తృతము గాజొచ్చెను. బంగారు ప్రమాణపు సంప్రదాయసిద్ధమగు సూత్రముల ననుకరించుటవలన దేశీయార్థికవ్యవస్థకు తీవ్రమగు ఘాతకల్గునని 1931వ సం॥ సెప్టెంబరులో ఇంగ్లాండు బంగారు ప్రమాణమును విడనాడెను. ఇంగ్లాండుతో పాటు అనేక ఇతర దేశములుకూడ స్వతంత్ర ద్రవ్యనిర్వహణ విధానముల నేర్పరచుకొనుటకు నిశ్చయించెను. 1931 సం॥ నుండి 1944 వ సం॥వరకు ద్రవ్యనిర్వహణ క్షేత్రములో పలురకముల ప్రయోగములు సలుపబడెను. వీని ఫలితము లెటువంటివైనను రెండు ముఖ్యవిషయములు నిరూపితమాయెను. మొదటిది, బంగారు ప్రమాణమును త్రోసిపుచ్చినను వాణిజ్య క్షేత్రములో బంగారు ప్రాముఖ్యము లేశమైన తగ్గలేదు. దేశముల బంగారు నిలువలు, బంగారపు రాకపోకల పోకడ ద్రవ్యరాశి వినిమయ శక్తికి సూచనాప్రాయముగా నేడును పరిగణింపబడును. దేశమునుండి బంగారము విదేశముల కేగుటలో హానికాని, దోషముగాని లేదు. కాని ప్రతికూల శేషములవలన ఏండ్లాదిగా విదేశ సెక్యూరిటీ నిలవలు బంగారు సంపత్తి తరగుట పరిపాటియైనచో దేశపు ఉత్పత్తి వ్యవస్థను సరిదిద్దవలసి యుండును. కొన్ని సందర్భములలో ద్రవ్యరాశి విదేశ వినిమయపు విలువను కొఱగావించుటవలన కొంత తాత్కాలిక సానుకూలత ఏర్పడవచ్చును. బంగారు ప్రమాణానంతర యుగపు ప్రపంచ ద్రవ్యచరిత్ర తెలుపు రెండవ యంశము: ద్రవ్యవిషయములలో అంతర్జాతీయ సహకార చర్యల యావశ్యకత. 1931 సం॥ తర్వాత దేశములు క్రమముగా అంతరంగిక శ్రేయమునకు శ్రుతిమించిన ప్రాముఖ్యము నొసంగుటచే అంతర్జాతీయ ఆర్థిక, వాణిజ్య క్షేత్రములలో ఐక్యత అడుగంటెను. బహుముఖ సరళికి బదులు ద్వైపాక్షిక వర్తకపు టేర్పాట్లు సామాన్యమయ్యెను. వినిమయ నియంత్రణపు ఏర్పాట్లు, స్పర్ధాపూరిత ద్రవ్యవిధానములు, శ్రమవిభజన (Division of Labour) వలని మేళ్ళు ప్రపంచ ప్రజలకు దూరము కాదొడగెను. కాని, కడచిన పదునైదు సంవత్సరములలో అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచ బ్యాంకు దేశముల పరస్పర వాణిజ్యార్థిక సంబంధములను దృఢపరచు లక్ష్యమునకై పాటుపడెను. తత్ఫలితముగా ద్రవ్యప్రపంచములో అరాచక పరిస్థితు లంతమై సక్రమకృషికి వీలు కల్గెను.

# వేదనా వాసుదేవము

శ్రీ నాయని సుబ్బారావు

## 5

నను గుర్తించిన చందమా యిది హిరణ్యస్కంధరమ్యాప్తచ
క్రనిహాధాద్భుత తీవ్రవేగశకటాంక స్థాయివై క్షీరతో
యనిధి ప్రాంత వినోదసంతత విహారాధ్యుండవో స్వామి! నా
కని పాదద్వయ భూప్రదక్షిణము నిత్యక్రీడగా కూర్చియున్.

శ్వేతద్వీపనివాసుస్థిరపదశ్రీనాథ! శేషాహిశ
య్యాతంద్రాంకితమూర్తి వయ్యు నరవిష్వా నీకటాక్షాంత సం
జాతాక్షావధిలోని బొంగరములుంగా సర్వగోళమ్ము లీ
స్థితిభ్రష్టము దిక్కుమాలి తిరుగు న్నిక్కెక్కకుం బాత్రమై.

పుట్టిన గ్రామముం విడిచిపొమ్మని మిత్రుని సాకతమ్మునన్
మెట్టినయూరు కాదని సమీకృత సంకర సర్వసభ్యతా
ఘట్టము సర్వసంస్కృతి వికారనికారఘరట్టమైన యీ
కొట్టములోన తెచ్చి పడగొల్పితి వెంత దయాపరుండవో!

పుట్టినకొట్టు కన్నొమ్మలగిపోయి నిశీథమునందు నేటి యీ
గట్టున గొల్లపల్లె నొక కాపురమై తదనంతరంబు చే
పట్టిన పట్టణమ్మొకని బారికి నగ్గముగా పయోధిలో
కట్టిన కొంపయే శరణుగా మను దేవుడ వేమి సేయుదున్.

ఈ యఘు మిట్లు పోవలయునే గద! నీవు విదిల్చివేయుగా
నాయనువారు లేని గహనమ్మున మత్స్యమజీవనంపు కొం
కాయుంతోటకుం దెగులు గమ్మగ మందులు చల్లి చల్లి నా
చేయి పడెం గదయ్య! యొక చిన్నమునైత్తు గుణంబు మృగ్యమై.

నా నోటన్ విన నీకు నుచ్చ్వట యకో! నా చేత బల్కింతు వి
ట్లీ నిందాస్పద దార్తవాక్యములు తండ్రీ! మత్పురాజన్మ క
ర్మానీకమ్ములు నా యదృష్టమును పాలాడంగ నీ దేమి త
ప్పైన న్నామతి యింద్రియోపహతమై యల్లాడు మోహాంధమై.

# వేదనా వాసుదేవము

కట్టిడి యింద్రియార్థముల కోటియ లెంతని! ప్రక్క జేబులో
పెట్టిన డబ్బు నంచి మఱపించి నిమేషములోన నేర్పుమై
కొట్టెడు దొంగలట్లు నమకూడిన యల్పవివేకపాకముల్
తట్టుకొనంగఁ జూచు సతతమ్మును వంచక సార్వభౌములై.

ఈ చోరాగ్రణు లార్పి పేర్చెదరు హో హేత్వంతరాభాసలీ
లాచాతుర్యతురీయవర్గ హరణోల్లాసక్రియాదక్షులై
ఆచార్యుల్ పరిపత్తులం దెలుపు నయ్యర్థమ్ములన్ మార్చి! నీ
దౌ చేయూతయె నాకు దిక్కు నవనీతాహర్తృకాధ్యాపకా!

నను గుర్తింపగఁ బోయి తద్దరిష
నిర్వాణశాస్త్రార్థసో
ధనలంబారము ముట్టరాక తలక్రిం
దై కొట్టుమిట్టాడితిన్!
నను రక్షింపుము నేటికిట్లు పనిచె
ణ్ణమ్మైన నా బుద్ధి చి
ద్ఘన నితాన్యమృతపోషిసంప్రాప్తినై
క్రాలంగ మాఱాకువై!

# దుర్భాకవారి అమరసింహ చరిత్ర

శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

ప్రాచీనాంధ్ర కవులు తమ రచనలకు కథావస్తువులుగా పురాణ గాథలు, ఐతిహాసిక వృత్తాంతములు స్వీకరించిరి. మిశ్ర కథలుగా దిద్ది తీర్చి కొందఱు నవ్యత ప్రదర్శించిరి. ప్రస్తుత యుగమున సాహిత్యస్వరూపము సర్వతోముఖమైనది. అందు ప్రబంధనిర్మాణము చాల వఱకు చారిత్రకవస్తువు ప్రధానముగ సాగిపోవుచున్నదనుట నిర్వివాదము.

శ్రీ గడియారమువారి శివభారతము ఉత్తమ కవితాసిద్ధి నంది కొని బహుళవ్యాప్తి గాంచినది. తత్పూర్వమే తెలుగువారి అదృష్టము పండించినది కీర్తిశేషులు దుర్భాకవారి రాణాప్రతాపసింహ చరిత్రము. విశ్వనాథవారి ఝాన్సీ లక్ష్మీబాయి, మధునాపంతులవారి ఆంధ్రపురాణము పేర్కొనదగ్గ చారిత్రక కావ్యములు. శ్రీ కల్లూరి వేంకటనారాయణ రావుగారి అశోక చరిత్ర, అద్వితీయ ప్రబంధము. ఇవి మచ్చునకు మాత్రము. ఇంకను తలచూపిన — తలదాచు కొన్న లఘు ప్రబంధములు కొలదిగ లేకపోలేదు.

ఒకానొక కావ్యము మెఱుగుదేరి రాణించుటకు రసభావసమీకరణ మెంత ప్రధానమో వస్తువుకూడ అంతముఖ్యము. ఉదాత్తవస్తువు — ఆదర్శప్రాయమైన కథానాయకత్వము కృతికి వన్నెదెచ్చు కళావిశేషములు. దుర్భాకవారు తమ అమరసింహ కావ్యమున ధీరోదాత్తుడైన కథానాయకుని వరించుటలో కొంత పెడదారిద్రొక్కినా, అందలి కవితాప్రాగల్భ్యము, రచనాపాటవము, తమ ఉత్తమ కావ్యమైన రాణాప్రతాపచరిత్ర కవనమున కెంగును తీసిపోనివి. కావ్యగతదోషము విస్మరించి మెఱుగులు మాత్ర మవలోకించితిమేని చారిత్రక కావ్యమణిహారమున అమరసింహచరిత్ర మొక రత్నముగా మన హృదయముల భాసించుననుట నిస్సందేహము. "ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతి" అన్న మహాకవి వాణి యీ పట్టున స్మరణీయము. ఈ దృష్టితో నీ కృతి పరిశీలించి ఆనందానుభూతికి సాహితీరసికమహాశయుల హృదయముల దార్చుటయే గాదు — రసపుత్ర వీరసామ్రాజ్యమున కొక్కమాఱు వారి హృదయముల నంకితము గావించి తత్పరిపాలనవిశిష్టత గమనింప జేయుట నా ప్రకృత కర్తవ్యము.

సాహితీక్షేత్రమున దుర్భాక రాజశేఖరశతావధానిగారు సుప్రసిద్ధులైన కృషీవలులు. కవిగారు అఱువది రెండు నిండినపిదప అమరసింహ చరిత్ర రచించిరి. రాజపుత్రస్థాన వీరవరేణ్యుల జీవితోదంతములు తమ రచనలకు ఇతివృత్తములుగా గ్రహించుటలో వీరికి గొప్ప యావేశము! జగదేకవీరుడై రాజపుత్రులలో ప్రశస్తిగాంచిన రాణాప్రతాపుని ముద్దుల బిడ్డడీ యమ సింహుడు. అతని చరిత్ర మీ రెండువేల పద్యముల మహాకృతిలో పరమపవిత్రమై అమరత్వ మొందినది. మహాకావ్యరచనకు వలసినంతిసాధన సామగ్రి, కళానైపుణ్యము ఈ కవీంద్రుని లేఖిని సేకరించుకొన్నది.

వీరి కవితా సంప్రదాయము మిక్కిలి ప్రాచీనము. వీరికిగల భావనాశబలతచే కావ్యము నిత్యనూతనమై సహృదయులకు సద్యఃపరనిర్వృతి కలిగించుచున్నది. ఇట్టిదియే కదా కళావేత్తలదృష్టిలో ఉత్తమకవితా లక్షణము. పద్యరచనలో వీరిదొక విశిష్టత. ఏపద్యము పఠించినా ఒక్కటే గాంభీర్యము!

కథాసందర్భము ననుసరించి సంబోధనము, సంభావనము సంవర్తము మున్నగ నీ కావ్యమున ప్రతి పరిచ్ఛేదమున కనుగుణముగ కవిగారు పేర్లిడిరి. తొలుత "సంబోధనము"లో రాణాఅమరసింహుని కామినీలోలత్వము, రాజకార్య విముఖత, సలుంబాకృష్ణభూపతి యుపదేశము కథనము గావింపబడినవి. అంతఃపురమున ప్రియాపర్యంకమున నున్న అమరసింహుని సామంత రాజసభ కాహ్వానింప కృష్ణభూపతి ప్రయత్నించిన సందర్భములో:—

"ఆ పాతాళ నభస్స్థలాంతము బ్ర
హ్మాండంబు సర్వంబు, గ
ప్పె పోవన్ బెనుచప్పు డుప్పతిల ని
ద్వారంబునున్ నిల్వనన్
కోపస్ఫూర్తిని వామపాదమున ను
గ్గున్ జూచమై వ్రాల నా
టోపంబొప్పగ దన్నె..."

"దళమై లోపల నిండియుండిన సుగం
ధద్రవ్యపున్ ధూమరా
సులు కృష్ణప్రభు నాసికాపుటములన్

# దుర్భాకవారి అమరసింహ చరిత్ర

జో తేరగా, మోము క
న్నులు చిట్లించుచు మూరె డోసరిలి యం
దున్ నిల్చె, భూమీశుడున్
కలయన్ కన్నులు విప్పె సంభ్రమసమ
గ్రభ్రాంత చేతస్కుడై."

"గదిలో నాలుగుమూలలన్ ద్యుతు లెసం
గన్ బ్రేలు నద్దంబుల
య్యదనన్ దోచిన కృష్ణసింహ విభుడా
హా! కామినీలోలుడా
యిదియా నీపనియంచు గ్రిందగల రా
యిన్ దీసి యద్దంబులన్
గుదియన్ మోదినయట్లు పెపిసరి ను
గ్గున్ జేసె నత్యుగ్రుడై."

ఈ యుదాహృత పద్యములందు కృష్ణభూపతి తీవ్రకోప మభివర్ణింపబడినది. ఈపద్యములు స్థాలీపులాక న్యాయమున నుదాహృతములు. ఈ పరిచ్ఛేదమంతయు నిట్టి పద్యములతో నిండి చదువరుల నాకర్షించుచున్నది. రాణాప్రతాపునియందు కృష్ణభూపతి స్వామిభక్తి పరాయణుడు. ఈ భక్తితత్పరత సజీవముగ నిందు చిత్రింపబడినది. కవిగారి రసమయప్రపంచ విహారము పొగడ దగ్గది.

ఏపరిచ్ఛేదము చదివినా ఏఘట్టము నాశ్రయించినా సరిక్రొత్తవిధానమున సాక్షాత్కరింపజేయుట ఈ కవిగారి అమరసింహచరిత్రలో ప్రత్యేక విశేషము. యుద్ధము లెన్ని పర్యాయములు వర్ణింపబడినా 'ప్రాతవి' అనిపింపవు. నవీనత తాండవించును. దీనికి వీరి కావ్యమంతియు నుదాహరణము.

మహాకావ్యమునకు వలయు ప్రధానలక్షణములలో పాత్రపోషణ మొకటి. ఈ కృతిలో తొలియధ్యాయమునందే పాత్రనిర్మాణమున కవిగారి ప్రతిభావిశేషములు అతిలోకమనోహరములు. తన యకృత్యమునకు పశ్చాత్తప్తుడైన అమరసింహుని కనికరించి హృదయపరివర్తన మొనరించికొన్న కృష్ణభూపతిపాత్ర అద్భుతముగ నిర్వహింపబడినది. పశ్చాత్తప్తుడైన కథానాయకుడు:—

"తనధర్మంబును దీర్ప కేసురులకున్
తాపంబు సంధించు నీ
జనకద్రోహిని గర్వదూషితుని దే
శద్రోహి కంఠంబు లుం
ఠనమున్ జేయు మరాతి వీరభట కం
ఠ వ్రాత విచ్ఛేద నూ
తన విద్యాచణ, యుష్మదీయ దృఢహ
స్తన్యస్త ఖడ్గాహతిన్."

"తనువుపై నింటిపై నాస తలగి - నీదు
పని వినుట జీవితైకైకఫలము నాకు"

అని శపథము గావించిన అమరసింహుడు సాష్టాంగ నమస్కృతి గావించిన వెంటనే, "చిత్తమున్ గరగి, బాష్పశ్రేణి యుష్ణాంగ లోచనయుగ్మంబున దాని నాపుకొని హస్తంబుల్ పయిన్ గప్పుచున్" ఉపలాలించి, "జరుగగరాని కార్య మిది క్ష్మావర, నీవధికారి, నేను నీ పరిజనమాత్రుడన్" అని కృష్ణభూపతి నోట పలికించుటలో సునిశిత భావనాబల మెంతయు గోచరించుచున్నది. చారిత్రకాంశముల నింత రసవత్తరముగ సజీవముగ నడపుశక్తి కొలది కవులయందే కానవచ్చును.

తెగ్రెంపులులేని కథాకథనము—చక్కని పాత్రపోషణము—పాత్రానుగుణమయిన మనోహర భావము—భావోచితభాష, నిజముగా కవికి తపఃఫలము వంటివి! ఈ నిర్వహణము "సంప్రార్థనము" అను ద్వితీయ పరిచ్ఛేదమున జయప్రదము గావింపబడినది.

మేవాడుదేశాధిపతి అమరసింహుపై నవ్యాజమగు క్రోధము వహించి సమర మొనర్ప యత్నించు తురుష్కప్రభుడగు జహాంగీరు మౌర్ఖ్యము—వంగదేశాధిపతికి మానసింహుని హితబోధ—తనమాట వినని జహాంగీరుపై మానసింహుని ప్రచండకోపము, తటిల్లతవోలె మెఱసిపోవు భావపరంపరతోడి ఈ ఘట్టమంతయు రమణీయమై నడచినది.

"వ్యవధియుండిన బ్రహ్మాండభాండమెల్ల
బలిమినెత్తి యొక్కెడొకచోట నిలిపియుందు"

అను మానసింహుని తీవ్ర క్రోధపూరితమైన యొక వాక్యమే చాలును నలగట్టదగినది.

భారతీయ ధర్మము లెన్నియో సందర్భానుసారముగ కవి మానసింహునినోట బలికించెను. సుస్థిరమగు భారతస్వాతంత్ర్యమును చెఱగొట్టగాదనెను. గోహింస, స్త్రీహింస వలదని గద్దించెను. ప్రజాసుఖములేని రాజ్యాధికారము నిష్ఫలమని యదార్థ ముద్బోధించెను. సమరాశాపీడితుడగు తురుష్కశేఖరు డామాటలు పెడచెవిని బెట్టి మూర్ఖత్వముతో అమరసింహునిపై దాడి వెడల ప్రయత్నించెను. తురుష్క రాజుల మౌర్ఖ్య మెంతేని చక్కగ ప్రదర్శింపబడినది. మేవాడుపై యుద్ధమునకు తనకు తోడురమ్మని మానసింహుని అక్బరు తనయుడు సంప్రార్థించు ప్రకరణ మతిహృద్యము.

తిక్కనవలె యుద్ధములు కన్నులయెదుట నిలుపగలశక్తి యీకవియందును అప్రతిమానము. "సన్నాహము"లో నిండార చూడదగిన దీ సొంపు! జహాంగీరు

పాదుషా, యవనసైన్యాధీశులైన అబ్దుల్లాఖానుడు, మహబత్ఖానుడు - వీరికి బలపరాక్రమములు నూరిపోసి ప్రోత్సహించి రణరంగమున కనుపుట, "శివకేశవుల" వలె పోరాడిన కేశసింహుని చేతను, కృష్ణసింహుని చేతను పరాజితులై వైరులు ఢిల్లీకి చెదరి పారుట—యీభాగమున వర్ణింపబడిన దృశ్యము పూర్వము కురుక్షేత్ర యుద్ధరంగమునుండి వచ్చిన విదురునిచే మాటిమాటికి సంగర విశేషములు విన కుతూహలపడుచున్న ధృతరాష్ట్రుని దలపించుచు పాదుషా చిత్రింపబడినాడు. డెబ్బది యేండ్ల ముదుసలి సలుంబాకృష్ణభూపతి యుద్ధ నైపుణ్యము రౌద్రరసము గ్రుమ్మరించుచున్నది.

కృష్ణభూపతి వైరివీరులను "కోళ్ళను దోలినట్లు" తోలినాడు. ఏపాత్ర యెంత జెప్పవలయునో అంత మాత్రమే జెప్పి మలుగగుట, పాత్రాంతరప్రవేశము, విసుగెత్తనీయనిమార్గమున హృదయ మాకర్షించునట్లు యుద్ధప్రక్రియ యిందు సర్వాంగసుందరముగ శోభిల్లుచున్నవి. ఈ రీతి భారతయుద్ధమునందే చూడవచ్చును. పాత్రలను సంగరధాత్రి ప్రవేశింపజేసినప్పుడే యాకవికి యొక్కడలేని యావేశము! ఈ యావేశమును చక్కని భావములతో మేళవింపజేయుట వీరి కవితావైశిష్ట్యము. చిన్నచిన్న మాటలచే రసస్ఫూర్తికలిగించుశక్తి తిక్కనకువలె వీరికిని గలదు. ఈ పద్యములను తిలకింపుడు.

"అనిల మనలంబునకును తోడగుచు రేగు
ననువునను, కృష్ణవిభున కయ్యమరసింగు
తోడుగాగూడి రణభూమి గాడుసేసె"

"తొలియేడె యోడి మీ మొగ
ములు నాకట నూప సిగ్గువోడమదె సంధిన్
గొలిపితిరి, పనికిమాలిన
తలలకు నెప్పుడైన మేలితలపు గలుగునే?"

ఇట్లెన్నియో యుదాహరింపవచ్చును. సందర్భానుసారముగ తమంత దూకిపడు లోకోక్తులు, ఉపమానములు, అమరసింహచరిత్రలో నాద్యంతము చూడదగిన విశేషాంశములు.

"కోబలియంచు నార్చి", "ఆయువు దిటమై యుండిన నే యము డరుదెంచియైన నేమియు కీడున్, జేయగ లేడు" ఇట్టివి.

వీరరసోచితమైన తెలుగుభాష అమృతప్రాయమై కవిగారికలమున తాండవించుచుండుట ఇందలి కళాపోషణమునకు చక్కని దోహదము.

"సంస్థాపన"యను ఖండములో జహాంగీరు పాదుషా చిత్తూరుపురమునకు సాగరసింహుని పట్టాభిషిక్తునిగావించు రాజకీయ రహస్యము - సలుంబా కృష్ణుని తీర్థయాత్ర, సూక్తావతుల తోడ్పాటు వర్ణింపబడినవి. మొదటిమొదటి ఘట్టములందువలె నిందును కథాకథనము హృదయాకర్షకమై భావపరంపర కొనసాగినది. కృష్ణభూపతి తీర్థయాత్రాసందర్భమున వర్ణింపబడిన వర్షపాతము స్వభావోక్తిరమణీయమై ఆరుపద్యములలో కన్నులగట్టినట్లున్నది. ఈ వర్ణనము చదివినప్పుడు పల్లెటూళ్ళ పరిసరములలో నరణ్యప్రాంత వర్షపాత రమణీయదృశ్యము చూచినవారికి తప్పక అపరిమితానందము, తన్మయత్వము సిద్ధించును.

"వాతమునకు తోడ్పడియె దెబ్బాటు వాన"

ఈ దెబ్బాటువాన, ఈ ఘట్టమునకు కావ్యదృష్ట్యా శిరోభూషణము వంటిది. రాజశేఖరకవిగారి పద్యములన్నియు నేకధారాప్రవాహములై చదువ జదువ పునః పఠనాసక్తి కల్గించుచుండును.

వీరి దీర్ఘసమాసముల దిలకింపుడు :

"యమునాద్వీపవతీ తరంగ నిబిడ వ్యాకోచ కాశేశయ ప్రమదామోద విలాస మారుత శిశువ్రాత ప్రచార ప్రసన్న మనోజ్ఞము."

"అలఘు బాహు, గాఢవిక్రమ గర్వాంధకార విహిత క్షాత్రవశిరో నికృంతనచతుర వీరభూపమణి కాపురంబు ఢిల్లీపురంబు."

వలయుచోట్ల నిట్టిజటిల సమాసములు శోభగూర్చునను కళారహస్యము నెఱిగినవాడీ కవితల్లజుడు. కృష్ణభూపతియెడ సూక్తావతులు చూపిన భక్తి వినమ్రతలు ఈ భాగమున ప్రశస్తములు.

కృష్ణభూపతిపాత్ర మొదటినుండి తుదిదాక చక్కగ పోషింపబడి కావ్యమునకు వన్నెగూర్చుటలో దక్షిణనాయకుడగు అమరసింహుని మరపింపజేయుచున్నది. మహారచనలయందు పాత్రపోషణమేగదా ప్రధానముగ గమనింపదగిన గుణము. కృష్ణభూపతి ప్రభుభక్తి, వీరరసోద్రేకము, దేశభక్తితాత్పర్యము మరపునకు రానివి.

ఈ కావ్యమున "సంవర్తనము" మఱొక ఖండము: సంస్కృతాంధ్రభాషాసమ్మేళనమునర్చి కవిగారు మణిప్రవాళశయ్యలో చక్కని స్తోత్రపద్యము లీ సందర్భమున కూర్చిరి. వందిస్తోత్రమున నిట్టి

## దుర్భాకవారి అమరసింహ చరిత్ర

రచన చక్కని యోచితికి తార్కాణమే కాక పద్యములు ఆపాతమధురములై హృద్యములై నడచినవి. మచ్చున కొకపద్యము :—

"క్షోణిం గల్గు సమస్తశాత్రవుల
 నుగ్గుంజేసి, మేవాణ్మహో
రాణా దక్షిణపార్శ్వ సంస్థిత
 శుభాగ్రస్థానమున్ జెందు, న
క్షీణప్రాభవ విక్రమోన్నత కళా
 స్నిగ్ధాయ—సామంత రా
ట్ప్రాణత్రాణపరాయణాయ
 సుసలుంబా భూభృతే తే నమః."

ఇట్టివి మరికొన్ని పద్యములు ప్రవాహ సదృశములై యున్నవి. ఏది యెట్లున్నను రాజశేఖరకవిగారి కలము వీరరసావిష్కరణమున నారితేరినది. ఇది అమరసింహచరిత్రలో సర్వత్ర దట్టముగ గోచరించు రసము. "వీరప్రబంధపరమేశ్వరుడ"ను బిరుదనామము సార్థకమొనర్చుచున్నది.

"ఈ కవి నిలిచి వ్రాసినచో నాచనసోముని వంటి మహాప్రౌఢకవి యయ్యెడివాడు." అని తొలి పలుకులో శ్రీ విశ్వనాథ కవిసమ్రాట్టుగారనిరి. వారి సూక్తి సమంజసము.

ఇది పదునొకొండాశ్వాసముల పద్యమహాకృతి. ఆంధ్రకవితారసికులు చదివి ఆనందింపదగిన ఉత్తమ కవిత. అమరసింహచరిత్రమా, సమరతాండవమా! అనునట్లు "సంబంధము"లో అంతటా బలసింహుని ఆహవోద్రగత సాక్షాత్కరించుచున్నది. తిక్కన భారతమున గావించిన యుద్ధ వర్ణనల పోలికలు ఈ భాగమునందు మనోహరములై ఈ కవిచంద్రునకు "అపర తిక్కన" బిరుదమిచ్చిన ఆక్షేపమేమి అనదగియున్నవి. యవన సైనికులు అమరసింహుని బంధించుట—వారిపై కినిసి మహోగ్రముగ దాకు బలసింహాదివీరులు ఉగ్రరణ తాండవకేళి ఉపక్రమించి తమవీరుని విడిపించికొనుట, ఇందలి కథాభాగము. పద్యములన్నియు కవిగారి కౌబాల్యసిద్ధమయిన వీరరసాభిముఖములై సమయస్ఫూర్తిగా ప్రవహించుచున్నవి. అప్పటి యవన సైనికుల పోరుగూడ ప్రచండమై దర్శనీయమై యున్నది. "మరణభయమెత్తుకొని" పారిపోవుచున్న యవన వీరుడు, "హస్తము మోపి చూడు మీ యుల్లము లల్లాడు గతియున్ గ్రహియింతు" అని ప్రార్థనావినయ సంభ్రమోక్తులతో, గద్గదస్వరముతో చెప్పికొన్నాడు. ఇట్టి ఘట్టము లీకావ్యమున పలుమారు పఠింపదగినవి.

అమరసింహచరిత్ర రస దృష్టితో పఠింపవలెను. నానారసములు వీరరసానుషంగములు. "సంవర్త" మందలి ఈ పద్యము మిక్కిలి హృద్యము:—

"ఫలమా, యెచ్చటనుంటివీ వనుచు పు
 ష్పంబల్ల ప్రశ్నింప నీ
చెలువన్ వర్ధిలుచుండు, నా కొలకు దే
 శంబెల్ల శోధింపగా
వల చేసున్ సతతంబు నీ మృదుల గ
 ర్భంబందు వర్తింతు, లో
పలి చూపున్ బరగించి చూడుమనె న
 వ్వాక్యంబు నాలింపరే."

ఉత్తమకావ్యములలో నిట్టిపద్యము లొక కొన్ని మాత్రమే ఉండును. విలువగల వస్తువులసంఖ్య పరిమితము గదా!

భావముతో మనసు నేకీభవింపజేయక ఈ కవిగారి పద్యములు మిన్నక పఠించినా ఒకవిధమగు హాయి కలదు. దీనినే శ్రవణ సుభగత్వమందురు.

"సంత్యాగము" లోని దూదాసింహుని సాహసోద్రేకములు, "సంయోగము" లోని కాకుత్స్థవంశజులగు చక్రవర్తుల స్మరణము పఠించి కళాదృష్టి గలవారానందింపదగిన కవితాఖండములు. సూర్యవంశజుల ఘనత—సాగరసింహునినోట చెప్పించుట కవిహృదయమని రసికులు గ్రహింపకపోరు.

వృద్ధాప్యమున కావించిన్ల రచనయైనా కళావృద్ధినందికొని రసికజనోపభోగ్యముగ నున్న దీకృతి. ఎడతెఱిపిలేక తా జెప్పదలచిన విషయముల కనుగుణముగ భావపరంపర వచ్చి నిలుచుట ఈ కవి యదృష్టము—ఆంధ్రుల పుణ్యోదయము.

"సంభావన", "సంఘర్షణ", "సంధ్య" అనునవి మిగిలిన మూడాశ్వాసములు. ఒక్కటే ధార—నిశితము భావన—మొత్తము ఈ మహాప్రబంధమంతయు నొక రసస్రవంతి. పరిణామదశలో రమణీయముగ అమరసింహకావ్యము రచించిన ఈకవి మూర్ధన్యునకు ఆంధ్రకళాజగత్తు ధన్యవాదము లర్పించి చిరకాలము కృతజ్ఞతాంజలి పట్టగలదు.

ఈ కవితలో నచ్చటచ్చటగల యాధ్యాత్మిక భావసంపద కవి చరమవయస్సునందలి మనఃపరివర్తనము చాటుచున్నది. ఆంధ్రసారస్వతాకాశమున దివ్యతారగా వెలిగి తనజీవితము ధన్యమొనర్చుకొన్న ఈ కవి నేడు—లేడు. ఇతని కృతిపరంపరకు నా వినయాంజలి!......

# గాలిబ్ గీతాలు

శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు

నేనడిగిన నీకు అప్రియంబేని, సాఖీ!
చషక మీకుము, దోసిట చాలు మధువు.

ఎచట నీ పదాంకముల వీక్షింతు నచట
స్వర్గలోకాలు నాకు దర్శన మొసంగు.

వచ్చె నరుణతరుణ వాసంత సమయమ్ము
గోళ్ళు మరల గుండె గోకజొచ్చె.

ఎవ్వ డాలించు నామె నా హృదయగాథ?
అదియు, నా నోటినుండి యెట్లవతరించు?

ఏవొ పక్షమ్మునందు బాధింపవోడగె,
హృదయమా! కాను, బాణంపు టినుపముక్కు.

నా కొఱకు నీవు వత్తువన్నయది నిజము,
జాగుసేయవ టన్నది సత్యమగును,
అసలు నా వార్త నీ కందునంతలోన
మట్టిలో మట్టినై పోవుమాట నిజము.

కానుపించు గని గమ్యమ్ము చిక్కదు
నేను నడచినట్లు తాను నడచు.

ఎన్నొ సుఖసంపదలను వాంఛింపగాని
మృతియె లేకున్న గడిచెనా బ్రతుకునాగ.

ఏల నన్ను మరచె? నెఱుగ బోయితి నామె
వలపుమాపు సాచె. భస్మమైతి.

డాగె పగదాల, పగలు తారాగణమ్ము,
రాత్రి కేమయ్యెనో దిగంబరముగ తోచె.

నేను మరణింప నాయింటిలోన దొరకె
ప్రేయసుల చిత్రపుటలును, లేఖ, లంతె.

బుల్బులి రుతమ్ము వృథయయిపోవు నెట్లు?
వెలది పువ్వుగుండె లక్షముక్కలయి పోయె!

బాల్యమున నేను 'మజ్ను'పై ప్రస్తరమ్ము
విసరబోవగ నాతల వెస స్ఫురించె.

'గాలిబా!' నీదు తాత్త్విక కలన, యహాహా!
త్రాగకుండిన నిను నేను యోగి యనమె!

కాలమే నాకు తగు నవకాశ మిడిన
చేసి చూపుదు నెన్నెన్నొ చిత్రములను,
నా యెదగల ఒక్కొక్క గాయమయ్యె
విత్తనము దివ్యదీపికావృక్షమునకు.

చింతిలెను మాకు బ్రహ్మాండ మెంతొ ఇరుకు
అందు గగన మ్మొక పిపీలికాండమయ్యె!

పత్రమున నగ్నిశిఖ దాచవచ్చు గాని
హృదయమున దుఃఖవహ్ని భరింపలేము.

ఈ జగత్తు స్వభావమ్ము నే మనందు?
మంచి చేసిన వానిని ముంచె నౌర!

నేరుగాలగంటి కొమ్మలు వంగినట్లు,
అన్ని శబ్దాలు నిశ్శబ్ద మందె పుట్టె.

నాకమందు నరకలోకమ్ము కలుపుకొని
వంప కేలనో? భక్తులాల!
వాంఛకలిగినపుడు వాహ్యాళి చేయగ
మరియు కొంతనేల పెరుగు గాదె.

స్వర్గమును గూర్చిన ప్రశంస చాల వింటి
కాని నిదర్శన మ్మెట్టు కలుగవలెను.
పానశాలయె లేని దేదైన నేమి
బడి, మసీదు, మఠముగు సర్వమ్ము నొకటె.

హృదయము నెవరికో ఇచ్చి దుఃఖపనేల?
ఎద నెసద లేక నాలుక యేల నోట?

# తెలుఁగు మఱుఁగులు

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

సాధన సామగ్రి సమధికముగా సముపలబ్ధ మగుచున్న నేఁటికాలమునఁ గూడఁ బ్రాచీన కావ్యములలోని కొన్నిపట్టులు వ్యాసఘట్టములవలె దుర్గ్రాహములై కావ్యరసాస్వాదనమున కడ్డు తగులుచుండుట కడుంగడు శోచనీయము. ప్రయోగప్రాచుర్యముతో, స్థితమునకు గతి కల్పించు ప్రయత్నమున నర్థనిర్వచనము చేయుటతో నిఘంటువులు తమ కర్తవ్యము తీర్చుకొని కృతార్థము లగుచున్నవి. అంతకుమించి చనుట వాని జోలికిఁ గాఁబట్టనిపని. ఇట్టి స్థితిలో నాయాపట్టులను, పదములను వివరించు ప్రత్యేక ప్రయత్నము లెంతేని నవసరములై యున్నది. 'గ్రంథగ్రంథు' లనుపేర నిట్టివానిలోఁ గొన్నిటిని కీర్తిశేషులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కతిపయవత్సరములకుఁ బూర్వము ప్రకటించిరి. ఇటీవల శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు తమ సాహిత్య సమీక్షలో 'తెలుఁగు నిఘంటువులు' అను పేర ననేక విషయములను విపులముగాఁ జర్చించియున్నారు. ఇంకను ముడి విడక చిక్కుగొలుపుచున్న కొన్ని యంశముల నిందు 'తెలుఁగు మఱుఁగులు' అను పేర వివరించుటకుఁ బ్రయత్నించుచుంటిని. ఆయా విషయములకు సంబంధించిన తుది తీర్పులు కాకపోయినను నివి భావిపరిశోధనకుఁ, బరిశ్రమకు నే కొంతయేనిఁ దోడ్పాటుఁ గలిగినచో నదియే పదివేలుగా భావింతును.

1. శ్రీనాథుని శాలివాహన సప్తశతిలోని దని యీ క్రింది పద్యము లక్షణ గ్రంథములలోఁ గానవచ్చుచున్నది.

వారణ సేయ దావగొన
 వా నవవారిజమందుఁ దేటి క్రొ
వ్వారుచు నుంట నీ వెఱుఁగ
 వా ప్రియ హా తెఱగంటి గంటి కె
వ్వారికిఁ గెంపు రాదు తగ
 వా మగవారల దూఱ నీ విధం
బారసి నీ నిజం బెఱుఁగు
 వంతకు వంతకు నోర్వ నెచ్చెలీ!

శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి క్రీడాభిరామ పీఠికలోను, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శృంగార శ్రీనాథములోను, శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి ఆంధ్ర కవుల చరిత్రములోను నీ పద్య మిట్లే యుద్ధరింపఁబడియున్నది. కాని యీ పద్యమున కర్థము సరిగాఁ గుదురుటలేదు. హాలుని గాథాసప్తశతిలో నీపద్యమునకు మూలమైన ప్రాకృతగాథతోడ్పాటుతో నైన దీని కర్థము చెప్పఁ గుదురునేమో యని చూడఁగా నందు దీనికి మూలము కానవచ్చుటలేదు. ఇఁక నీ పద్యపాఠములో నే యొక కొన్ని చిన్నిసవరణ లేవో చేసికొని పద్యార్థము కుదుర్చుకొనుట యొక్కటే మార్గము. ఒకప్పుడు పూజ్యులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారితో నీ పద్యార్థమువిషయమై చర్చింపఁగా వారిందుఁ గొన్ని చక్కని సవరణలు సూచించిరి. ఆ సవరణలతోఁ బద్యార్థము చక్కఁ గుదురుచున్నది. ఆ సవరణ లెట్టివో తెలిసికొనుటకు ముందు పయి పద్యమునకు సందర్భ మెట్టిదో తెలిసికొనుట యుక్తము.

నాయకుఁ డొకఁ డన్యకాంతాసక్తుఁడయి తన సతి నుపేక్షించినాఁడు. ఒకనాఁ డాతఁడు తన క్రొత్త ప్రియురాలితోడి సంగమమును సూచించు పలుగాట్లతో నింటికి రాఁగా నది చూచి నాయిక కోపపరవశయై యాతని దూషింపఁదొడఁగినది; తుద కాతని తిరస్కారమును సహింపఁజాలక ప్రాణత్యాగము సేయనుగూడ సంకల్పించినది. అపు డా నాయికకుఁ జెలికత్తె యొకతె తేఁటి చేష్టితము దృష్టాంతీకరించి తన నాయిక నూఱడించుచు మరణోద్యోగము మానుమని ప్రబోధించుచున్నది. ఇది పద్యసందర్భము.

ఈ పద్యములో నర్థము కుదురనిపట్టులు దావ గొనవా, ప్రియ హా తెఱగంటిగంటికి—అను స్థలములనున్నవి. 'ప్రియ! హా! తెఱగంటి గంటికి' అనుచోట, శ్రీ అనంతకృష్ణశర్మగారు సూచించిన సవరణ 'ప్రియువా తెఱగంటిఁ గంటికి' అని. 'దావ గొనవా' అనుచోట వారు సూచించిన సవరణ నా కిపుడు సరిగా జ్ఞాపకము లేదు. కాని 'వారణసేయఁ దావి గొనవా' అనియో,

'వారణసేయఁ ద్రావఁగనునా' అనియో సూచించినట్లు నాకు లీలగా జ్ఞాపకము. 'వారణసేయఁ దావు గొనవా' అని కూడఁ జెప్పుకొనవలెను. అపుడు పద్యార్థ మిట్లు కుదురును.

చెలీ! ఎంతగా వారించినను తావుగొనుటకై (నిలుకడగా నుండుటకై) లేక యందలి పూఁదేనియను త్రావుటకై (త్రావఁగను) తుమ్మెద క్రొత్తతామరపై (నవవారిజము) వ్రాలుచుండుట నీ వెఱుఁగవా? ప్రియుని నా తెలిగంటిచేత — పెదవిమీఁది పలుగాటుచేత — కంటికెవరికిఁ గెంపురాదు...ఎవరికిఁ గోపము రాదనుట. అంతమాత్రముచేత మగవారలను దూఱుట న్యాయమా? నీ మగఁడు నీ నిజము—నీ యకలంక ప్రేమ - తెలిసి నీకడకు వచ్చువఱకు నంతకు నోర్చియుండుము. ప్రాణ పరిత్యాగము సేయఁ దలఁపకుము.

ఇపుడు పద్యపాఠ మిట్లుండవలెను.

వారణసేయఁ దావుగొన
నా నవవారిజమందుఁ దేఁటి క్రొ
వ్వాగుచునుంట నీ వెఱుఁగ
వా?, ప్రియు నా తెలిగంటిఁ గంటి
వ్వారికిఁ గెంపురాదు, తగ
వా! మగవారల దూఱ, నీ విభుం
డారసి నీ నిజం బెఱుఁగు
నంతకు నంతకు నోర్వు మెచ్చెలీ!

కాని యీ పద్యములోని సొగసంతయు 'దావ గొనవా నవవా,' 'ప్రియు నా తెలిగంటిఁ గంటికి,' 'తగవా మగవారల దూఱ,' 'ఎఱుఁగునంతకు నంతకు' అనుచోటుల శబ్దాలంకారము వెలయించుటలో నున్నది. శ్రీనాథు డట్టి సొగసునే యీ పద్యమునందుఁ దెచ్చుటకు యత్నించెనని మనము తలఁచినచో నిప్పటి సవరణతో—'తావు గొనవా' అను సవరణతో నా సొగసంతయుఁ జెడుచున్నది. దావగొనవా, నీ వెఱుగవా, తగవా అని వరుసగా మూఁడు పాదములందును వచ్చుటయే పద్యమునకు సొగసు. కనుక 'దావగొనవా' యనియో, మఱి యేమనియో నాయికా సంబుద్ధిగానే యది యుండుట శ్రీనాథుని హృదయము కావలెను. అపుడు అర్థము పొసఁగు టెట్లు? 'వారణసేయఁ దాల్మిఁగొనవా' అన్నచో సరిపోవునేమో ! నే నెంతగానో వారించుచుంటిని. ఓరుట పొందవా ? అని యర్థమగును. 'దావగొనవా' యనుటకు మఱేదేనియునకైన నర్థము చెప్పఁ గుదురునా? ఇంకను విచార్యము.

* * *

2. ఉత్తర హరివంశములోని ప్రథమాశ్వాసము నందలిది యీ క్రింది పద్యము :

నవ్వుల మాటలో ? నిజమొ ?
నాకములోన ననేక కన్యకల్
మవ్వపుఁ దీఁగలం దెగడు
మానిసు లుండఁగ నంత నెన్నఁడో
జవ్వన ముమ్మకొన్న గడ
సాని ననుం గవయం దలంచితే ?
పువ్వులు వేసుకైనఁ గడి
వోయినవా డుమ్ముడువంగ వచ్చునే ?

ఊర్వశి నరకాసురునితో నీ మాట లనుచున్నది. 'ఇవి నవ్వుల మాటలా ? లేక నిజమా ? స్వర్గలోకము నందుఁ గన్నెలును, మవ్వపుఁదీఁగలను దెగడుమానిసులును పెందలో యుండఁగా నేనాఁడో యౌవనమును నెల కమ్ముకొని జీవిత చరమదశలో నున్న నన్నుఁ జేపట్టఁ దలఁచితివికదా! పూవు లెంత వేసుకైనను వాసనలేని వాడుపూవుల నెవరైని ముడువఁదలఁతురా? (తలపరని భావము.)

ఈ పద్యమునందలి మూఁడవ పాదములో గడసానియని, కడసారెయని రెండు పాఠములు వ్రాత ప్రతులలోఁ గానవచ్చుచున్నవి. గడసాని యనఁగా గడమీఁద నిలిచి యాడు దొమ్మరిసాని యని యర్థము. పూర్వకాలమున సంతలు, జాతరలు జరుగునపుడు ప్రజల వినోదమునకై దొమ్మరాటలు, విప్రవినోదుల వేషములు విశేషముగాఁ బ్రదర్శింపఁబడుచుండినవి. దొమ్మరాటలలో విశేషించి దొమ్మరసాని గడమీఁద నిలిచి యాడు నాట విశేషజనాకర్షకముగా నుండును. అట్టి పనులకై సాధారణముగా వందగత్తెలయిన దొమ్మర పడుచులే చాలఁగా నియుక్త లగుచుండువారు. సంతలో వారి యౌవన సౌందర్యమును జూచిన విదగ్ధులు వారితో రహస్యముగాఁ బ్రత్యేక సంబంధములు గూడఁ గల్పించుకొనుటయుండినది. దానినిబట్టి యేర్పడినదే 'చెప్పవి శ్రీరంగనీతులు, దూరేవి దొమ్మరి గుడిసెలు' అను సామెత. నాచన సోమనాథుఁడు తన కాలము నాఁటి యీ విషయమునే యూర్వశిచేఁ బలికించినాఁ డని యీ పాఠమునుబట్టి మనము తలఁపదగి యున్నది. 'నాకములో మవ్వపుఁదీఁగలను దెగడుమానిసు

లెందఱితో యుండఁగా సంతలో నెన్నఁడో జవ్వనమమ్ముకొన్న గడసానిని నన్ను నీవేల కవయఁ దలఁచెదు' వని యూర్వశి నరకాసురునిఁ బ్రశ్నించినట్లుగా మన మా పాఠమున కర్థము చెప్పుకొనవలసియున్నది. ఈ సందర్భమునుబట్టి యిచ్చట 'కడసారె' యను పాఠముకంటె 'గడసాని' యను పాఠమే యుక్తతరమని తోఁచును.

కాని పర్యాలోచించి చూడఁగా 'గడసాని' కంటె 'కడసారె' యను పాఠమే సమంజసమని తోఁపక మానదు. స్వర్గలోకమునందుఁ బలువురు కన్యకలును, మవ్వపుఁదీగలం బొగడుమానినులును (జవ్వనులు, పడుచులు) ఉండఁగా సంతలో నెన్నఁడో జవ్వనమమ్ముకొని, యెందఱితోడనో భోగించి, యొడలు గుల్లచేసికొని జీవిత చరమదశలోనున్న ముసలిదానిని (కడసారెను) నన్నుఁ గవయఁ దలఁచితివా?—అనుటలో నప్పుడే రజస్వలలై పురుషస్పర్శలేని కన్నెపడుచులును, లోకోత్తర సౌందర్యవతులగు జవ్వనులు (యువతులు)ను నుండఁగా నేను ముసలిదానను—అందును సంతలో నెన్నఁడో యెందఱికో శరీరసౌందర్యము నమ్ముకొన్నదానను—నన్నా కవయఁ దలఁచితివను భావము స్పష్టముగా, సుందరముగా నుండు ననియుఁ గనుక 'గడసాని' యను పాఠముకంటె 'కడసారె' యను పాఠమే పరిగ్రాహ్యమనియు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ యుత్తర హరివంశ వ్యాఖ్యానములో వ్రాసిరి.

'గడసాని' పాఠముకంటె 'కడసారె' పాఠము యుక్తతరమని చెప్పుచు వారు చేసిన వివరణము సుందరముగానే - యుక్తియుక్తముగానే యున్నది. కాని 'కడసారె' యను పదమునకు ముదుసలి యను నర్థమెట్లో వారు వివరింపలేదు. గడసాని యని కాని, కడసారె యని కాని కాక 'కడసావి' యని పాఠము సవరించినచో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 'కడసారె'కుఁ జేసిన వివరణమంతయు సరిపడఁగలదు. సావి యనఁగా కాలము. 'కడసావి' యనఁగా కడకాలము—సాయంకాలము. ఇట్టి సోమనాథుని ప్రయోగమును జూచియే కాఁబోలు ముక్కుతిమ్మన తన పారిజాతాపహరణములో 'కడసావి' యను నీ పదమును ప్రయోగించి యున్నాఁడు. పారిజాతాపహరణములోని యీ క్రింది పద్యముఁ జూడుఁడు :

గీ॥ వేల్పుఁజెలురాకుఁబోడుల వీఁగుఁ జన్ను
గవలపైఁ గుంకుమచ్ఛాయ గడలు కొలిపి
పసిఁడిగట్టున కొక వింత మిసిమి నించి
నెఱసెఁ గడసావి ముదుసలి తెలుపయెండ.

పారి. 4 ఆ. 43 ప.

దీనికి శ్రీ దూసి రామమూర్తిశాస్త్రిగారి వ్యాఖ్య యిట్లున్నది : కడసావి...యెండ—కడ=తుదిదైన, సావి=కాలమునందలి, ముదుసలి=వృద్ధమైన, తెలుప=తైక్ష్ణ్యములేని, ఎండ = ఆతపము, అనఁగా సాయంసమయమునదైన జరఠాతప మనుట.

కనుక దీనిఁబట్టి 'కడసావి' యనుపాఠమును బరిగ్రహించినచో—'కడసావి ననున్' అనగా జీవిత చరమదశలోనున్న - ముదుసలినయిన నన్ను - అనియర్థము చెప్పుకొనఁదగును.

* * *

౬. నన్నెచోడుని కుమారసంభవములోని తృతీయాశ్వాసములోఁ బార్వతీ ప్రత్యంగవర్ణన సందర్భమున నీ క్రిందిపద్యము కలదు.

క॥ స్మర కలహంబునఁ బతిదెస
గిరిసుత దిరుఁదైన నతుకేళి మహేశున్
మరుఁడు దగిలించి గెలువఁగఁ
గర మమరిన......గతి నింపొప్పున్.

ఇది శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ముద్రించిన కుమారసంభవములోని పాఠము.

తంజావూరులోని తాళపత్రప్రతిని జూచి శ్రీ వావిళ్ళవారికై శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు వ్రాసికొనివచ్చిన పాఠముల వ్రాఁతప్రతిలో నీపద్యమునకు సంబంధించిన పాఠము లిట్లున్నవి. 'విరుందై? (దై?)'—'కర మమరి...ల—శ (ల, శ స్పష్టముగానున్నవి.) వావిళ్లవారు ముద్రించిన కుమారసంభవములో నీ పద్య మిట్లు ముద్రింపఁబడి యున్నది.

క॥ స్మరకలహంబునఁ బతిదెస
గిరిసుత బిరుఁదైన నతుకేళి మహేశున్
మరుఁడు దగిలించి గెలువఁగఁ
గర మమరిన కళలనంగ కచ మింపొప్పున్.

ఇదేపద్యము మదరాసు విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన కుమారసంభవములో నిట్లున్నది.

క॥ స్మరకలహంబునఁ బతిదెస
గిరిసుత విఱుఁదైన నతుకేళి మహేశున్
మరుఁడు దగిలించి గెలువఁగఁ
గర. మమరి (నహాశ) గతిని గచ మింపొప్పున్.

దీని క్రింద నొసంగియున్న యథోజ్ఞాపికలో నిట్లు కలదు. క. మమరి...శ గతి నింపొప్పన్; చ. మమరిన ...గతి నింపొప్పన్ (గశ లనంగఁ గచ మింపొప్పన్ అని యొక యచ్చుప్రతిలోఁ గలదు.).

విశ్వవిద్యాలయ ప్రచురణములో నీపద్య మచ్చగు నాటికి వావిళ్లవారి పుస్తకము వెలువడలేదు. మానవల్లి వారి ప్రతిలో 'కశలనంగ' ఇత్యాది పాఠములేదు. ఇఁక నథోజ్ఞాపికలోఁ జేర్కొనఁబడిన యచ్చుప్రతి యేదో తెలియరాదు. అది యట్లుండనిండు.

నన్నెచోడుఁడు పార్వతీ ప్రత్యంగవర్ణనను సేయుచు చెవులను, కటివంక బొమలను, నిటలమును, కురులను, కేశపాశమును వర్ణించినతరువాత నున్నది పయిపద్యము. అందుచేతనే వావిళ్ల పరిష్కర్తలును, విశ్వవిద్యాలయ ప్రచురణ పరిష్కర్తలును నీపద్యమును గూడ 'కచవర్ణనము' గానే భావించి తదనుగుణముగా 'కశలనంగ' యని యొకరును, 'పాశగతిని' అని మఱి యొకరును వ్రాఁతప్రతిలోని గ్రంథపాతమును బూరించిరి వ్రాఁతప్రతిలోఁ గానవచ్చు నొండు రెండు అక్షరములు తమ పూరణపాఠములో నుండునట్లు చేయుటకు వారు ప్రయత్నించిరే కాని యాపూరణపాఠము సాయమున బద్యార్థ మెట్లు కుదురునో యని వారాలోచించినట్లు తోఁపదు. అక్షకేళి, కశలు, కచము—; అక్షకేళి—పాశము—కచము వీని కెట్లు సంబంధము కుదురునో? ఈ పాఠముల మూలమునఁ బద్యార్థము సాధించుట సాధ్యమా యని వారు చూడలేదు. అసలు వారా పద్యమును కచ వర్ణన పద్యముగా భావించుటయే వారి కాపద్యార్థము సమన్వయము కాకపోవుటకు గారణము.

నిటల వర్ణనమునకు దరువాతి పద్యములో గురులు వర్ణింప బడినవి. అది ముంగురుల వర్ణనము. తరువాతిది కేశపాశము. ఆతరువాతిది వీపు. ఇది యాతఁడు పాటించిన వరుస. అంతేకాని యొక్కొక్క యవయవమునకును ఒక్కొక్క పద్యమును మాత్రమే వ్రాసిన నన్నెచోడుడు కేశవర్ణనము మాత్రము మూఁడు పద్యములలో జేసెననుట పొసగదు. ఇట్టి పూర్వరంగముతో శ్రీ ప్రభాకరశాస్త్రిగారీ పద్యమునందలి గ్రంథపాతభాగమును జక్కగా బూరించి పద్యార్థమును సమన్వయించిరి. శ్రీ తిరుమల రామచంద్రగారు శ్రీ శాస్త్రిగారికై 1939 లో మక్కికిమక్కిగా నకలుచేసి తెచ్చిన వ్రాఁత ప్రతిలో "గర మమరిన...లక...వింపొప్పను" అని యున్నది. రామచంద్రగారు వ్రాఁతప్రతి మార్జినులో "ఇది వీపువర్ణన కావచ్చును. సంస్కృతకవులు వీపును పలకతో బోల్చుట కద్దు." అని వ్రాసిరి. దానినిబట్టి శాస్త్రిగారు పరిశీలించి సవరణ చేసిరి. వారి సవరణతోడి పద్య మిట్లుండును.

క ॥ స్మరకలహంబునఁ బతిదెస
గిరిసుత విఱుఁదైన నక్షకేళి మహేశున్
మఱఁదు దగిలించి గెలువఁగఁ
గర మమరిన నెత్తపలక గతి నీఁ పొప్పన్.

ప్రణయకలహములో బార్వతి కుపితయై పెడ మొగము పెట్టి వెనుదిరుగగా నామెవీపు మన్మథుడు జూదములో (అక్షకేళి) బరమేశ్వరుని గెలుచుటకై యమర్చిన నెత్తపలక (నెత్తమాడు పలక)వలె నుండినదట!

ఇచట శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చేసిన సవరణలు నెత్తపలక—వీపొప్పన్ అనునవి వ్రాఁతప్రతిలోని యక్షరములకు జేరువగానున్నవి. వ్రాఁతప్రతిలో స్పష్టముగా నున్న 'లక' కు 'నెత్తప' యనునక్షరముల జేర్చిరి. 'వింపొప్పను' అను నక్షరములను 'వీంపొప్పన్' అని పఠించి 'వీపొప్పన్' అను పాఠముతో నర్థమును సమన్వయించిరి. పూర్వ పాఠములతో—పూరణములతో నసన్వితముగా నుండిన పద్య మీ సవరణతో నన్వితమగుచున్నది. ప్రత్యంగవర్ణనములో వీఁపునుగూడ వర్ణించుట మన ప్రాచీన కావ్యములలోఁ గలదు.

శ్రీనాథుని శృంగారనైషధములో నలుఁడు దమయంతీ సౌందర్యమును వర్ణించు సందర్భమునందలి యీ క్రింది పద్యముఁ జూడుఁడు:

గీ॥ ప్రతిఫలించు ప్రవేణికాభారరచిత
మల్లికలు రాజతాక్షరమాలికలుగ
శంబరారాతి విజయశాసన సువర్ణ
పట్టికయుఁ బోలె నొప్పు నిప్పణఁతి వీఁపు.

3 ఆ. 195 ప.

తెనాలి రామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యములోని యీ పద్యము వీఁపు నభివర్ణించుచున్నది.

క॥ వలరాజు కేలి వాలుం
బలకయు బలె నలరు వేణి పాణంపము పై
లలితాంగి వెన్నుపట్టియ
తళతళ మను కుందనంపుఁ దగడున్ దెగడున్.

3 ఆ. 202 ప.

అంతే మఱొకచోట నచ్చుముగా నన్నిచోడునివలెనే పేఁపు నెత్తపలకతోఁ బోల్పఁబడి యున్నది. చూడుఁడు:

వ॥...నిష్కళంకంబులై నిబిడంబులై నిద్దంబులై నీరంధ్రంబులై నీలంపుగుంపులసొంపు లామతించు మంచి నెఱికురులునుం గలిగి, వలగొజ్జు నెత్తపలక తమకునం గనుపట్టు పేఁపున నేపారి యా పారిజాతామోదమేదుర విలాసంబుల భాసిల్లు నెండియు.

దీనఁబట్టి పయిపద్యమున శ్రీ ప్రభాకరశాస్త్రి గారు 'నెత్తపలకగతి పేఁపొప్పన్' అని చేసిన సవరణ నన్నిచోడుని యాశయానుగుణమును, బూర్వకవి సంప్రదాయానుగుణమును నని నిరూపిత మగుచున్నది.

* * *

4. కుమారసంభవములోని కృత్యవతరణికలో నీ క్రింది పద్యము కలదు:

అక్కజమై మహార్థనివ
హంబు సదుక్తులు మెచ్చఁ జూచినన్
గ్రుక్కఁదమైన సత్కృతి య
గుర్వగుఁ గా కిలఁ జీకు లావుకం
ద్రొక్కిన యట్లు నోరఁ గొలఁ
దుల్ పురికొల్పఁగ నందులోన నొ
క్కొక్కఁడు సక్కనైనఁ గృతి
యుం గృతి యందురె వాని మెత్తురే?

1 ఆ. 38 ప.

ఇట్టి సందర్భముననే 'నోరఁ గొలఁదు' లనుటకు తాళ్ళపాక చినతిరుమలయ్య తన సంకీర్తన లక్షణమున 'నోరఁదోడు' అని ప్రయోగించి యున్నాఁడు. చూడుఁడు:

క॥ వరదానంబున నైనను
గురుముఖమున నైనఁ దెలిసికొను కవి పలుకుల్
పరమామృత మా లేదా
దురహంకృత కవిత నోరఁదో దండ్రు బుధుల్.

23 ప.

జక్కన విక్రమార్కచరిత్రములోని యీ పద్యము నన్నిచోడుని పద్యముతో సంవదించుచున్నది.

క॥ ప్రతిపద్యము చోద్యముగాఁ
గృతిఁ జెప్పిన నొప్పుఁ గాక కృతి నొకపద్యం
బతిమూఢుఁ డైనఁ జెప్పఁడె
బ్రతిపాదింపఁడె ఘుణాక్షరన్యాయమునన్.

1 ఆ. 17 ప.

విక్రమార్కచరిత్రములో మఱికొన్ని తావులఁ గూడ కుమారసంభవ పద్యచ్ఛాయలు గానవచ్చుచున్నవి.

సరసిజనాభుఁ డట్టె హరి,
సారస సంభవుఁ డట్టె బ్రహ్మ యా
సిరియును నబ్జవాస యటె
చిత్తమునం దలపోసి చూడఁగా
నొరయునె యీ ప్రసూనముల
తో నితర ప్రసవవ్రజంబు నాఁ
బురమునఁ బద్మషండములు
పొల్పెసలారు మనోహరంబులై.

1 ఆ. 91 ప.

ఇందు 'రవికుల శేఖరుండు కవిరాజ శిఖామణి కావ్యకర్త సత్కవి భువి నన్నిచోడఁడె' యిత్యాది పద్యచ్ఛాయ ఛాయామాత్రముగాఁ గలదు.

సీ॥ మంజరీ సంజాత మకరంద మధుమత్త
చంచరీక ద్వంద్వ సంభ్రమములఁ
గోరకితానేక కోమలవల్లికా
వేల్లిత భూజాత విలసనముల
సహకార ఫల రసాస్వాదన సంతుష్ట
శుక సతీపతి గతి ప్రకటనములఁ
గిసలయాంకుర రసగ్రసన సముత్కంఠ
కలకంఠ విటవిటీ కలకలములఁ
గీ॥ గనియు వినియు వసంత సంక్రాంతరాగ
సర్వసామాన్య మహిమ కాశ్చర్య మంది
చెలి కెఱింగించి కొనియాడి చెప్పి చెప్పి
ప్రమదవనకేళిఁ దేలిరి పతియు సతియు.

అనునది కుమారసంభవమునందలి యీ క్రింది పద్యముతో సంవదించుచున్నది.

సీ॥ కలహంసకలరవాకలిత నిర్ఝరముల
సారసారావాబ్జషండములను
రోలంబగతి లతాందోలంబులను శుక
మంజులస్వన పుష్పమండపములఁ
గలకంఠరణిత మాకందవనములఁ బా
రావతధ్వని మందిరస్థలములఁ
గేకి కలధ్వాన గిరికందరంబుల
లావుక నినద లీలాతలముల
గీ॥ నప్పటప్పటి కనురాగ మగ్గలింపఁ
గామునకు మంతకంతకుఁ గడలుకొనఁగ
నలి రమించిరి కైలాసనగముమీఁదఁ
బరమసుఖలీల నాజగత్పతియు సతియు.

1 ఆ. 78 ప.

విక్రమార్క చరిత్రములో జలక్రీడాసందర్భమునందలి యీ క్రింది పద్యములు చూడుఁడు!

గీ॥ ఆననాంబుజసౌరభ మానునలుల
జోప నేరక సఖులలోఁ జొచ్చి నీట
మునిఁగి యవి వారిమోముల మునురుకొనిన
నవ్వుచును లేచి యొక్కతె నవ్వుచుండె.

5 ఆ. 51 ప.

గీ॥ సలిలకేలి సల్పు చామలమోములు
కమల సమితి యనుచుఁ గదిసి యలులు
కురుల సిరులు చూచి కొన్ని తేఁటులు మున్న
మూఁగియున్న వనుచు మొగిని జనియె.

5 ఆ. 50 ప.

కుమార సంభవములోని నవమాశ్వాసములో జలక్రీడా వర్ణనమందలి యీ క్రింది పద్యములను బయిపద్యములతోఁ బోల్చి చూడుఁడు.

చ॥ తనముఖ మంబుజాత
మని దండడి మూవు నళివ్రజంబుతో
బెనఁగు విదగ్ధ మోల నొక
తేలుసతిం గని యోలఁ జెట్టి
పిల్చిన నది తన్నుఁ బట్ట నని
చేరినఁ దేఁటులదాని మూవికొం
డనుచును గ్రుంకిపోయి చదు
ాలయి నవ్వుచు లేచె నొక్కెడన్.

9 ఆ. 88 ప.

గీ॥ తమముఖంబులు దళితాంబుజములు సావి
మూవు తేఁటులఁ గని నవ్వు నావిలాస
వతుల దరహాసరుచి మధువ్రతము లెత్తిఁగి
వెల్లనై పద్మషండంబు వలరి చనియె.

9 ఆ. 87 ప.

విక్రమార్క చరిత్రములోని యీ క్రింది పద్యముఁ జూడుఁడు!

ఆనతులై నుతించు చతు
రాననముఖ్యుల కోర్కి దీర్పఁబం
చాననదివ్యమూర్తికి ష
డాననుఁడై జనియించి యాసహ
స్రాననసంస్తవంబులకు
నందని శక్తిధరుండు సానుకం
పాననుఁడై నృపేంద్రసచి
వాగ్రణి సిద్ధనఁ గాచుఁ గావుతన్.

1 ఆ. 3 ప.

ఇందలి సంఖ్యా సమత్కారమునకు నన్నిచోడుని పద్యముయొక్క ప్రభావము కారణము కాదగును.

గీ॥ ద్వాదశార్ధార్ధనయను నాద్వాదశార్ధ
నయనుఁ డొగిఁ జూట్టె నిజభుజ ద్వాదశమున
నుదయదశశతకిరణుఁ డయ్యుదయనగముఁ
గిట్టి దశశతకరములఁ జుట్టినట్లు.

12 ఆ. 214 ప.

ఇంకను విక్రమార్క చరిత్రములోని ఉద్యాన జలక్రీడావర్ణనములు నన్నిచోడుని కుమారసంభవము నందలి వర్ణనములకుఁ బ్రతికృతులుగా నున్నది.

* * *

5. పార్వతితపస్సును బరీక్షించుటకై పరమేశ్వరుడు బ్రహ్మచారి వేషమున వచ్చి యామెతో సంభాషించు సందర్భమునందలిది యీ క్రింది పద్యము కుమార సంభవములోనిది.

సీ॥ మగ లాఁడువారికి మరిగి ముచ్చిలి బంది
వట్టి కన్నంబులు వెట్టి తెరువు
దెకొక్కని చని పరదేశంబు లుడుగక
ద్రిమ్మరి ప్రేల్లను బొమ్మరబోయి
యాచకులై వేఁడి నీచుల సేవించి
కల మెక్కి చని నలిఁ గయ్యమాడి
యేనుంగునకుఁ బారి యిల్లెన్ని యేనియుఁ
గష్టముల్ వడిరని గలదుగాక
గీ॥ మగలఁ గోరి తొల్లి మనువలు తపములు
సేసి నవసిరనిన చెట్ట లెందుఁ
గలదె దీని కచ్చు నిలిపిత నీవ నీ
వలన సతులపురులు వోలిసెఁ గాక.

7 ఆ. 36 ప.

కాళిదాసు కుమారసంభవమున నీ ఘట్టమునందు దీనికి మూలమగు శ్లోకమేదియుఁ గానరాదు. బ్రహ్మచారి నోట బలికించినమాట లివి యీతని స్వకపోలకల్పనము. దశకుమార చరిత్రమున 'మగ లాఁడువారికి మరఁగి' చేసిన చేష్టితముల నెల్లఁ జదివి యాజ్ఞాపకముతో బహుశః బ్రహ్మచారినోట నన్నిచోడ డాయీ మాటలను బలికించి యుండవచ్చును. ముచ్చిలుట, బందివట్టుట, కన్నములు వెట్టుట యాదిగా దశకుమార చరిత్రము నందలి కుమారదశకము పడినపాటు లేతద్రచనావసరమున నన్నిచోడుని కుపస్థితియం దుండెఁ బోలును! ఈ దృష్టితో నిందుఁ జెప్పఁబడినవాని నెల్ల దశకుమార చరిత్రమునందలి కథలలోని విషయములతో సమన్వయింపవలసి యున్నది.

# వేయి నూట పదహార్లు

## శ్రీ ద్వివేదుల సోమనాథశాస్త్రి

### పాత్రలు

కమల : పెళ్ళికూతురు
చంద్రం : పెళ్ళికొడుకు
విశ్వనాథం : పెళ్ళికూతురి తండ్రి
రామేశం : పెళ్ళికుమారుని తండ్రి
లక్ష్మి : పెళ్ళికూతురి తల్లి
ఇంకా డాక్టరు, శివం, పురోహితుడూ మున్నగువారు

స్థలం : పెళ్ళి పందిరి
సమయం : లగ్న సమయం

[పెళ్ళివారూ, అతిథులూ, అందరూ శుభకార్యానికి వచ్చి పందిట్లో కూర్చున్నారు; ఇంకా వస్తూన్న అతిథులని పెళ్ళిపెద్దలు ఆహ్వానిస్తున్నారు. వచ్చిన వాళ్ళకి పన్నీరు జల్లి సెంట్లుపూసి, మర్యాద చేస్తున్నారు. కొందరు ముహూర్తం దగ్గిర పడుతూంది గనుక అక్షతలు అందరికీ పంచిపెడుతున్నారు. వారిలో వారు – పెళ్ళివారు – ఆడుకొనే హాస్యాలతో, పురోహితులు చదివే మంత్రాలతో, మంగళ వాద్యాలతో, పెళ్ళి పందిరి కలకలలాడుతోంది.]

లక్ష్మి : అదుగో! అక్కయ్యగారూ! రండి! రండి!! ఇలా కూర్చోండి...ఇటు...ఇటు...అమ్మో! అమ్మలూ: నువ్వూ వచ్చేవే! కూచో!...

స్త్రీ : అప్పుడే అంతా సిద్ధం అయినట్టుందే...యింకా ఎంత ఆలస్యం వుంటుం దేవిటి లగ్నానికి? అయిపోతుందో ఏవిటో అని...గబగబా వచ్చేసేం—

లక్ష్మి : ఏమండీ: సుబ్బమ్మగారూ! వదినగారు లేదేమండీ!

స్త్రీ : వస్తుందమ్మా: మాలాంటి ముసిలాళ్ళతో వస్తుందా?...యింకా సింగారం పూర్తి కాలేదు...ఆ నారాయణమ్మ వాళ్ళూ అంతా కలసి వస్తారట!

లక్ష్మి : ఊరుకుందురూ మీరు మరీను! కోడలిని ఏదో ఒకటి అంటేనే గాని వూరుకోరు! అదుగో!... మాటల్లోనే వచ్చేశారు...రండి వదినా...యిలా కూర్చోండి...నారాయణమ్మగారూ...అదుగో మా వియ్యపురాలు కనకమ్మగారు...ఆ నలుగురూ మా అమ్మాయి ఆడపడుచులు...వారూ..

(పెళ్ళికుమార్తె తల్లి లక్ష్మి యిలా వచ్చిన స్త్రీలని ఆహ్వానిస్తూంటే ఆ ప్రక్కనించి, ఆమె భర్త విశ్వనాథం, మొగవాళ్ళని ఆహ్వానిస్తున్నాడు.)

విశ్వనాథం : రండి! శివంగారూ! కబురు పంపడం ఆలస్యం అయింది! మా మీద అభిమానం వుంది కాబట్టి, వచ్చేశారు—ఏరీ అబ్బాయిగారు వాళ్ళూ! అదుగో వెనకనే వున్నారే! దయచేయండి! అలా కూర్చోండి...అదుగో వీరే మా బావగారు, రామేశంగారు...(అని పరిచయం చేయగా)

రామేశం : నమస్కారమండి!

శివం : నమస్కారమండి!

విశ్వ : బావగారూ యీయనే పరమశివంగారు, ఛైర్మన్ గారు, మనకి కావలసినవారుకూడా... (వస్తూన్న మరో అతిథిని వుద్దేశించి) ఓహో! అహోబలశాస్త్రిగారా! దయచేయండి!...... ఏమిరా! రామం! ఆ కర్పూరపుల్లలూ, పన్నీరూ, యిలా పట్రా!...(లక్ష్మి వెనకనుండి వచ్చి)

లక్ష్మి : అబ్బబ్బ ఏ!వండీ! మిమ్మల్నే వినిపించుకోరేమండీ!

విశ్వం : నన్నేనా? సరే—ఏం కావాలి! అలా గొంతు చించుకోకపోతే మెల్లిగా వచ్చి చెప్పరాదూ?

లక్ష్మి : ఆకులూ, చెక్కలూ తెప్పించాలి! వెంటనే! అయినా అంత కొంచెం తెప్పించుకుంటారా – యిలాగేనా?

విశ్వం : బాగుంది పీకల మీదికి వచ్చేవరకూ చూసుకోరు! అదేం మనుషులో...అబ్బాయీ!

రమణా! (అని పిలుస్తూ వెళతాడు. ఇంతలో పురోహితుడు)

పురో : అమ్మా! వేగిరం కానీం డమ్మా! లగ్నం సమీపిస్తాంది, వ్యవధి లేదు. బోలెడు తంతు జరగాలి! పెళ్లికుమారుణ్ణి ప్రవేశపెట్టండి...(మంత్రాలు చదువుతూ)...రండి...బాబుగారూ...అయ్యా రామేశంగారూ...మీ రిలా పెళ్లికుమారుని ప్రక్కని కూర్చోండి...విశ్వనాథంగారూ...అయ్యా...విశ్వనాథంగారూ...ఏరీ యీయన? అమ్మా లక్ష్మమ్మగారూ! పెళ్లికూతుర్ని గౌరీ గంపతో ప్రవేశపెట్టండి!

విశ్వ : వస్తున్నానండీ! సిద్ధాంతిగారూ! (వచ్చి) ఏమి సెలవు?

పురో : పుణ్యకాలానికి మీరలా వెళ్ళిపోతే ఎలా చెప్పండి! కట్నసమయం సమీపిస్తుంది. మీరూ మీరూ నిర్ణయించుకొన్న విధంగా...లాంఛనాలన్నీ జరపండి!...యిది వేగిరం కానిస్తే... సూత్రధారణ కానివ్వొచ్చు. వ్యవధి లేదు... ఆఁ...ఏదీ...యిలా...నా చేతి కివ్వండి... వాయించండిరా భజంత్రీలూ ... మంత్రాలు చదువుతూ కట్నం పళ్లెం అందుకుంటాడు. అమ్మా లక్ష్మమ్మగారూ యీ పట్టుతాపితాలకు పసుపు పెట్టించండి!

విశ్వ : శాస్త్రిలుగారూ యిహ చదివించండి –

పురో : (మంత్రాలు చదువుతూ)...“శ్రీ విశ్వనాథశర్మగారు...తను కుమార్తె వివాహ మహోత్సవ సందర్భమందు...అల్లునికి – ఆనంద పూర్వకంగా – చదివిస్తున్న...పట్టుతాపితాలూ, వెండి కంచం, వెండిచెంబు, ఆడ బొట్టె లాంఛనాలు నాలుగు వందలూ, అత్తగారి లాంఛనం నూట పదహార్లూ...వెయ్యి నూట పదహార్లు కట్నం పుచ్చుకోండి రామేశంగారూ లెక్క చూచుకోండి ఆఁ...వాయించండ్రా భజంత్రీలూ.

విశ్వ : శాస్త్రిలుగారు ... అందుకోండి. ఇవి మా అమ్మాయికి చదివించండి –

పురో : శ్రీ విశ్వనాథశర్మగారు, తను కొమార్తె కన్యాదాన కాలమందు, పసుపు కుంకం నిమిత్తం. నూటపదహార్లు రొఖ్ఖం, పది తులాలగొలుసు, మూడు తులాల వోళ్ల నెక్లెసు, చిల్లరగా, ఆమె ధరించిన గాజులూ, గొలుసూ, మొదలయిన ఆభరణాలు...ఆఁ: మీ నిర్ణయాలు అయినట్టేనా?... త్వరగా కానివ్వండి! శుభం! (అని మంత్రాలు చదువుతోండగా, పెళ్లికొడుకు తండ్రి రామేశం లేచి—)

రామేశం : అయ్యా సిద్ధాంతిగారు, కొంచం ఆపండి. కట్నంలో తిరకాసి వుంది.

పురో : అదేమిటండీ!...ఏఁవండీ విశ్వనాథంగారూ! మీ బావగారు అలా అంటున్నా రేమిటి!

రామే : కట్నం నిర్ణయప్రకారం లేదు! అయ్యా విశ్వనాథంగారూ? మన నిర్ణయాలు మరచిపోయారా? (పందిట్లో అందరూ స్తబ్ధులయి పోతారు.)

విశ్వ : (తడబడుతూ) అయ్యో! అలాగంటా రేమి! మనం అనుకున్నట్టుగానే వెయ్యినూట పదహార్లూ సరిగ్గా లెక్కపెట్టి యిచ్చేమే! లెక్క పొరపాటు ఏమయినావస్తే చెప్పండి దానికేమి, అయిదో పదో యిటూఅటూ...తలిమ్మా లాంఛనాలు యధావిధిగా మీయిష్టప్రకారమే జరిపించేము గదా!

రామే : తక్కినవాటి మాటకేం విశ్వనాథంగారూ! ఈ కట్నంలోనే మీరు అన్నమాట తప్పేరు! చూడండి — మేమన్నది వెయ్యి-నూట-పదహార్లిమ్మని ... అంటే – అర్థం – వెయ్యినూరులూ, వెయ్యి పదహారులూ అని, అంతేగాని ఒక వెయ్యి, ఒక పదహారూ పోశేస్తారని గాదు. ఇలా మోసం చేస్తారని అనుకోలేదు...యిదేం మర్యాద?

విశ్వం : (నవ్వి!) బావుంది రామేశంగారూ! హాస్యం ఆడుతున్నారా?

రామే : మీతో నాకు హాస్యమేమిటయ్యా! అందులోనూ కట్నంలోను!

విశ్వం : నిజమేనా? ఇది నిజమేనా? వెయ్యినూట పదహార్లంటే లోకం అంతా ఎలా జరిపించిందో, ఎలా జరిపిస్తాందో నేనూ అలాగే జరిపేను గదా?

రామే : లోకం సంగతి మాకేం? మా లెక్క అంతే– అబద్ధం ఆడాల్సిన ఖర్మ నాకు లేదు. మీ కిష్టమయితే మేము కోరినట్టుగా కట్నమియ్యండి! లేదా మాకు సెలవు యిప్పించండి! ఇంత మాట నిలుపుకోలేని వారితో–అమర్యాదస్తులతో మాకు సంబంధం ఏమిటి? కో అంటే కోటిమంది

మా కాళ్ళముందుకి వస్తారు. మా వాడు. ఎం, కాం!,- మెట్రిక్కే ఏంకాదు! ఏమనుకున్నారో!

విశ్వ: (ప్రార్థనా పూర్వకంగా) బావగారూ! క్షమించండి! ఇలా నలుగురిలోనూ నా పరువు తీయకండి! మీ కోరిక ప్రకారం, వెయ్యి నూటలూ, వెయ్యి పదహార్లూ అంటే మొత్తం లక్ష పదహారు వేలు, నే నెక్కడనుండి తేగలను? ఇది లోక విరుద్ధం. ఎక్కడయినా వుందా? మా వల్ల తప్పు లుంటే మన్నించండి-అంతేగాని, నిర్ణయం లేనివి, తాహతుకు మించినవి అడిగి, బీదవాణ్ణి, మర్యాదగలవాణ్ణి అల్లరిపాలు చేస్తారా? మీరూ ఆడపిల్లలు గలవాళ్లు!

రామే: అక్కడికి మేమేనా అమర్యాదస్తులం? ఎం. కాం. సంబంధం వెయ్యి రూపాయిల కట్నానికే వచ్చేస్తుందనుకున్నారా?... మేం మొదటే చెప్పేం-అన్నీ వెండి రూపాయిలే యిమ్మని. ఏదీ, అన్నీ కల్తీ రూపాయిలే మొహాన్ని కొట్టేరు, పోనీ నే నడిగినది సరిపోయిందా అంటే అదీ కాదు ... కానా పరకా ఎంత తేడా!...తర్వాత మీ యిష్టం!

విశ్వ: (గద్గదికంగా) బావగారూ! ఇవి చేతులు కావు కాళ్ళు!...బీదవాణ్ణి!—గొప్ప సంబంధం చేస్తున్నాను కదా అని పొంగిపోయేను!... యింత వరకూ వచ్చిన తర్వాత యింక రసాభాస చేస్తే నా పిల్లకి పెళ్లి అవుతుందా? సమయం, అనువు కనిపెట్టి మీ రిలా అన్యాయమైన, తలకుమించిన కోరిక కోరితే సంసారిని ఎక్కడనుండి తేగలను? పిల్లలుకలవాడిని, మీకు తెలీదా? మీరు కోరినంతసొమ్ము నావంటి నిర్భాగ్యుడిదగ్గర ఎలావుంటుంది? లోకరివాజు జరిపించాం. పెద్దలు, తెలిసినవారూ, మీరిలా అనడం భావ్యంకాదు. నలుగురు పెద్దమనుషులనీ అడగండి న్యాయం...అయ్యా, మీరేచెప్పండి!

రామే: ఒకరితో నాకేం సంబంధం? వెయ్యినూట పదహార్లంటే నాఅర్థం అది...రా రా చంద్రం! అనేదొకటి! చేసేదొకటి! ఇలాంటి పరువు తక్కువ సంబంధంతో ఏంపని మనకు?

పెళ్ళికొడుకు చంద్రం: నాన్నారూ! (అని గట్టిగా అంటాడు.)

రామే: చాల్లే యింకేం ముడికడతావ్! నువ్వేమీ అనక పద! మొగాడివి నీకేం రా?

విశ్వ: ఆగండి! బావగారూ! నాకొంప ముంచకండి! కావలిస్తే మరో వందో రెండువందలో అడగండి యిస్తాం...తీసుకోండిగాని యీవిధంగా నన్ను, నా వంశాన్ని...నాపిల్లని అమర్యాద చేయకండి; మీకు ఆజన్మాంతం, ఋణస్తుడిని నామాట వినండి—(బతిమాలుకుంటాడు.)

రామే: ఊండవయ్యా! ఒప్పుకొన్నదొకటి!...తర్వాత యిలా కాళ్ళుపట్టుకుంటే—వూరుకుంటామనా? ఇదొక ఎత్తా కట్నం ఎగవేయడానికి? ఆ వెయ్యి రూపాయిలకొచ్చే సంబంధమే చేసుకో!

విశ్వ: ఇదేం బజారులో బేరమా బావగారూ, యిది కాకపోతే అది అని మరో కొట్టుకి వెళ్ళడానికి? జన్మజన్మలనుండీ, ఏదో బాంధవ్యం వుంటేనే గాని యింతవరకూ రాదు. ఇద్దరూ ఒక్క పీట మీద యింతవరకూ కూర్చుని, కొంత తంతుజరిపి, యిప్పుడు మళ్లీ మరొకసంబంధమా? లోకం వూరుకుంటుందా?—నాపిల్లకి మరో సంబంధం వస్తుందా? మాగతి ఏంగాను? మీకు హృదయం లేదా?.....అయ్యా...బాబూ! పరమశివం గారూ? రామూర్తిగారూ...బాబూ మీరయినా చెప్పండి! ఇంకా ఆడపిల్లలు గలవాణ్ణి! ఆడపిల్లని కనడమే దోషమా? ఏంచేయగలను? అయ్యో భగవంతుడా?...ఏందారీ! (అని ఏడుస్తాడు. పెళ్లికొచ్చిన పెద్దల్లో పరమశివం గారు లేచి)

శివం: అయ్యా! రామేశంగారూ! ఇది కేవలం అన్యాయం. వారిచ్చిన కట్నం, వెయ్యినూట పదహార్లూ, లోకరీత్యా, సవ్యంగావున్నది. మీరుతీసిన అర్థం అర్థంలేనిది—మీస్వంత అభిప్రాయాలు, ఎలా తెలుస్తాయి? సంఘం, లోకం, వీటితోసహా నడుచుకోవాలి, గాని, యిలా అవకాశం దొరికిందికదా అని నిర్బంధించడం భావ్యంకాదు.

మరొకపెద్ద: అయ్యా పెద్దలం చెబుతున్నాం. నిర్విఘ్నంగా జరగవలసిన కార్యాన్ని యిలా పాడుచేసుకోకండి. మీ కోరిక సామాన్యు డెవడు తీర్చగలడు? సమాన వియ్యం, సమాన కయ్యం

అన్నారు. ఆ వుద్దేశ్యం ఏదో మొదటే వివరంగా చెప్పవలసింది. మీరు మరేదో ఉద్దేశ్యంతో అమాయకుడు విశ్వనాథం గారిని కట్టిపెడుతున్నారు. కాదూ పోదూ అంటే, మరేదయినా కోరండి. అలా కానివ్వొచ్చుగాని ఇలా మొండిపట్టు పట్టకండి. శ్రేయస్కరం కాదు.

పురోహితుడు: అయ్యా. పెద్దవాణ్ణి, ఎన్నో పెళ్ళిళ్ళు చేయించినవాడిని, నా చేతులమీదుగా కట్నాలు చదివించినవాడిని. ఇలా కోరినవారిని ఎక్కడా చూడలేదు, వినలేదు. రామేశం గారూ - యిది ఉభయత్రా మంచిది కాదు. ముహూర్తం సమీపిస్తూంది; ముందు మంగళ సూత్ర ధారణ కానిచ్చి, తర్వాత మీరూమీరూ చూచుకోండి.

రామే: బాపుందయ్యా శాస్త్రిలూ! ముందు మూడుముళ్లూ వేయించి; ఆతర్వాత, నాపీక మడిపెట్టుకో మంటావు! ఆ పాటి నాకూ తెలుసు! ముందు మే మడిగిందంతా అక్షరాలా జరపవలసిందే - లేదా. పెళ్లి జరగదు! అంతే—(ఈ మాటలు విని చూడడానికి వచ్చిన పెద్దలందరూ ఉద్రేకంతో లేస్తారు.)

పెద్దలు: ఎందు కయ్యా జరగదు? ఎలా జరగదో మేమూ చూస్తాం...మీ రిక్కడనుండి ఎలా కదుల్తారో మేమూ చూస్తాం.

రామేశం: ఏం చేస్తారేం? మా యిష్టం, మేం వెళతాం, మాకీ పెళ్లి వద్దు. ఏమిటీ నిర్బంధం?

శివం: అదేదో ముందే తేల్చుకోవలసింది, చేయిమించేక యిప్పుడా! ఇదుగో చూడండి రామేశం గారూ! వెయ్యినూట పదహార్లు అనే ముక్కలోనే కదా మీకు అభిప్రాయభేదం వచ్చింది, కాబట్టి, అటు మీ మాటా కాదు యిటు వారిమాటా కాదు. లోకరీత్యా వెయ్యి రూపాయిలూ, మీ అర్థానికి తగినట్టుగా వెయ్యి అనగా పదినూర్లు కాబట్టి ఒక్కొక్క నూటికి పదహారేసి రూపాయిలూ, యిస్తారు. విశ్వనాథం గారు, ఈ మా పెద్దల నిర్ణయ ప్రకారం కార్యం జయప్రదం కానీండి! లేదా యిప్పుడే పోలీసులని పిలిపించి కట్నం తీసుకుంటున్నారని రిపోర్టు చెయ్యాలిసి వస్తుంది. మీ యిష్టం!

విశ్వ: వద్దు! శివంగారూ! పోలీసులు, రట్టూ వద్దు. నా ఖర్మ—ఏం చేస్తాం. వారికిష్టం లేకపోతే అలాగే వెళ్లనీండి .. యిప్పటి కయినది చాలు!

రామే: ఏమిటయ్యా మీ బెదిరింపులు! నాకూ ఆడపిల్లలున్నారు, పెళ్లిళ్లు చేయడానికి వాళ్లకి కట్నం పొయ్యకండా వస్తారా మొగుళ్లు? మరి నే కొడుక్కి కట్నం తీసుకుంటే తప్పొచ్చిందా? ఏమి సంస్కర్తలయ్యా! మొదట నా ఆడపిల్లలకి కట్నం లేకండా, పెళ్లాడ్డానికి ముందుకొచ్చే పెళ్లి కొడుకులను చూపెట్టండి నేనూ మానేస్తాను.

పెళ్లికొడుకు: నాన్నగారూ, యింతవరకూ వూరుకున్నాను. ఎదురుచెబితే—పెంచి పెద్దచేసినందుకిదా అని అడుగుతారు. మీరు తండ్రికదా అని గౌరవం యిచ్చి నోరుమూసుకుంటున్నాను. ఈ మాత్రం కట్నం తీసుకుంటున్నందుకే నాకు అదోలా వుంది. మీకు భయపడి, విధిలేక వూరుకున్నాను. ఇంత చదువూ చదువుకొని ఏంప్రయోజనం? మొదట్లోనే నా ఆశయానికి హంసపాదు పడింది. కట్నం తీసుకోకండా పెళ్లి చేసుకోలేకపోయేను. మీరు చెప్పిందే వేదం అనక, పెద్దలు చెప్పింది విని మారంఅనక వూరుకోండి. నలుగురూ నవ్వుతారు. ఇప్పటికే మన ప్రతిభ అందరికీ తెలిసింది.

రామేశం: ఔరా! నువ్వేనా మాటాడుతూంది! ఇంకా పెళ్లేనా కాలేదు. అప్పుడే వాళ్ళని వెనకేసుకొస్తున్నావు? కాలం మారిందిరా, మంచిరోజులు రమ్మంటే ఎలావస్తాయి?... కానీ—నీఖర్మ — బాగుచేద్దామన్నా, బాగుపడొద్దూ!

విశ్వ: అయ్యా బావగారూ! ఆవిగంగా జరిపిద్దాం! ఇంకా గాకలూ షోకలూ వున్నాయి కదా, ఇక్కడితో అయిందా? మమ్మల్ని కరుణించి వధూవరులని దీవించండి; మనయిద్దరి పరువూ నిలబెట్టండి.

రామేశం: అఘోరించండయ్యా. ఇక్కడ నామాట ఎవడు వింటాడు? చాలు. బుద్ధి వచ్చింది. ఇలాటి సంబంధం చేసి పోనీ వెయ్యినూట పదహార్లంటే ఆనూరు పదహార్లేనా యిప్పించండి!

పెళ్లికొడుకు: నాన్నా! కట్నం కావాలా? నాతో కలహం కావాలా?

రామే: హా! దేముడా! నామాట చెల్లకుండాచేశావే! కానీరా బాబూ! కానీ నీ యిష్టమే గానీ.

శివం : విశ్వనాథంగారూ! రామేశంగారు ఒప్పుకున్నట్టే మీపని కానీండి! అయ్యాశాస్త్రిలుగారూ తంతు జరగనివ్వండి; యింకా అయిదు నిముషాలే వుంది ముహూర్తానికి.

పురోహితుడు : వాయించండిరా! మేళాలూ...(అని మంత్రాలు చదువుతాడు) ... ఏదినాయినా... యీ బెల్లం—జీలకఱ్ఱా పిల్లతలమీద వుంచు... (ముహూర్తసమయంలో మంత్రాలుచదువుతూ) అక్షతలు వేయండి బాబూ! వధూవరులను... ఆశీర్వదించండి...(తర్వాత మంగళసూత్రధారణ. మిగతా తంతు జరిగాక, పెళ్లి వారందరూ విడుదులకు,అతిథులు, వారిళ్ళకూ నిష్క్రమిస్తారు; ఒక్క విశ్వనాథం తప్పించి. విశ్వనాథం ఆలోచిస్తూ...)

విశ్వ : అమ్మయ్య! ఈ రోజుల్లో ఆడపిల్లలని కలిగి వుండడం ఒకపాపం అయిందీ!...ఏం లోటు చేశామని అంత రసాభాస చేశారు! నలుగురులోనూ ఎంత అమర్యాద జరిగింది! ఛా! ఛా! అంత నీచులా? డబ్బంటే అంత అబద్ధం ఆడి పడిఛస్తారని అనుకోలేదు. (అని అనుకుంటూండగా పెళ్లికూతురు కమల వింటూ ప్రవేశించి)

కమల : నాన్నా ఎందుకలా, బ్రతిమాలు కున్నావు? అలా వాళ్లు అన్నందుకు పెళ్లిపొమ్మనవలసింది. పోనీ పెళ్లి అవకపోతే ఏదో నౌఖరీ చేసుకు బ్రతుకుదును, ఆపాటి చదువు చెప్పించేవు కదా. ......లేచి నేనే అడుగుదా మనుకున్నాను... కాని.. బావుండదని వూరుకున్నాను.

విశ్వ : ఏం చేస్తాం? వాళ్ల చెయ్యి మీద, మన చెయ్యి కింద.. అతడి కేదో దురాశపుట్టి అలా చేశాడు... అయినా కుఱ్ఱవాడు మంచివాడులా ఉన్నాడు! మన కడే కావాలి! ఇలాటివి పెద్దవాళ్లకు పుట్టే దుర్బుద్ధులే.

కమల : అయినా అంత ఆశా! అంత మోసమా? ఇలాటి మోసగాళ్లతో సంబంధం మన కెందుకు నాన్నా.. నా పెళ్లికిప్పుడేం తొందర!

విశ్వ : బావుంది తల్లీ! తండ్రిని! నా బాధ్యత నిన్ను ఒక యింటి దాన్ని చేసి పిల్లా పాపతో నువ్వు హాయిగా వుంటే చూసి ఆనందించడం! నీకు చదువు చెప్పించినంత మాత్రంలో ఆ పూచీ పోలేదు! జీవితానికి దారి చూపడం నా విధి తల్లీ!

కమల : అయినా నాన్నా నేను మొదటినుండి మీతో ఏమిటన్నాను? కట్నం యివ్వకుండా ఎందుకు పెళ్లి కాదో చూదామని అనలేదా? కాస్త ఆలస్యం అయితేనేం?... నాకు అసలు కట్నం యిచ్చి పెళ్లాడేనని చెప్పుకుందికి — సిగ్గు — అసహ్యం — నా స్నేహితులతో ఏం చెప్పేది! ఎలా మొహం ఎత్తుకోనేది!

విశ్వం : పరిస్థితులు తల్లీ — రోజుల మాహాత్మ్యం, లోకం పోకడ, వీటిబట్టి మనమూ నడుచుకోవాలి. మన ఆశయాలూ, భావాలూ, యిప్పుడెందుకు పనికొస్తాయి. ఈ రోజుల్లో కట్నం లేకండా, ఆడపిల్లకి పెళ్లి అవుతుందా? కట్నం పుచ్చుకొన్నవాడే మొగాడు! ఎంత ఎక్కువ పుచ్చుకుంటే అంత గొప్పవాడు!

కమల : అంటే— 'మగవాడు' అని అనిపించుకుంటే చాలన్న మాట! వాడి స్థితి, వంశం, గుణం, తాహతు, రూపం, ఆరోగ్యం, ఉద్యోగం, బాగోగులు యివేవీ చూడక్కర్లే దన్నమాట! ఎలాగో అలాగ ఎంతోకొంత డబ్బు పారేసి, ఎవడికో ఒకడికి అంటగట్టి, ఆడ పిల్లలని వదుల్చుకుంటే చాలన్నమాట! ఇదేనా నాన్నా కన్నకూతురిమీద తల్లిదండ్రుల అభిమానం? ఇదేనా బాధ్యత, ఆ తర్వాత దానిజీవితం ఎలవున్నా బాధ్యత? లేదా? అక్కర్లేదా?

విశ్వం : తప్పమ్మా! తప్పు! అలా అనకు! ఎవడికి తగ్గ సంబంధం వాడు చేస్తాడు. కోరి కన్నవాళ్లకి చెడు కోరతారా! కాని పరిస్థితులను బట్టి, అవకాశంలేక చేయవలసి వస్తూంది. మనం ఒక్కళ్లం, అడ్డితే యీ కట్నాలు పుచ్చుకోడం ఆగుతుందా? తరతరాలనుండి వస్తూంది. మీ అమ్మదగ్గర నే పుచ్చుకున్నాను—నీకూ యిస్తున్నాను... రేపు నువ్వుకూడా నీకొడుక్కి పుచ్చుకుంటావు.

కమల : అలా ఎన్నటికీ కాదు నాన్నా...ఏమిటీ కట్నం! ఎందుకీ కట్నం? దీనికి అర్థం వుందా? (ఉద్రేకంతో) ఆజన్మాంతం కష్టసుఖాల్లో, సుఖదుఃఖాల్లో పంచుకుంటూ, సంసారం చేయడానికి మరోచేయూతగా, ఒక సహచారిణిని యిచ్చి, మొగవాడి అవసరాన్ని తీరుస్తున్నది చాలక, యింకా కట్నం అనే పేరుగల లంచం కూడానా?...ఏం...పెళ్లి

అన్నది ఒక్క ఆడదానికేనా? మొగాడి క్కూడా కాదా? ఆడదానికే అది అవసరమా? మొగవాడికి కాదా? ఇద్దరూ ఒకటయి సంసారం సాగించడానికి కాదా? అటువంటపుడు ఒకళ్లని ఒకళ్ళు కొనుక్కోడం ఏమిటి? పోనీ అలా కొనుక్కున్నాక... కూడా, మొగాడికే అధికారం ఎందుకవాలి? కొనుక్కున్న వారిదే కదా అంతహక్కూ!

విశ్వ : నీవాదన, నారోదన ఎవరు వింటారమ్మా! ఇందాకనే చూశావు, డబ్బుపోగా—తిరిగి వాళ్ళ కాళ్లు పట్టుగోవలసి వచ్చింది!... అయినా దానికంతా రోజులు రావాలి తల్లీ! ఆవేశపడితే లాభంలేదు! ముఖ్యంగా... పరివర్తన, తల్లి దండ్రులలో రావాలి. పెద్దల్లో రావాలి. ఎందుకంటావా? సాధారణంగా, పెళ్లి కొడుకులకి ఆ వయస్సులో సహజంగా, పెళ్లి, పెళ్లాం, యీ మోజులోనే వుండి మిగతావి ఆలోచించే స్థితిలో వుండరు. కట్నాలూ, యివన్నీ ఆలోచించి, అడ్డు పెట్టదలచుకున్నా—అంత స్వతంత్రం వుండదు. తల్లిదండ్రులు చెప్పే కారణాలక్, వారి పరిస్థితులకీ ఎదురుచెప్పి నడిచే సాహసం వుండదు. అంచేత వారన్నట్టు తలొగ్గక తప్పదు! ఒకొక్కప్పుడు, యిష్టమయినపిల్లనే ఎంచుకో వీలుండదు పాపం! అంచేత వారిది తప్పు కాదేమో! కాబట్టి ఆ పెద్దల్లోనే పరివర్తన రావాలి. కాని వాళ్ళకు రాదు! కొడుకుల చదువుకి ఖర్చు అయింది కాబట్టి, ఆ సొమ్ము అంతా వడ్డీతోసహా కట్నంలో లాగుతామంటారు. లేకపోతే—వారికున్న ఆడపిల్లలకి కట్నాలివ్వాలి కాబట్టి, కొడుకులదగ్గిర కట్నాలు లాగి, ఆ నష్టం పూర్తి చేసుకుంటా మంటారు. లేకపోతే, పెళ్లికూతురుకి నగలుపెట్టాలికదా. ఆ కట్నండబ్బే సరిపెట్టాలి అంటారు. అదీ కాకపోతే, కోడలు యింటికి వచ్చాక దాన్ని పోషించడానికే యీ కట్నం అని కూడ అంటారు! ఎన్నైనా అంటారు. పూర్వం కన్యాశుల్కం, యిప్పుడు వరశుల్కం అని కూడా అంటారు. అంచేత మార్పు వచ్చేవరకూ అనుభవించ వలసిందే.

కమల : అతనలా కట్నం చాలదని అల్లరి పెట్టినపుడే పోలీస్ రిపోర్టు యివ్వవలసింది. అక్కడికి ఆకట్నం బాగా పుచ్చుకుణ్ణు.

విశ్వం : లాభంలేదమ్మా! దానివల్ల పెళ్లి ఆగిపోతుంది. పోలీసులు వాళ్ళని పట్టుగున్నా పట్టించామన్న అపనింద లోకంలో మనకి వుండిపోతుంది. ఇంక ఎవరూ మనతో సంబంధాలకి రారు. వాళ్ళకేం, యివాళ కాకపోతే రేపు మరో సంబంధం వస్తుంది. అదే ఆలోచించి అప్పుడేమీ అనకండా అడిగిన దేదో యిచ్చి, కార్యం జరగనిచ్చేను. అయితే ఏదైనాఉపాయం ఆలోచించి ఆ యిచ్చిన కట్నాన్ని తిరిగి రాబట్టలేమా—అని ఆలోచిస్తున్నాను.

కమల : అవున్నాన్నా... సరిగ్గా ఆలోచించావు? ఈ యిచ్చిన కట్నం ఎలాగయినా లాగెయ్యాలి. అదే మందు. ధైర్యంచేసి ఏదయినా వుపాయం ఆలోచించండి.

విశ్వ : నేనో ఉపాయం చెబుతా; సాహసంచేసి అలా చేశామా – ఒకటివుంది; అదనీ చేతిలోనే వుంది.

కమల : ఏమిటినాన్నా అది నువ్వేంచెప్పినా చేస్తాను. నాకాభయంలేదు.

విశ్వ : అయితే విను. (కూతురు చెవిలో చెబుతాడు.)

కమల : ఓ.కె. నాన్నా! ఈ ఆలోచన చాలా బావుంది. నేర్పుగా ఆడాలి! (ఇంతలో లక్ష్మి మరో యిద్దరు అమ్మాయిలూ అలంకరణ సామానులు చేత్తో పట్టుకొని వస్తారు.)

లక్ష్మి : ఏమిటి తండ్రీకూతురూ చెవులు కొరుక్కుంటు న్నారు?

విశ్వ : ఆ... ఏం లేదు. నీపని చూసుకుందూ! ఏమిటా హడావుడి... ఏంముస్తాబు చేయడానికి ఆవస్తువలన్నీ... నాకు చిన్న పనుంది వెళ్లొస్తా... (వెళ్లుతాడు.)

లక్ష్మి : నేచెబితే వింటారా యీకాలప్పిల్లలూ యింకా రేపు గదిలో పెడతామనగా యిప్పుడే ఆగది ముస్తాబు చేసేస్తున్నారు! అదేం సరదావో!

అమ్మాయి విమల: ఉండండి పిన్నిగారూ! మీకెందుకూ? ఏదీ ఒక్కరోజే కదా? కిటికీలకి తలుపులకీ కర్టెన్లు కడుతున్నాం. మంచి పటాలూ నిలువుటద్దం ఎక్కడ కొట్టాలో అక్కడ కొట్టొద్దా!

లక్ష్మి : అన్నీ చేస్తున్నారు గాని... తలుపులకి కర్టెన్లు కడుతున్నారా? కన్నాలు చేస్తున్నారా? తక్కువాళ్లు కారులే... ఏదో మీకు నచ్చితే వుంది దారి! (అందరూ నవ్వుతూ వుండగా అకస్మాత్తుగా కమల కెవ్వునకేక వేసి కిందన పడి

పోతుంది. లక్ష్మి మిగతావారూ ఏడుస్తూ ఆమె చుట్టూ మూగుతారు. ముఖంమీద నీళ్లూ అవీ జల్లినా కమల చలించదు. ఆఏడుపు విని పెళ్లి వారందరూ వస్తారు. విశ్వనాథం కొంచెం ఆలస్యంగా వస్తాడు.)

లక్ష్మి : అమ్మో! నాకేం దారమ్మో! నాతల్లీ!... యిలా చూడమ్మా!

విశ్వ : నువ్వొక్క ఘడియ ఉండు; అలా మీదపడకు; మొహం తిరిగి వుంటుంది. అంతే—

లక్ష్మి : అయ్యో కొంపమునిగితే ఉండమంటా రేమండీ! నాచిట్టితల్లి కేమయిందండీ! అయ్యో! నాకేనా వచ్చింది కొదర్రో!

విశ్వ : (దగ్గరగా వెళ్లి) అయ్యో! అమ్మా! కమలా! నేనమ్మ మీనాన్నని...అయ్యో పలకవేం! నే నేం చేసేది?...నువ్వు చూస్తూండు డాక్టరు గారిని తీసుకువస్తా...(వెళ్లును.)

లక్ష్మి : అయ్యో! దేముడా యిలా వచ్చిందేమి...... నోట మాటలేదు...చూపులేదు...ఏడు కొండల వాడా! నిలువు దోపిడిస్తాను బాబూ! నాతల్లిని రక్షించు, ఓ కనకదుర్గా నీదర్శనం, యిద్దరూ మధుపర్కాలతోనే చేసుకుంటా రమ్మా! చల్లగా చూడమ్మా!

విశ్వ : ఏదీ అలా జరగండి, డాక్టరుగారిని చూడనీండి.

లక్ష్మి : డాక్టరుగారూ! మీ పుణ్యం వుంటుంది. మా అమ్మాయిని బ్రతికించండి! (అందరూ నిశ్శబ్దంగా ఎదురుచూస్తూంటారు, అప్పుడేవచ్చిన డాక్టరు పరీక్ష చేసి)

డాక్టరు : విశ్వనాథంగారూ, ఏం చెప్పడానికీ నోరు రావడం లేదు, పీటలమీద పిల్లలకిది రావలసింది కాదు!

లక్ష్మి : (ఏడుస్తూ) అదేమిటి బాబూ! అయ్యో! అంతేనా! ఏం మాయ ముంచుకొచ్చిందమ్మ నా తల్లికి, ఉన్నట్టుండి! ఎలా బ్రతికేది! నన్ను తీసుకుపో! దేముడా! నాపిల్లని బ్రతికించు.

విశ్వ : డాక్టరుగారూ! మీరే దిక్కు. ఎలాగయినా బ్రతికించండి!

డాక్టరు: చేయి మించిపోలేదు—గాని—

విశ్వ : చెప్పండి డాక్టరుగారూ! మీ కాళ్లుపట్టుకుంటాను, మాప్రాణాలనయినా తీసుకొని అమ్మాయిని బ్రతికించండి. ఏం చేయమంటారు చెప్పండి.

డాక్టరు : ఇది చాలా విషజ్వరం...ఒక్కనిముషంలో వస్తుంది. సరిఅయిన మందు ఆ నిముషంలో యివ్వకపోతే, మరో నిముషంలో కొట్టేస్తుంది!

లక్ష్మి : అలా అనకండి డాక్టరుగారూ! అదేం మందో చెప్పండి, ఎలాగయినా తెప్పిస్తాం. పిల్లకన్నా ఎక్కువా?

డాక్టరు : ఆమందు నాదగ్గరే వుంది! కాని డబ్బుతో పని. వెయ్యి రూపాయలు ఖర్చుచేస్తే మీపిల్ల మీద ఆశ వుంటి!

విశ్వ : వెయ్యి రూపాయిలే! అయ్యో! ఎక్కడనుండి తేవడం? వున్నదంతా యీపిల్లకి కట్నానికి పెట్టేశాను. ఖర్చులకి వూరినిండా అప్పులు చేశాను. ఎవరిస్తారు? ఎలా వస్తుంది?భగవంతుడా నాపిల్లని బ్రతికించుకోలేనా?

లక్ష్మి : ఎలాగో అలాగ తెండి, తలేనా తాకట్టు పెట్టండి...నాతల్లిని చూస్తూ వూరుకుంటారా? అది బ్రతక్కపోతే నేనూ బ్రతకను!...

విశ్వ : ఎలా తెచ్చేదీ, ఎలా తెస్తాను? నాకూతురి నెలా బ్రతికించుకోగలను? అయ్యో! మీరెవరయినా నాపిల్లని బ్రతికించండి, సాయం చేయండి! మీకి జన్మాంతంచాకిరీ చేస్తాను. నా కూతుర్ని రక్షించండి! అయ్యో! నాకు కూతురయి ఎందుకు పుట్టిందో! చేతులో వున్నదంతా ఖర్చుచేసి సమయానికి చూస్తూచూస్తూ పిల్లని చేతులారా చంపుకోవలసిందేనా? ఛీ-ఛీ-ఎందుకీ జన్మ... నేనూ ఏదారో చూసుకుంటాను. (అని గుండె బాదుకుంటూ ఏడుస్తాడు.) డాక్టరుగారూ, పిల్లని బ్రతికించండి. తర్వాత యిచ్చుకుంటాను.

డాక్టరు : ఈ మందులు ఖరీదయినవి. ఇప్పుడు వాడేస్తినా మళ్లీ అవసరానికి వెంటనే డబ్బిస్తేనే గాని దొరకవు. అందికే నేనూ, వెంటనే అడుగుతున్నది. అయినా చూడండి.విశ్వనాథంగారూ! నాదొక సలహా! ఏమీ అనుకోకండి. మీ కూతురి ప్రాణం కన్నానా? కట్నం ఇచ్చేమని అంటున్నారు. ఆకట్నంగా యిచ్చిన సొమ్ము అవసరం నిమిత్తం అడగండి. దీన్ని గురించి కన్న కూతుర్ని వదులుకుంటారా? తర్వాత తాపీగా చూసుకోవచ్చు. ఇలా అన్నానని పెద్దలకి కోపం వస్తుందేమో! నాకు తోచింది మాత్రం చెప్పేను. ఇప్పటి కిప్పుడంత సొమ్మెలా వస్తుంది మరి? మీ యిష్టం.

విశ్వ : బావగారూ! నే నిలా అడగడం భావ్యంగా లేదు గాని, నా అవస్థ ఆలోచించండి మీ కాళ్ళు పట్టుకుంటాను. నా కూతుర్ని కాపాడండి!... మీ చేతుల్లో వుంది. మా యిల్లు నిలబెట్టండి, మా

ప్రాణాలు మీ దగ్గరున్నాయి. మీరే దేముళ్ళు. మీరే తల్లీ తండ్రీ. (అని బ్రతిమాలుకుంటూడు.)

రామేశం: ఇదేఁవిటండీ నామీద పడతారు! నేనొక్కడినే అవుపించానా? ఆ అప్పు మరొకరివ్వరా? ఆ డాక్టరు చెప్పడం, మీ రడగడం, యిదేదో మోసంలా వుంది. లేకపోతే యిలాటి రోగం నేనెక్కడా చూడలేదు, వినలేదు. ఒక్క నిముషంలో వెయ్యి ఖర్చుచేస్తే తగ్గిపోతుందా? విడ్డూరం! నమ్మదగ్గదేనా?

డాక్టరు: అయ్యా! మీ రెవరో గాని, మర్యాదగా మాటాడండి! నే నెవరో మీకు తెలియదు గాబోలు. మీరూ మీరూ ఎలా పోతే నాకేం గావాలీ. నాకేదో స్వలాభం వున్నట్టు మాటాడుతున్నారు. ఇదిగో నేపోతున్నాను.

విశ్వ: అయ్యో! అయ్యో! డాక్టరుగారూ ఆగండి! బావగారూ ఎంతమాటన్నారు. ఈయన మా వూరికల్లా గొప్ప డాక్టరు, ఆయనవల్ల కానిది మరెక్కడా ఎవరివల్లా కాదు. ఆయనకి తోచిన సలహా అభిమానం కొద్దీ యిచ్చేరు. లేకపోతే ఆయనకేం కావాలి! చూడండి, ఇలా ఆలోచిస్తూ కూచుంటే ప్రాణం నిలుస్తుందా? మీకు వడ్డీ కావలిస్తే యిచ్చుగుంటాను. నా పిల్లని బ్రతికించండి.

పెళ్లికొడుకు చంద్రం: నాన్నా! (కోపంతో) మీరూ మనిషేనా? అవతల చావు బ్రతుకుల్లో వుంటే, మీ రిక్కడ డబ్బు మూటకట్టుకు కూర్చుంటారా? ఎవరిదా డబ్బు! వారిచ్చినది. వారు అడుగుతూంటే, మీ రెవరు యివ్వనన డానికి? తేండి! అది నా డబ్బు! నాకిచ్చిన కట్నం!...ఆఖరికి మీరింత కర్కోటకులని, మీలో యింత అమానుషం వుందని అనుకోలేదు. మీలో మానవత్వం, హృదయం కూడా పోయింది యీ వెధవ డబ్బు మూలంగా. మీ కూతురికో, మీ కొడుక్కో యిలా జరిగితే—ఆలోచించుకోండి మీ కెలా గుంటుందో! ... ఊఁ...ఇయ్యండి...ఆ డబ్బంతా—(అని దగ్గరకు వెళ్ళబోతాడు.)

రామేశం: ఆఁ! ఆఁ! ఏమిట్రా...మీదకొస్తావు!... దూరం...ఇదిగో... తీసుకోండి-పోండి...ఇప్పుడిచ్చేరో లేదో...ఈ చేత్తో యిచ్చి, ఆ చేత్తోనే తీసుకుంటున్నారు!...బావుంది!... ఛీ...ఏం సంబంధం — ఏ మనుషులు! ... నే నొక్క నిముషం వుండను. ఈ యింట్లో—...ఆఖరికి నా వాడే నాకు శత్రువు అయేడు!

డాక్టరు: రామేశంగారూ! మీకేం మతిపోయిందా! ఇలా ప్రవర్తించడాని కిదా సమయం? కూతురొకటి కోడలొకటీనా? రండి ఇలారండి! పిల్ల బ్రతకాలని భగవంతుణ్ణి ప్రార్థించండి.

రామేశం: ఇంక తప్పుతుందా?

విశ్వ: ఇదుగో డాక్టరుగారూ, అడిగినంత సొమ్మునీ, నా మానాన్ని, పరువుని, ప్రాణాన్ని మీ చేతులో పెడుతున్నాను; వేగిరం చికిత్స కానివ్వండి; మా పిల్లని మా కివ్వండి. మీ ఋణం ఎన్నటికీ తీర్చుకోలేను, ఆలస్యం చేయకండి... (డాక్టరు, చికిత్స ప్రారంభిస్తాడు...కొంతసేపు పోయినాక కమల కదులుతుంది.)

లక్ష్మి: అదుగో! నా తల్లి కదులుతోంది డాక్టరుగారూ! మీరు దేముళ్లా వచ్చేరు. నా తల్లీ! కమలా!...ఏఁవమ్మా!...ఎలాగుంది! నేనమ్మా! ... నేను ... యిటుచూడు! ... నీకెంత వచ్చిందమ్మా!...ఆ ఏడుకొండలవాడి చలవ ... (అని సగం ఏడుపుతో, సగం ఆనందంతో అంటుంది.)

విశ్వ: అమ్మా! కమలా! యిటు చూడమ్మా!...ఎలా వుందమ్మా! ఎంత చేసిందమ్మా...నీకు — ... ఆఁ!...ఆఁ!...లేవకు-పడుకో ... డాక్టరుగారూ మీ ఋణం ఎన్నటికీ తీర్చుకోలేను; ఈ రోజు మీరు దేముడిలా రాబట్టిగాని—లేకపోతే, ఆ ప్రాణంతో సహా మా ప్రాణాలూ, పోను!

డాక్టరు: దానికేం లెండి! మీరు వెంటనే వెయ్యి రూపాయిలు ఖర్చు చేయగలిగేరు గాబట్టి. లేకపోతే ఎవరి చేతిలోనూ లేదు; ఆ భగవంతునిలో తప్ప. ఈ విషజ్వరానికి...పూర్వం మందే లేదు, యిప్పుడే కొత్తగా కనిపెట్టారు-అదృష్టవంతులం.

విశ్వ: అదుగో మా బావగారిక్కూడా సమయానికి డబ్బు యిచ్చినందుకు నమస్కారం చేస్తున్నాం. లేకపోతే కట్నం తిరిగి ఎవరిస్తారు!

రామే: నాదేముంది లెండి. నాలో మూర్ఖపు అభిప్రాయాలని మీ రందరూ కలిసి పారద్రోలేరు. కోడలు కూడా కూతురులాంటిదే అని, డబ్బుకన్నా ప్రాణం విలువ ఎక్కువని, అర్థంలేని కోర్కెలు తీరవని, అవమానం తప్పదనీ, ఒక పాఠం నేర్చుకున్నాను.

డా: అందరికన్నా ముఖ్యులు మీ అల్లుడుగారు! పరిస్థితులకి లొంగి, కట్నం యిష్టం లేకపోయినా పుచ్చుకున్నా, అవసరానికి తన హృదయాన్ని చూపెట్టి, తను చదివిన చదువును సార్థకం చేసుకున్నారు. ఇలాటి పరివర్తన అందరిలోనూ వస్తే కట్నం సమస్య త్వరలో పరిష్కారం అవుతుంది.

విశ్వ : డాక్టరుగారూ అమ్మాయికి మరి బెంగ లేదుకదా?

డా : ఇంక మీ అమ్మాయికి ఫరవాలేదు. ఒక అరఘంట పోయేక వేడిపాలు యివ్వండి. అంతే.

విశ్వ : పథ్యం ఏమయినా—

డా : అబ్బే! ఏంలేదు... నే చెప్పలేదూ. ఈ రకం విషజ్వరం కొద్దిఘంటల్లో అటో యిటో తేల్చేస్తుంది. బ్రతికిపోతే చాలు, మామూలుగా అన్నిపనులూ చెయ్యొచ్చు.

విశ్వ : మరేం లేదండి రేపే పునస్సంధానం. అంతా ఆయత్తం చేసుకొన్నాం-యిలా గయింది; పోనీ లెండి. పిల్లదక్కింది. అదే పదివేలు. మరో ముహూర్తం పెట్టుకుంటాం.

డా : అబ్బెబ్బె! అక్కర్లేదండి! సలక్షణంగా రేపా కార్యం జరిపించవచ్చు, పిల్లకేం భయంలేదు. నిర్బంధం అంతకన్నా లేదు.

విశ్వ : అంతా మీదయ. ఆ భగవంతుని కృప—మరే చిక్కూ లేదు. ఆ ముహూర్తానికే అనుకున్నట్టు జరిపించేస్తాం.

డా : శుభం.

విశ్వ : అమ్మాయి కమలా, మీరు ఉభయులూ డాక్టరు గారికి నమస్కారం చేయండి. (కమల, చంద్రం కలిసి డాక్టరుగారికి నమస్కారం చేస్తారు. అప్పుడు డాక్టరు యిందాక తీసుకున్న వేయి రూపాయిలూ వారి చేతులో పెడుతూ)

డా : దీర్ఘకాలం సుఖంగా కాపురం చేయండి! ఇదిగో యీ వెయ్యిరూపాయిలు, నా బహుమానం. (అదిచూసి అందరూ ఆశ్చర్యపోతారు)

చంద్రం : అదేమిటండీ! మేమిచ్చిందే తిరిగి యిచ్చేస్తున్నారు?

డా : అవున్నాయనా! కట్నం తీసుకున్నా దాన్ని నువ్వు ఆశించలేదు. కట్నం లేకుండా కన్యాగ్రహణం చేశావు. అందికే నీకిది నా కట్నం. నిజానికి కమలకి ఏమీ చెయ్యలేదు; యిచ్చిన కట్నం యీ విధంగా తిరిగి తీసుకుందికి, కట్నం తీసుకోకూడదు అని చెప్పడానికి, యీ నాటకం ఆడేము. మేం అనుకున్నట్టు మీలో ఆ పరివర్తన వచ్చింది: అందికే యీ రహస్యం బయట పెట్టేము. ఇహ, యీ సొమ్ము తాలూకూ, విలువ, వినియోగం, మీ యిష్టం.

చంద్రం: (ఆ సొమ్ము చేతబుచ్చుగొని, తండ్రితో) నాన్నాగారూ! ఇదిగో నన్ను అమ్మగా వచ్చిన వెయ్యి రూపాయిలు; కట్నం రూపంలో వుంది ఇది తీసుకోండి, నేను మీతో రాడానికి— కట్నం తీసుకోకండా పెళ్లాడడానికి, మీ దగ్గర స్వతంత్రం లేదు కాబట్టి, కట్నం తీసుకున్నాక —కొనుక్కున్నవారి ఆజ్ఞ లేకుండా, రాడానికి అంతకన్నా స్వతంత్రం లేదు... కని, పెంచి, చదువు చెప్పేక కట్నం తీసుకోందికి, మీకెంత ...హక్కు వుందో—మీ దగ్గర కొన్నాక నన్ను వినియోగించుకుందికి వారికీ అంత హక్కు వుంది.—మన దేశంలో యువకులను పెద్దలు అలా తయారు చేసేరు. అందుకు నేనే నిదర్శనం.

రామేశం: నాన్నా! నాలో కలిగిన యీ చైతన్యం వలన నోట మాటరాడం లేదు! నా జన్మలో ఒక మంచిపని చేసే అవకాశం లభించింది. నాకిక స్వార్థంలేదు; నాకా డబ్బు వద్దు. కొడుకు కావాలి. కొడుకుగా నాకు—భర్తగా ఆమెకి— అల్లునిగా ఆయనకి—ఒక పౌరునిగా దేశానికి—నువ్వుంటే, నాకదే పదివేలు.

కమల: (ఆ డబ్బు అందుకొని తండ్రిదగ్గరకు పోయి:) నాన్నా! కని పెంచేవు, చదువు చెప్పించేవు! ఇల్లూ వళ్ళూ, గుల్ల చేసికొని, ఆఖరికి నా సుఖం కోసం యీ కట్నం యిచ్చి నువ్వు కష్టపడ్డా, త్యాగం చేశేవు. అటువంటి ప్రేమకన్నా కావలసింది ఏది!...ఇదుగో నువ్విచ్చిన కట్నం తిరిగి తీసుకో నాన్నా...కట్నం లేకుండా పెళ్లాడదా మనుకున్నాను. నేననుకున్నది జరిగింది. జయించాను.

విశ్వ: మనసారా అనుకోవాలి, పట్టుపట్టి సాధించాలి గాని అనుకుంటే జరగనిది ఏముంది తల్లీ! నిర్బంధం మీద మరతుపెట్టి బాధించి బలవంతాన్ని తీసుకొంటే కట్నంగాని, లేకపోతే అది మా సంతోషమే అమ్మా! నీదగ్గరే వుంచు. అనుభవం లేని మీకు కష్టసుఖాల్లో పనికి వస్తుంది.

కమల: వద్దు నాన్నా!...కష్టసుఖాల్లో మీవంటి వారి ప్రేమ, అభిమానం, తోడు వుండాలి గాని, డబ్బుతో ఏం పని? మీ డబ్బు మీ దగ్గరే వుంచండి.

విశ్వ: ఏంతల్లీ! అప్పుడే వేరయిపోయావా? అలా అనకు. నాదీ నీది ఏమిటి? అంతా మనదే! ఫరవాలేదులే: కట్నంకాదు. అది బహుమానం! సరా. (అందరూ నవ్వుతారు. కమలా, చంద్రం అందరికీ నమస్కారం చేస్తారు. అందరూ వారిని ఆశీర్వదిస్తారు.)

(తెర)

# భారత సంవిధానం ఇలానే ఎందుకుండాలి?

శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు

భారత సంవిధానం (constitution) యిలా వుండవలసింది కాదంటూ కొందరి వాదం. ఈమధ్య సుప్రీంకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ మెహర్ చంద్ మహాజన్ సంయుక్తాత్మకమైన రాజ్యాంగ వ్యవస్థ(ఫెడరల్ పద్ధతి) వల్లనే హిందూదేశంలో కావలసినంత ముప్పు కలుగుతోందనే అభిప్రాయాన్ని కొన్ని పత్రికలో వెల్లడించారు. ఇప్పుడు పెక్కు తెగలు తెగలుగా జనసామాన్యం విడిపోయి స్వార్థాన్నాలోచించటం ఆ సంయుక్తాత్మకమైన రాజ్యాంగ లక్షణాల చెయిదమే ననే భావం వెలిబుచ్చారు. సార్వభౌమాత్మకమయిన రాజ్యాంగంవుంటె బాగుండేదని అనగా unitary state గా వుంటే బాగుండేదని సూచించారు.

ఈ సంయుక్తాత్మక లక్షణయుతమైన సంవిధానం భారతదేశంకొఱకు ఎందుకువ్రాశారో తెలుసుకోటానికి దానిని ఎలాంటి పరిస్థితుల్లో రచించారో జ్ఞాపకం చేసుకోవలిసిన అవసరం వున్నది. ఆ పరిస్థితుల్లో మరొకరకమైన సంవిధానం తయారుచేసే అవకాశం లేనేలేదన్నట్టు అర్థమవుతుంది. నిజానికి భారత సంవిధానం, ఆనాటి పీడితప్రజాబాహుళ్యంలోని రసావేశానుసరణంగా, వారితృప్తికోసరం, వారి శాంతి కోసరం భద్రమైన రాజ్యపరిపాలనంకోసరం తయారు చేయబడ్డ అమూల్యమైన అధికార పత్రం.

1914 లో మొదటి ప్రపంచయుద్ధం వచ్చి బ్రిటిషువారి నుఱ్ఱూతలూగించే సందర్భంలో బ్రిటిషు వారు తలవంచుతున్నట్లె వంచి హిందూదేశస్థుల్ని, యీ దేశంలో అప్పుడున్న సంస్థానాధిపతుల్ని సహాయంకోసరం ప్రాధేయపడ్డారు. అడిగిన సహాయం మహోదరంగా ఇవ్వబడింది; సంతోషంగా తీసుకో బడింది కూడాను. కొందఱు బ్రిటిషు రాజ్యాంగవేత్తలు (పార్లమెంటులోనివారు మాత్రం కాదు) ఇండియా పట్ల బ్రిటిషువారి దృక్పథం మారిందన్న ఉపన్యాసాలిచ్చారు లండన్‌లో. యుద్ధం 1918 లో అయిపోయింది. ఫలితం ఏమిటి అని దేశస్థులు ఆలోచించసాగారు.

యుద్ధానంతరం కెనడా మొదలైన రాజ్యాలకు అధినివేశరాజ్య ప్రతిపత్తి (డొమినియన్ స్టేటస్) ఇవ్వబడింది. ఐతే ధన, ధాన్య, బలసంపత్తినంతా యుద్ధకాలంలో దానంచేసిన ఇండియామాత్రం మొదటి మాదిరే వుండిపోయింది. యుద్ధమయిందిగదా మీరేం చేశారని మన నాయకులు బ్రిటిషువారి నడిగారు. "ఓ! దానికేం—బ్రహ్మాండమైన చట్టాన్నొకదాన్ని తయారుచేసి పంపుతున్నాం చూసుకోండ"న్నారు. ఆ చట్టంపేరు "మాంటెఫర్డు యాక్టు"—ఇంతే కాద న్నారు. ఇకనుంచీ మీదేశాన్ని పరిపాలించటానికి మా దేశంలో శిక్షణపొందటానికి ఐ. సి. ఎస్. పథకం కూడ తయారుచేశామన్నారు.

మాంటెఫర్డ్ యాక్టు ఒక భయానకమైన శాసనం. అదే అప్పటి మన సంవిధానం. దానినే 1919-వ సంవత్సరపు ఇండియా చట్టమని మనం వ్యవహరిస్తున్నాం. దానిలోని పద్ధతంతా ఇండియాకు అధినివేశ రాజ్య ప్రతిపత్తి ఇవ్వటానికి బ్రిటిషువారు ఉద్యుక్తులైనట్టె ఉండేది. కాని ఆమాట ఉచ్చరింపబడటం గాని ఆ ప్రతిపత్తికి కావలసిన అవసరాలుగాని అందులో కనపడేవికావు. దానిప్రకారం అడ్వైజర్లు, మినిస్టర్లు కూడ ఉండేవారు. వీరి అధికారావధులు నిర్ణయించటం ఒక కమిటీద్వారా జరిపించి అడ్వయిజర్లకు ముఖ్యమైన శాఖలూ, మినిస్టర్లకు డబ్బు, పరిపాలనాక్రమం మినహాయింపబడి ఇతర చచ్చు శాఖలూ, ఏర్పరచారు. అడ్వయిజర్లు ఎలా నడుచుకోవాలో ఆదేశం ఆంగ్లదేశంనుండే దిగుమతి అయ్యేది.

మరి శాసనసభల్లోని సభ్యులు మాత్రం హిందూ దేశస్థులేగనక లేనిఆశ ఒకటి ఉత్పన్నమయినట్టు అవుపించేదా రోజుల్లో. ఐతే, ఆశాసనసభల్లో సభ్యులు ఏ నిష్పత్తిలో ఉండాలనే విషయాన్ని తేల్చటానికి "లార్డు సౌత్ బరి" అనే మహానుభావుని అధ్యక్షత క్రింద ఒక కమిటీ వేయబడింది. ఈకమిటీ శోచనీయమైన ఒక మహాకార్యం చేసింది; మీ దేశస్థులంతా మూడు రకాలు అనుకోమంది—హిందువులు, ముస్లిములు,

క్రిష్టియన్లు. మేము ఇంకా రెండిచ్చాం కలుపుకోమంది: యూరోపియనులు, ఆంగ్లో-ఇండియనులు. మరీ మీకు మూడై మాకు రెండైతే అంతన్యాయం గాలేదు. మిమ్మల్ని మళ్లీ మూడుభాగాలు చేసుకోమంది. భూస్వాములు (రావు బహద్దూరు లనుకోవచ్చు), విశ్వవిద్యాలయాలు, తేయాకు పండించేవాళ్లు. ఈ ఎనిమిది రకాలవారిని కూడిక చేసి సభలో కూర్చోపెట్టే నిష్పత్తిని నిర్ణయించింది. ఇది నాంది—మతవైషమ్యం-కులవైషమ్యం-వర్గవైషమ్యం ఒక సంస్థలాగా తలెత్తి విజృంభించింది. ఇండియాలో ఆనాడు చూపించిన కులాలవారి, తెగలవారి ప్రాతినిధ్య స్వత్వం కుల మతవైషమ్యాన్ని లేవగొట్టి అంతులేని శక్తినిచ్చి పోషించింది. 1919 తర్వాత యిప్పటికి నలభయి సంవత్సరాలయింది. ఆ వైషమ్య రాక్షసి నవయౌవనందాటి నిండుయౌవనంలో వుందవచ్చు. నవయౌవనంలోనే పాకిస్తాన్ విడగొట్టటానికి కారణమైంది. 1919, 1935 సంవత్సరపు ఇండియా చట్టములు కాక యిప్పుడు యిండియా సంవిధానం వచ్చింది కనక గాని, ఆ చట్టాలే మన రాజ్యం గాన్ని యింకా పరిదిద్దుతున్నట్టయితే యీ నిండు యౌవనంలో ఆ రాక్షసి యింకా యేం చేసేదో !!

ఈ 1919 వ సంవత్సరపు చట్టం నాయకుల్లో జుగుప్స కలిగించిందిగాని సామాన్య జనానీకంలో నిషా పుట్టించింది.. నిష్పత్తిప్రకారం తనకు తనవారికి సభ్యత్వం చూసుకోంటం ఒక్కొక్క వ్యక్తికి భలె సరదా అయింది. ఈ వైషమ్యం ఉద్యోగాలివ్వటంలో గూడ వుండాలన్నారు. దేశప్రజల చురుకుతనం యీ మార్గాన చూపిస్తే అల్లుకుపోకలిగినట్లు బ్రిటిషువారు గుర్తించి, ఉద్యోగ విషయాల్లోనే కాక చదువు సంధర్భాల్లోను విశ్వవిద్యాలయాల్లోనూ కూడ అలాటి నిష్పత్తుల్ని అమలుజరపటం మొదలుపెట్టారు. కాలచక్రం తిరుగుతున్నకొద్ది కొత్తజనాభా ఎక్కివస్తున్నకొద్ది ఉగ్గుపాలతోపాటె యీ మత, కుల, వర్గ వైషమ్యాలనండే లేదా ఫక్తు వైవిధ్యమే ననండి శరీరంలోని ప్రత్యణువుకు ఎక్కిపోవటం మామూలయింది.

నాయకు లెవరన్నా "ఏమిటి మీరు చేసిన ఘనకార్యం మాకోసం?" అనిబ్రిటిషువారి నడిగితే ఐ సి యస్ పథకం వుందిగదా అనేవారు. దానిప్రకారం బ్రిటన్‌లో ఒక శిక్షణకేంద్ర ముండేది. దానిలో మెరికల్లాంటి విద్యావేత్తల్ని చేర్చి శిక్షణ యిచ్చేవారు. వారు చాలా ఎత్తయిన స్థితిలో వున్నవారు అనేవిషయం మర్చిపోగూడదు. సామాన్యప్రజల పరిస్థితి చాలా క్రిందుగా వుండేది వారిస్థితితో పోలిస్తే. వారి శిక్షణ అయింతర్వాత ఇండియాకు వారిని పంపటం జరిగేది. వీరు చెయ్యవలసినపని గమనించండి—బ్రిటిష్ పరిపాలనా విధానాన్ని ఏవిధంగా చలాయించటం మూలంగా (ఇండియాలోనే) బ్రిటిషు పార్లమెంటులో ప్రశ్నల పరంపర రాకుండా వుంటుందో సూచించటం వాళ్ళవిధి. అందుకే అసలు వాళ్లు యిక్కడికి వచ్చిరావటమె కలెక్టర్లుగా వచ్చేవాళ్ళు. వీరు సూచనలు చేసేటప్పుడు సర్వ సాధారణంగా వీరి మనసుల్లో యిండియా ప్రజల పరిస్థితులు ఒక్కటేకాక, వీరు ఐ సి యస్ శిక్షణ పొందిన రోజుల్లో బ్రిటిషు పార్లమెంటు సభ్యుల మనస్తత్వం ఎక్కువ పాళ్ళలో అనుసంధానమై వుండేది. ఎందుకనంటే వీరి కది వరవడి. అది కీలకం. వీరివల్ల మనదేశానికి యథాతథంగా నష్టం కలిగిందని చెప్పటం తప్పుగాని, బ్రిటిష్ పరిపాలనా సౌష్ఠవానికి ఇండియాలో వీరిసేవ చెప్పరానంతగా వుపయోగపడ్డది అనేమాట నిజం. 1942–47 మధ్య వీరు తమ పరిస్థితి గమనించి మార్పు తెచ్చుకున్నట్టు చెప్పవచ్చు.

అనర్థం ఎక్కడ బయలుదేరిందో విచారించటం మనకు చాలా అవసరం. అందుకె 1919 నుంచి జరిగిన కథ జ్ఞాపకం చేసుకోక తప్పిందికాదు. మనసుల్లో భిన్నభావం, చోరవ మూలకంగా అధికారవాంఛ యివన్నీ కలగటానికి 1919 వ సంవత్సరపు చట్టం ఎలా కారణభూతమైందో గమనించాలి. ఆ తర్వాత కూడ ఆ పునాదులే ఉపయోగించబడ్డాయి.

1918 లో యుద్ధం విరమించబడ్డా ఇండియా మాత్రం మొదటి మాదిరె వుండిపోయింది. మహాత్మా గాంధి సత్యాగ్రహంవల్ల ఫలితం కలగలేదు. అది కాదని సహాయ నిరాకరణోద్యమం అన్నారు. విపరీత ఫలితం వచ్చింది. యుద్ధంకోసరం ఎక్కువ చేసిన బ్రిటిష్ సోల్జర్ల సంఖ్యను అలానే వుంచేసి శాంతి రోజుల్లో అల్లర్లణచటానికనే పేరుతో ఇండియాలో సైన్యాన్ని మకాం చేయించేవారు. ఇదేమిటంటే, ఇండియా శాంతి భద్రతలు కాపాడటం శ్రీ జార్జి చక్రవర్తిగారి విధియై యుందికదా? 1921 నాటికి మిలిటరి పద్దుక్రింద ఇండియా బడ్జెటులో—కొద్దిగా—82 కోట్ల రూపాయలు నమోదయింది. నాయకులు మాత్రం తమదేశం రైతుల రక్తాన్ని చూశా రాపద్దులో. జలియన్ వాలాబాగ్‌లో ఒకే ద్వారంవున్న ఒక పెద్ద ఆవరణలో పిల్లలు గర్భిణీస్త్రీలుసహా సమావేశమయినప్పుడు, జనరల్ 'డయ్యర్' అనే ఒక 'డాన్‌క్విక్సోటు' లాంటి

మిలిటరీమూర్తి శతఘ్నులు కాల్పించి 379 చావులు, 1208 శరీరాలకు గాయాలు కలుగజేశాడు—తనంత యోగ్యుడింకొకడు కలడా మరి?

ఇవన్నీ ఎగతాళికి వ్రాయటల్లేదు. ఇవన్ని చదువుతుంటే ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో ఉద్రేకం కనిపిస్తోందో లేదో గమనించండి. అలాటప్పుడు ఆనాటి అశేషజనానీకంలో ఎలాంటి రాజకీయ చైతన్యం వచ్చివుంటుందో వూహించటం ఇప్పటి యీ వ్యాసాన్ని అర్థంచేసుకోటానికి అత్యవసరం.

ఆ రోజుల్లో టర్కీతో బ్రిటిష్‌వారికి గల సంబంధం హిందూదేశంలోని ముసల్మానులకు కూడ కోపకారణమైంది. ఇలా నానాటికీ పెరిగిపోతున్న రాజకీయచైతన్యం—అంతకంటె రాజకీయ వైషమ్య మందాం—"త్రాగిన రొమ్మే గ్రుద్దును రా" అని బ్రిటిష్ వారిమీద కావలసినంత జాతి వైషమ్యాన్ని ప్రబలింప జేసింది.

ఇది గమనించి బ్రిటిషువారు పథకాలు ఆలోచించారు. సైమన్‌కమిటీ వేశేశాము — మీ అరచేత కనపడేది స్వర్గమే నన్నారు. మీకు యీ 1919 వ సంవత్సరపు చట్టంకాదు ఇంకో మంచి సంవిధానాన్ని (Constitution) తయారుచేస్తున్నామన్నారు. దాంతోపాటు ఇండియాలో పరిపాలనాధికారాన్ని మీ హస్తగతం చేస్తున్నామన్నారు. ఏదీ! చెయ్యండి చూస్తాం. నిజానికి మాకదే కావాలి అన్నారు నాయకులు. సామాన్య పౌరులు కాస్త చొరవగలవాళ్లు తీయటి కలలు కన్నారు—స్వార్థం చిత్రించుకొంటూ. స్వార్థకాంక్ష ఎక్కువయింది. 1933 లో మొదలుపెట్టిన ప్రయత్నం 1935 వరకూ యీ స్వార్థాన్ని పెంచి 1935 వ సంవత్సరపు ఇండియా చట్టంగా అవతరించింది.

ఈ 1935 వ సంవత్సరపు ఇండియా చట్టంలో 1919 వ సంవత్సరపు ఇండియా చట్టంలోని ఉపోద్ఘాతం మాత్రం వుంచబడింది. మిగతాదంతా క్రొత్తసేకరణమే. ఫెడరల్ విధానం తద్వారానే తెచ్చిపెట్టబడింది. ఎక్కడనుంచో తెచ్చి యీ ఫెడరల్ విధానాన్ని ఇండియాపై రుద్దారని కొందరి భావమేమో. అది సరియైంది కాదు. దీన్ని ప్రత్యేకించి అప్పటి ఇండియా పరిస్థితులకు తగ్గట్టు రచించవలసి వచ్చింది. ఇది బ్రిటిష్‌వారి చేతుల్లోంచి పాలనాధికారాన్ని హిందూదేశస్థులకు యివ్వటం కోసరమె తయారుచేయబడింది. ఐతే అది తయారుచేయబడింది మాత్రం బ్రిటిషువారిచేత.

అందులో కొన్ని అధికారాలు రాష్ట్రసభల కన్నారు. కొన్ని పార్లమెంటుకన్నారు. చాలాభాగం మాకే వుంటయి సుమా అన్నారు. ఏ ఏ అధికారాలు హిందూదేశస్థులకు యివ్వాలో, ఏవేవి యిచ్చినట్టుగా కనపడి ఇవ్వకూడదో, ఏవేవి ఎంతవరకు తరగవేసి ఇవ్వాలో అన్నీ సునిసిత బుద్ధులచే ఆలోచించబడి చర్చించబడి నిర్ణయింపబడ్డయి. ఒకేఒక ఆదర్శం మనసులో పెట్టుకున్నారు. ఫలాని అధికారం ముందుంచుకొని యిది యెవరికివ్వాలి అని ప్రశ్నించుకోవటం. ఘనమయిందయితె బ్రిటిష్‌వారికి (గవర్నరుజనరల్‌కు)—లఘువయిందయితె దేశస్థులకు. ఆ యిచ్చే అధికారాలు, గవర్నర్ల నియామకంమూలంగా, పెట్టెల్లో పెట్టిబంధించి తాళంచెవి చేతికిస్తూ తిరక్కుండా ఒకపక్క పట్టుకున్నట్టుగా వుండేవి. ఈవిధంగా దేశాన్ని రాష్ట్రాలు రాష్ట్రాలుగా విభజించి, ఆయా శాసనసభలకు, ఆయా ప్రభుత్వ ప్రతినిధులకు యథోచితంగా—కాదు యథేష్టంగా—అధికారాలు పంచారు.

తర్వాత తర్వాతగాని యీ సంవిధానం తయారుచేసిననాటి దుర్మార్గం అవగతంకాలేదు. అది తెలిసింతర్వాత, బ్రిటిషువారి చాకచక్యానికి ప్రవీణులు విస్తుపోయారు. వారి ప్రజాస్వామ్య సిద్ధాంతపద్ధతులు బాగా నచ్చినమాట వాస్తవమె. ఐతే ఇండియాలో వారి ప్రవర్తనే వ్యతిరేకంగా వుండేది. ఇంగ్లండులో బ్రిటిష్ పౌరుణ్ణి బ్రిటిష్ నిరంకుశాధికార్లు పరమపవిత్ర పూర్ణహృదయునిగా ఎంచేవాళ్ళు. ఇండియాలో మాత్రం ఆఫీసర్లు ప్రజల్లోకి పోసి "ఆర్డర్ ఆర్డర్" అని భయపెట్టేవాళ్ళు. ప్రభుత్వమంటే ఏటిటోపీ గుర్తుకొచ్చేది. శాసనం చేశారంటే పోలీసువచ్చి బెదిరించినట్టు అనిపించేది. శారదాబిల్లు పెట్టబోతున్నారన్నప్పుడె కన్యాదాతలు పోలీసును చూసి మాట్లాడుకునేమాటలు ఆపటం లీలగా నాకు యింకా జ్ఞాపకంవస్తోంది. దావా వేస్తానని యెవరన్నా బెదిరిస్తే, పోలీసు—తుపాకులు మెదడులో ఆడేవి. అమీనాసంగతి యెవరూ ఎరగనే ఎరగరేమో. ఈవిధంగా శాసనాధికారం, న్యాయాన్యాయ విచక్షణాధికారం, "లా అండ్ ఆర్డరు", విడగొట్టినట్టు 1935 వ సంవత్సరపు చట్టంద్వారా తెలుస్తున్నా మొత్తం అన్ని మూలలా సర్వతోముఖంగా బ్రిటిషువారి నిరంకుశాధికారం వెలార్చుతూవుండేది. మూలమూలలా ప్రభుత్వమంటే భయం, కేంద్రప్రభుత్వమంటే (గవర్నరు జనరలన్నమాట) మహాభయం ఆవృతమై వుండేవి. రాష్ట్రప్రభుత్వాల్లో తమకు సంబంధించిన దేశస్థుల్ని మంత్రు

లుగా చూస్తూనే వుండేవారు ప్రజలు. ఐతే వీరుకూడ బ్రిటిష్‌వారి కుట్రలలో భాగస్థులనన్నా అనుకునే వారు. లేదా వీళ్ళకేముంది వట్టి మనలాటివాళ్ళని చులకనన్నా చేసేవాళ్లు. తర్వాతి తర్వాత మనమంత్రులు రాజీనామాల నిచ్చారు. ఇది బ్రిటిషు నిరంకుశాధికార్లకు ఎంత శుభావకాశమో అయింది. 93 వ శెక్షన్ను ఉచ్చాటనంచేసి మొత్తం శాసనాధికారం గవర్నరుజనరలే హస్తగతం చేసుకున్నాడు. విజ్ఞులు ఆలోచించండి. ప్రజలు, కేంద్రీకరింపబడ్డ ప్రభుత్వాన్నేనా కోరుకునేవారే ఆ రోజుల్లో? సార్వభౌమాత్మకమైన రాజ్యాంగం (Unitary System of State) తయారుచేయటానికి ఆ ప్రజలు ఒప్పుకొనేవారంటారా ? అసలు ఆ ప్రజల్లోనుంచి పైకివచ్చి ఆ ప్రజలకోసం తయారుచేస్తున్న సంవిధానాన్ని ఆ ప్రజల కిష్టం లేకుండా తయారుచెయ్యాలని ఎవ రనుకుంటారు? ఆ పరిస్థితుల్లో అధికారం వికేంద్రీకరింపబడి ఫెడరల్ సిద్ధాంతమే కోరుకోబడిందంటే అందులో అనౌచిత్యం గాని, రసాభాసంగాని యేమీ ఉన్నట్టు తోచదు.

1942 నుంచి 1947 వరకూ బలీయమైన ప్రజావాంఛ ఉద్యమరూపం దాల్చించికూడాను. జనం అసంఖ్యాకంగా జైళ్ళకు వెళ్లారు. ఉద్రేకపరు లెవరన్నా ఉంటే ప్రభుత్వానికిచెందిన ఆస్తికూడ పాడుచేసి పిశాచానందాన్ని పొందారు. వాళ్ళనిపట్టుకోలేక ప్రభుత్వం సాముదాయకజరిమానాలు వేశామని ఆ నేరం జరిగిన ఊళ్ళో అందరిదగ్గరా అపరాధం వసూలుచేసింది. ప్రజలమీద ఆ ప్రభుత్వానికి అంత నమ్మకం-అంత అనురాగం-అంత చనువు అన్నమాట. అందుచేతనే కేంద్రీకరింపబడ్డ ప్రభుత్వాన్ని ఆప్రజలు కోరరు.కోరలేదు.ఆఫీసుల్లోకి వెళ్లి వ్రాయసగాళ్ళకు మీరూ ప్రజలేనయ్యా అని చెప్పవలసివచ్చింది. "నువ్వెవరో నీకు తెలుసా ఐసియస్ గారి మనసా" అని తెల్లవాళ్ళయితే ఇంగ్లండు జ్ఞాపకంచేసి వెళ్ళమని, దేశస్థులయితే ఇక్కడివా రన్న సంగతి మర్చిపోకండని హెచ్చరిక లిచ్చారు. సునిశిత బుద్ధి, గ్రహణశక్తి కలవారుగనక కొందరు వశం తప్పిందని తమదేశం వెళ్లిపోవటానికి తీర్మానించుకున్నారు - కొందరు తమదేశం తమదిగా చేసుకుని తాము తమవారుగా మారటానికి నిర్ణయించుకున్నారు. 1947 వచ్చేటప్పటికి ఉన్న స్వదేశస్థులయిన ఐసియస్ ఆఫీసర్లు అవసరంలో అదనుకు వచ్చారు. కాంగ్రెసువారిని పూర్వం కాల్పించిన ఐసియస్ ఉద్యోగులే 1952 తర్వాత గొప్ప

పదవులు నిర్వహించి గవర్నర్లుగాకూడ స్వతంత్ర భారతంలో పనిచేశారంటే వారి శక్తిసామర్థ్యాలు నిరూపించుకోగలిగారు కనకనే.

ఏతావతా చెప్పవచ్చే దేమిటంటే, ఇండియా సంవిధానం తయారుచెయ్యవలసిన పరిస్థితి వచ్చినప్పుడు అప్పటి వాతావరణం ఎంత ఉద్రేక పూరితంగా వుందో జ్ఞాపక ముంచుకోవాలని. బ్రిటిషువారి ఆదర్శాలని, వ్యవస్థాక్రమాలనీ పోసుచేసి అనుకరించి సంవిధానంలో చొప్పించు కున్నామని గాని వారికి ఓడిపోయి వారినె గురువులు గా ఆమోదించామని గాని అపోహపడకూడదు. సుదీర్ఘ కాలం యిండియా రాజకీయవేత్తలు శారీరకంగా మానసికంగా బ్రిటిషువారి అధికారంవల్ల, కూటనీతి వల్ల కలిగిన సంకుల సమరంలో నలిగి అసాధారణమైన రసావేశాన్ని పొందిన రోజులవి.

అటువంటి సమస్య లన్నీ తీర్చాలంటే ఎలా తీర్చాలనేది సమస్య అయింది. ప్రజాస్వామ్యమైన రాజ్యమే కావాలనే విషయం నిర్వివాదాంశం: అలాటి రాజ్యాలు ప్రపంచంలో చాలాచోట్ల వున్నయి. అయితే గబుక్కున ఒక సంవిధానాన్ని యెక్కడ నుంచో చూచి నకలు వ్రాసుకొనివస్తే సరిపోయేట్టు తోచలేదు. విషాదాంత నాటకం చూట్టానికి వెళ్లిన విమర్శకులు మొదటి రంగంలోని మాటలో చివర రంగపు కథ ప్రతిఫలిస్తోందా లేదాఅని చూస్తున్నట్టు పాకిస్తాన్ విభజనంమాసి యీ విషాదాంత నాటకం ఎలా అంత మలోనని ఆర్తులై దేశప్రజలు చూస్తున్న మాట వాస్తవం. అప్పట్లో యింకొకరి సంగతి వినే ఓపిక ఎవరికీ లేదు. ఎవరికోసం వారు తగలడే యింట్లో సామాన్లు రక్షించటానికి ప్రయత్నిస్తున్నారు. మా రాష్ట్రం సంగ తేమి టని ఒక రన్నారు. పాకిస్తాన్ ప్రపంచంలో యేర్పడివంత మాత్రాన ఇక్కడి మైనారిటీలం మమ్మల్ని చులకన చేస్తారా అని మరికొందర అన్నారు. పాకిస్తాన్‌నుంచి వచ్చే అశేష సంఖ్యాకులైన కాందిశీకులు వేదనావృతమైన ముఖాలు చూపించి గుండెలు కదిపారు. మామతం మా టేమి టన్నారు కొందరు. హిందూకోడు మార్చి మా స్వత్వాలు ఎక్కువ చేస్తారా లేదా అని మహిళామణు లన్నారు. అలా అలా అంతా ఏదో ఒకటి అన్నారు. ఈఉద్ధృత సంఘటనలకు పర్యవసానమే సంవిధానం. ఆ ప్రజల రసావేశానికి సంజాయిషీయే యిప్పటి సంవిధానం.

కాగా ఒకవేళ యెవరన్నా ఫెడరల్ రాజ్యం వద్దు; యూనిటరి రాజ్యం కావాలని అనేవా రున్నట్లయితే అది సాధ్యమయేదా ? 1947 కు ముందు రాజ్య పరిపాలనక్రమం యెలావుందో యథాతథంగా సంవిధానంలో దాన్ని కూర్చారు. పరిపాలన సౌలభ్యం కోసరం దేశం తతఃపూర్వమే రాష్ట్రాలుగా విభజింపబడి నిలిచివుంది. గవర్నర్లున్నారు. రాష్ట్ర శాసనసభ లున్నయి. విధానమంతా ఫెడరల్ విధానమె. తద్వారానే యీ ప్రభుత్వంవారి అనవసరమైన అధికార దౌష్ట్యం తగ్గాలని ప్రజలు వాంఛించారు. అలా కాదు; కేంద్రంలో బలమైన ప్రభుత్వాన్ని తయారుచేద్దాం అని అంటే గుండె అడుగుల్లోంచి అదటు పుట్టుకునివచ్చేది ప్రజల్లో. భయం! అమ్మో ఆ స్థానంలో వున్న వాళ్లు మా నెత్తిన సవారీచేయటం మానారనేమిటి ? మా శాసనసభలు వుండనీయండి. మా మంత్రులైతే కనీసం మా పరిస్థితు లర్థమవుతయి. మేము ఎప్పుడన్నా మాగోడు చెప్పుకుంటాం. మా భాష వాళ్ళకు వస్తుంది. ఒకే ప్రభుత్వమయితే మేము ఆ ప్రభుత్వభాషలో చెప్పుకోలేమేమొ నన్నారు. అమాయకులైన ప్రజలు ఏంచెపుతున్నారో తెలీకపోతే వీళ్ళంతా వట్టి అడివిమనుషులని పోలీసుఛార్జి చెయ్యటం కద్దు. కాని వాళ్లా విధంగా మొర పెట్టుకోవటం సంవిధాన నిర్మాణకులకు కళ్లకగట్టిం తర్వాత "మీకేమైనా చెప్పండి మేము యూనిటరి గవర్నమెంటు నే" ఏర్పాటుచేస్తామని అనగలరా ?

అప్పుడు కాదిప్పుడు - యూనిటరీ గవర్నమెంటు ఎంత మందికో యిష్టము కాదు. కొందరు కొందరు స్వంత లాభంకోసం మతాతత్వాల్లో పడి చీకాకు కలిగిస్తున్నా రంటూ అనుమానపడి సంవిధానం బాగా లేదనటం ఏదో శాస్త్రం చెప్పినట్టు బండివెనక గుఱ్ఱంకట్టి తోలిన ట్టుంటుం దేమొ! మతాతత్వాలు, అనర్థాలు వేరే శీర్షిక. స్వార్థం ఎక్కడయినా వుండక తప్పదు. ఆ గుణాలు సంవిధానం మూలకంగా కలిగినయ్యనటం సరికాదు. ఒక తీగచుట్టను అణిచిపెట్టితె చెయ్యి తియ్యంగానే మళ్లీ పైకిలేచినట్లు యీ స్వార్థం దౌష్ట్యం వగైరాలను దబాయించి అణిగేటట్టుచేసే హఠాత్తుగా ఎప్పుడో సందు మాసుకొని పైకిలేచి చీకాకుపరుస్తయి. మనుష్యుల్లో స్వార్థజిగీషవుండి, నేరాలు చేస్తుంటే—(వాళ్లు కించిద్ జ్ఞులు కనక అలా చేస్తారు)— చేతనయితే కోర్టులకు ఒప్పచెప్పుదాం అలాటివాళ్లను. లేకపోతే తూష్ణీంభావం వహించుదాం. అంతేగాని కొమ్మమీద నుంచొని కొమ్మనికొట్టటం చెల్లదు.

ఇంతకూ భారతసంవిధానం ఇలానే వుండాలంటాను.

# అంతర్మథనం

శ్రీ సి. నారాయణ రెడ్డి

కాలవార్ధి తరంగ డోలనములోన ఎన్నెన్ని వర్షాలు గతియించె తుంపరలట్లు;
ఈ ముప్పదేండ్లు నే నేమి సాధించితిని; నత్తగుల్లల ఆణిముత్తెమ్ము లనుకొంటి.

కుండపోతగ వానకురియు, నా చేలుపండునటంచు ఎద పింఛమును విప్పినదిగాని;
కురియుటకు ముందు జలధరమాలికలు పొందు గర్భవేదన నించుకైన గమనించెనా?

ఒక నాట్యకత్తె రొమ్ము 'కుదింపు'గని బిగించిన వీణవోలె స్పందించి పోయితిగాని;
దాని గుత్తంపు రవికలోన గుడుసుల్లువడు మాతృభావన లేశమాత్ర మ్మెరుగనైతి.

కొనతీవపైన దరహాసితమ్ము లొరబోసెడు పువ్వుగని పరవశించి పోయితిగాని;
ఒక్కొక్క రక్తంపు చుక్కతో దాని మనుగడ పెంచు తీగసంగతి తలపలేనైతి.

వాయు లహరులపైన వన్నెవన్నెల కోరికల కాగితంపు పడవల పోల్కి విడిచితిని;
అవి నడుమ మునిగెనా? అవలిగట్టున వెలుగుటంచులను చుంబించెనా? యెరుగలేనైతి.

మెరుపు దొరసాని ముంగురులెట్లో దువ్వి నాయింటిలోపల ప్రతిష్ఠించుకొంటినిగాని;
మింటిలో తప్ప నడిమింటిలో అది నిల్వలేదంచు తెలిసికోలేక బేల్వడిపోతి.

మబ్బులం దెన్ని సామ్రాజ్యములు నిర్మించుకొనియేమి? ఇసుకదిబ్బను పూరిగుడిసె యొ
క్కటి కట్టుకోలేక కటకటంబడితి; మదు మెత్తు బ్రతుకుం బరువుకే యీడిగిలబడితి.

అంతోయింతో తెలివి యబ్బి నేటికి దశాబ్దమ్మయ్యె; ఇప్పటికి చెమ్మగిల్లిన నేత్ర
పుటల లోపలి అర్థముల గ్రహింపగలేక వెర్రిగ ఘంటువుల వెంట పర్వెత్తెదను.

కటికి నేలను జీల్చి ఝటితిగా పొడచుకొని పైకిసాగెడు మొక్కవలె; బ్రతుకులో నుండి
చిమ్ముకొనిపోయి రోచిర్మండలమ్ములో అడుగిడిననాడె ఆత్మావిష్కరణమౌను.

గుండెలోతుల ద్రవ్వుకొని పోయినప్పుడే బొగ్గులో రతనాల నిగ్గులు గుబాళించు.
ఆత్మావబోధమైనప్పుడే కన్నీటి తెరలందు దాగు వెల్తురు పొరల్ భాసించు.

# భాస్కరకవి కాలము: విమర్శకు జవాబు

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

గడచిన మేనెల భారతిలో శ్రీ కె. హెచ్. వి. శర్మగారు నా 'తకతోల భాస్కరకవి' వ్యాసమును విమర్శించునప్పుడు, "తప్పుల తడకయు, అబద్ధములపుట్టయు నగు తెలంగాణా శాసనములలోని ధర్మసాగర శిలా శాసనము" అన్నారు. కాని, తెలంగాణా శాసనసంపుట మింతటి తప్పుల కుప్పయని నాకు తెలియదు. మరియు, "శ్రీ రెడ్డిగారు నూతన (అద్భుత) వాదన కుపక్రమించుతరి దాని (హైదరాబాదు శాసనసంపుటము) నైనను జూడరైరి." అని హెచ్చరించినారు. నేను దానిని చూడని మాట నిజమే. తెలంగాణా శాసనసంపాదకులు శ్రీ మారేమండ రామారావుగారు (కావలెనని బుద్ధిపూర్వకముగా?) తప్పుడు శాసనములు ప్రకటించినారని నాకప్పుడు తెలియదు. ఏదో పొరపాటు జరిగిన సంగతి తెలియనప్పుడు పల్లెటూరివాడను పట్నవాసపు శాసన సంపుటములు చూచుట కవకాశము లేదు. మారుమూలలోని నాకు హైదరాబాదు అందుబాటులోనిది కాదు. చూడలేదు. ఈ కారణములచేత నా నూతన వాదములో తప్పులు దొర్లినవనుట కాక్షేపము లేదు.

"'తకతోల' యను నింటిపేరే వింతగా 'తలతోక' లేనట్లున్నది." అనియు శ్రీ శర్మగారనిరి. 'గలేతక తోల' అపపాఠము 'కులేతకతోల' మూలమనుకొనుట తప్పు. ఇప్పుడది 'గళితకపటో' మూలమైనది కాబోలు!

ఇంటిపేరు లేకపోయినను, దీనిలో 'గళితకపటో భాస్కరో మంత్రివర్యః' అను భాస్కర మంత్రి లేకపోలేదు. ఇతనికి తోడు కావ్యములో గుంటూరు భాస్కరమంత్రికూడ కలడు.

'ఈ (ఇరువురి) వ్యక్తిభేదము సూచించుట కొరకే కాబోలు ఒకనికి హుళక్కి భాస్కర మంత్రి యను వ్యవహారనామ మేర్పడినట్లు తోచుచున్నది.' (—భారతి, మార్చి, 1960 సంచిక కలగూరగంప.)

గుంటూరు భాస్కరమంత్రి ఇంటిపేరు మారదు కాబట్టి తెలంగాణ భాస్కరమంత్రి ఇంటిపేరు హుళక్కిగా లెక్కించ వీలున్నది. ఇకనీ భాస్కర మంత్రులిద్దరు కొంచె మెచ్చుతక్కువ సమకాలికులై భాస్కర రామాయణ రచన కొనసాగించియు, సంపూర్ణము కావించలేకపోయినట్లు కనబడుచున్నది.

"శాకల్య మల్లికార్జునభట్టు మొదలైన బ్రహ్మవిద్వాంసులు,...హుళక్కి భాస్కరుడు మొదలుగాగల సత్కవీశ్వరులు ... అశ్వంబుల కధికారియైన సాహిణి మారనయు" కాకతీయ ద్వితీయ ప్రతాపరుద్రుని యాస్థానమున ఉండినట్లు సోమదేవరాజీయమను కాకతీయచరిత్రలో చెప్పుట కాలదోషము. మొదటి ప్రతాపరుద్రదేవుని కాలము ద్వితీయ ప్రతాపరుద్ర దేవుని కాలముగా మారినట్లు కనబడుచున్నది.

**గుంటూరి వంశము**

- భాస్కరమంత్రి 1140—70
  - కేతన
    - భాస్కర (మల్లన కొడుకు లేదు.)
  - మల్లన 1170—1200
  - సిద్ధన
    - ఖడ్గ తిక్కన
  - కొమ్మన 1200—30
    - కవి తిక్కన 1230—60

కాకతీయ గణపతి 1200-62

**హుళక్కి వంశము**

- భాస్కరమంత్రి 1150—75
  - చెన్నగన్నయ 1175—1200
    - గణపతి 1200—25
      - మల్లమంత్రి 1225—50

కాకతీయ గణపతి 1200-62

## భాస్కరకవి కాలము : విమర్శకు జవాబు

ఈ భాస్కరమంత్రు లిద్దరు చారిత్రకముగా మొదటి కాకతీయ ప్రతాపరుద్రదేవునికి సమకాలికు లైనట్లు తద్వంశవృక్షసమన్వయము సూచించుచున్నది.

పై రెండువంశములలో ఒక పురుషాంతరకాలము వ్యత్యాసమున్నను, భాస్కరకవు లిద్దరు క్రీ. శ. 1158-95 మధ్యకాలమందలి మొదటి కాకతీయ ప్రతాపరుద్రుని సమకాలికు లనుట కవకాశమున్నది. హుళక్కి భాస్కరమంత్రివంశములో పురుషాంతరమునకు 25 సంవత్సరముల చొప్పున లెక్కించగా ఇరువురు భాస్కరకవులకు సమకాలికత్వము సిద్ధించినది.

నా మొదటి వ్యాసములో హుళక్కి భాస్కరుడు — సాహిణి మారనలు సమకాలికులని చెప్పుటలో కొంత సత్యమున్నను, కాలచక్రము తప్పుగా కూర్చబడినది. 'గజాధికారి మారయ' అని మార్పు సూచించితిని. ఇప్పు డీతడు గజాధికారి మారయ కాడనియు, 'అశ్వంబుల కధికారియైన సాహిణి మారయ' కాబో లనుట కవకాశమున్నది. క్రీ. శ. 1311 నాటి కోటనెమిలిపురి శాసనవంశము 'గజసాహిణి' వంశమే కాని, 'అశ్వసాహిణి' వంశము కాదని ఉద్యోగ భేదము వలన విశదమగుచున్నది.

ఇదివరలో 'గజపతి కొమార్తె రుద్రాంబ కొకప్పుడు రుద్రదేవుడను పురుషనామ మున్నప్పు డీ భాస్కర రామాయణ కృతిపతియు, కృతికర్తలును కలరనుట (కోటనెమిలిపురి) శాసనకాల సమ్మతము. ఇది గణపతి - రుద్రమదేవుల రాజ్యసంధికాల సారస్వత చరిత్ర కాకపోదు.' అని చెప్పుటలో తప్పు కలదు.

ఇప్పు డా క్రీ. శ. 13 వ శతాబ్ది సారస్వత చరిత్ర ధర్మసాగర శిలాశాసన మూలమునుబట్టి క్రీ. శ. 12 వ శతాబ్ది సారస్వతచరిత్రగా మారినది.

కవిబ్రహ్మ తిక్కన భారతరచనకంటే ముందు క్రీ. శ. 1105-75 మధ్యకాలములో మొదటి కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజు రాజ్యముచేయునప్పుడు భాస్కర రామాయణము హుళక్కి భాస్కరకవి రచన వరకు (అశ్వ) సాహిణి మారయ కృతిపతిగా తత్కావ్య రచన కొనసాగినట్లు చెప్పుట కవకాశ మిప్పు డేర్పడినది. ఒక్క యుద్ధకాండ శేషకవి అయ్యలార్యుడు తప్ప, తక్కిన కవులు నలుగురు—ఇరువురు భాస్కరులు, మల్లికార్జునభట్టు, నిశ్శంక కుమార రుద్రదేవుడు— అశ్వసాహిణి మారయకు సమకాలికులై తత్కృతి పతిత్వ మంగీకరించి, వారివారి అభిమాన కథా ఘట్టములను ఎన్నుకొని, తత్తత్కాండలు రచించినారనుట నూతన కవిసంఘ నిర్మాణము.

ప్రధాన కవులు భాస్కరు లిరువురి పేర భాస్కర రామాయణమను నామకరణము జరిగినట్లు సమకాలికత్వము సూచించుచున్నది.

'కవిచరిత్రకారులు నిశ్చయించినట్లు తిక్కన కాకతీయగణపతి రాజ్యకాలములోనివాడని తీర్మానించినయెడల అతని తాత గుంటూరు భాస్కర మంత్రి క్రీ. శ. 1158-95 ప్రాంతమందలి కాకతీయ (ప్రథమ) రుద్రదేవరాజు కాలమునాటి రామాయణ కావ్యకర్త కానోపు. అప్పుడు కృతిపతి మారయ కాలము కలసి రారాదు'—(భారతి, మార్చి, 1960 సంచిక కలగూర గంప.)

ఇప్పు డీ గజసాహిణి మారయ కృతిపతి కాకపోయినను, అశ్వసాహిణి మారయ భాస్కర రామాయణ కృతిపతి కాకపోడు కదా! ఇతడు ద్వితీయ ప్రతాపుని అశ్వసాహిణి కాడనియు, ప్రథమ ప్రతాపుని అశ్వసాహిణి యనియూ చెప్ప వీలున్నది. సోమదేవ రాజీయ చరిత్రలో ఈ విషయము పొరపాటుగా మార్చి చెప్పబడినది. ఆ పొరపాటు నీ భాస్కర మంత్రిద్వయ సమకాలముతో గుర్తించ వీలున్నది.

'ఈ ఇరువురకును నామసాదృశ్యము గలిగి యుండుట మూలమున నీ వివాదమును బరిష్కరించుట యంత సులభము కాదు'—ఆంధ్ర కవి తరంగిణి, 2-70 పుట.

ఈ జంటపేర్లు మారయ లిద్దరికిని, ప్రతాపరుద్ర దేవులిద్దరికిని, భాస్కరమంత్రులిద్దరికిని సమానముగా ఉండుటవలన చరిత్రలో కొన్ని పొరపాట్లు జరుగుట సహజము. అవి గుర్తించి సరిదిద్దుట తప్పు కాదు.

'అట్టి భిన్న (భాస్కర) కర్తృత్వము స్థిరపడిన పక్షములో మొట్టమొదట మంత్రి భాస్కరుఁ డరణ్యకాండమువఱకునో, కాక యింకను మఱికొంత భాగమునో, కాక పూర్తిగనో రచియించి యుండెననియు, నాతని పేరుతోడనే భాస్కర రామాయణమను పేరు వచ్చెననియుఁ గాక తాళీయముగ హుళక్కి భాస్కరుడుకూడ గొంతభాగ మిందు రచించి యుండుటచే నాతనిబట్టి పేరు వచ్చినట్లు లోకము

భ్రమించుచున్నదనియుఁ దలంచుటకూడ సమంజసమగును'—ఆంధ్రకవితరంగిణి 2—77 పుట.

మరిన్ని—'అరణ్యకాండమును యుద్ధకాండమును రచియించిన భాస్కరులు భిన్నులా? అయినచో వారెవరు?'—ఆంధ్రకవితరంగిణి 2-68 పుట.

ఇప్పుడీ ధర్మసాగరశిలాశాసనమూలముతోను, నిర్వచనోత్తర రామాయణకవివంశావళితోను సమకాలికులైన భాస్కరమంత్రు లిద్దరు కలరని చారిత్రకముగా జవాబు చెప్ప వీలున్నది. కాని...'అతని (మల్లనమంత్రి) ప్రపితామహుడగు భాస్కరమంత్రి అథమము గణపతిదేవుని పితామహుడగు కాకతి రెండవ ప్రోలరాజు కాలమువాడు అనగా క్రీ. శ. 1110-1158 ప్రాంతము వాడగును. అప్పుడు వారు చెప్పిన కృతిపతి మారయ సాహిణి కాలము బొత్తిగ కలసిరాదు.'—(భారతి, మే, 1960 సంచిక కలగూరగంప.)

కనుక ఈ శర్మగారి వాదములో చారిత్రక సమన్వయము లేదు. ఆక్షేపమమాత్రమే కనబడుచున్నది. గుంటూరు భాస్కరమంత్రి వంశమునకును, తెలంగాణ హుళక్కి భాస్కరమంత్రి వంశమునకును మధ్యనున్న ఒక్కతరము వ్యత్యాసమును సర్దుబాటు చేసినచో వీరిరువురు క్రీ. శ. 1158 రెండవ ప్రోలరాజు కుమారుడు మొదటి ప్రతాపరుద్రుని సమకాలికులగుటకవకాశమున్నది.

క్రీ. శ. 12 శతాబ్దములోని భాస్కరమంత్రి కవులిద్దరినిబట్టియే భాస్కరరామాయణమును ప్రఖ్యాతి కలిగినది. అశ్వసాహిణి మారయ పేరనున్న కృతినాయక సంబోధనలు కొన్ని మార్పుకావించి, దైవసంబోధనలుగా మార్చుట భక్తిమార్గమైనను, చారిత్రకపద్ధతి కాదు. కవిస్తుతులలో కాలక్రమము చక్కగాలేని నిదర్శనము లెన్నో కలవు. హుళక్కి భాస్కరమంత్రియు, గుంటూరు భాస్కరమంత్రియు భాస్కరరామాయణ కావ్యకర్తలనుటలో కాలదోషము లేదు. ఇంటిపేర్లు చెప్పుట, చెప్పకపోవుటనుబట్టి వ్యక్తిభేదము పాటించినచో శాసనాధారకవిచరిత్రయే దుర్లభమగును.

ఇదివరలో ధర్మసాగర శిలాశాసన శిథిలపాఠమునుబట్టి 'భాస్కరరామాయణ కర్త తిక్కన తాత భాస్కరమంత్రి కాడనియు, తదన్య భాస్కరమంత్రి భాస్కర రామాయణ కావ్యకర్త కాబోలనియు నేర్పడుచున్నది.' — (భారతి, మార్చి, 1960 సంచిక కలగూరగంప) అని చెప్పినను, ఇప్పుడా శాసన సంపూర్ణ పాఠమునుబట్టి భాస్కర కవులిద్దరు సమకాలికులై భాస్కర రామాయణ కావ్యకర్తలైరనుట కాక్షేపము లేదు.

శ్రీ కె. హెచ్. వి. శర్మగారు భారతిలో ధర్మసాగరశాసనమూలము ప్రకటించునప్పుడీ భాస్కర రామాయణకాలము మార్పుకూడ సూచించియున్నచో నాకీజవాబు చెప్పెడి శ్రమ లేకపోయెడిది. ఎట్లయినను, చారిత్రక సత్యాన్వేషణములో అపపాఠమునుపట్టి దొర్లిన నా వాదదోషములను సవరించుకొనుటకు తోడ్పడిన శ్రీ శర్మగారికి హృదయ పూర్వక ధన్యవాదము లర్పించుచున్నాను.

యుద్ధకాండ గద్యలోని 'శాకల్య మల్లకవి రవిరాహు వీర నరసింహావర జాప్పలార్య నందన— అయ్యలార్య విరచితంబు' చరిత్రకూడ క్రీ. శ. 1175-95 ప్రాంతము కాకతీయ ప్రథమ ప్రతాపరుద్రుని రాజ్యాంత కాలముగా సమన్వయమగుచున్నదే కాని, క్రీ. శ. 1407 తేది వేదగిరినాయనింగారి శాసన కాలమునకు సమకాలముగుట లేదు. ఇందలి 'శాకల్య మల్లకవి' కాకతీయ—చరిత్రలో చెప్పిన 'శాకల్య మల్లికార్జునభట్టు - బ్రహ్మవిద్వాంసు'డన్నచో, ఇతని కాలము ద్వితీయ కాకతీయ ప్రతాపరుద్రుని కాలముతో కూడా సమన్వయము కాదు: శాకల్య మల్లకవి మొదటి ప్రతాపరుద్రుని కాలమువాడనుట భాస్కర కవుల సమకాల సమన్వయము.

# అరణ్యాశేషోన్నయం

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

## పాత్రలు :

సూరన్న  పేరన్న
మాదన్న  ఎఱ్ఱన్న
భటుడు

స్థలం : ఎఱ్ఱన గృహం

సూరన్న : పేరన్నా పేరన్న!
['శారద రాత్రులు - శారద రాత్రులు' అని వల్లె వేస్తూ సూరన్న పిలుపు పేరన్న వినిపించుకోడు.]
ఓ పేరన్నా పేరన్నా!

పేరన్న : ఆఁ, ఆఁ. వల్లించుకుంటుంటే చెవు డొకటి ఏర్పడుతుందేమో! వినలేకపోయాను, మన్నించాలి.

సూ : దీని కిక మందు లేదు.

పే : మానేయడమే మందు.

సూ : కాబట్టి వల్లించడం మానేస్తానని అంటావు— జోన్నా!

పే : వేరే ఉపాయం?

సూ : ఇటు వల్లించుకుంటూనూ వుండాలి, అటు వినిపించుకుంటూనూ వుండాలి.

పే : రెండు కాళ్ళూ తీసకపోయి రెండు తెప్పల మీద పెట్ట మంటారు. పెట్టనా?

సూ : ఇప్పుడప్పుడే కాదు, పెట్టే సమయంలో యెవరికీ చెప్పకుండా నీవే పెడతావు.

పే : తాతగారూ వద్దు వద్దు.

సూ : మీ గురువుగారు అదే చేస్తున్నారు, సరే కాని, పద్యా లల్లుతుంటే మీ గురువుగారికి కన్నూ కనబడదు, చెవీ వినబడదు. మల్లారెడ్డిగారి దగ్గర నుంచి మనిషి వచ్చాడని పోయి అతనికి చెప్పు.

పే : అయ్యవా రెక్కడ ఉంటా రంటారు?

సూ : పసు బాపగా ఉన్నప్పటినుండీ మొనమొన్నటి దాకా తాత ఎఱపోతయ్యగారు గుళ్ళో కూచో బెట్టుకుని నీలకంఠ స్తోత్రాలూ, నృసింహ స్తోత్రాలూ చెప్పేవారు.

పే : నీలకంఠేశ్వరుని మీద పద్యం ఒకటి అమ్మగారు చదువుతుండగా పట్టుకున్నాను. అది తమతండ్రి ఎఱపోతతాత గారిదా?

సూ : గట్టివాడవే! వెన్నెలకంటి వారి అబ్బాయివి కదూ! ఏదీ చదువు!

పే : నిను సేవించినఁ గల్గు మానవులకున్
వీటీ వఘూటీ ఘటీ
ఘనకోటీ శకటీ కటీ తటిపటీ
గంధేభవాటీ పటీ
ర నటీ హారివటీ సువర్ణముకుటీ
ప్రచ్ఛోటికా పేటికల్
కన దామ్నాయ మహోతురంగ శివలిం
గా నీలకంఠేశ్వరా!

సూ : ఇది మా కోడలి భర్తదే. ఎఱ్ఱన్న చిన్నతనంలో నీలకంఠేశ్వరుని మీద చెప్పాడు. అతడికి వరవడి నన్నయ. సరే కాని ఇంతసేపు నీ తెలివితేటలతో నెట్టుకొచ్చావ్. అదుగో, వచ్చిన మనిషి ముంత మామిడి పండులా మనకేసి చూస్తున్నాడు.

పే : నేను గుళ్ళోకి పోయి గురువుగారిలో మునిగిపోకుండా వుంటే వెంటనే చెప్పేస్తాను.

భటుడు: మీరూ మాలాంటి అలగా సామాను కాదు, నేనూ మీతో వస్తా పదండి. ఆ దేవరనూ ఈ దేవరనూ ఒక తావులోనే కనిపించుకుంటా. పదండి; నేను మళ్ళా తొందరగా వెళ్ళాలి.

సూ : అయితే మీ గురువు గుళ్ళో కూచుని ప్రబంధ మేదయినా అల్లుతున్నాడా?

పే : అదేమిటి తాతగారూ! ఆరణ్యం నన్నయగారి తరవాయి అందుకుని—

సూ : అందుకనా? శారద రాత్రులు శారద రాత్రులు ...అని ముప్పేట పురెక్కిస్తున్నావ్! అయితే నన్నయ పద్యంతో ఎఱ్ఱయ్య పద్యం అతికిందా? అతకదేమో అన్నట్లు తిక్కన్నగారు విడిగా విరాటమే అందుకున్నారు. ఏదీ చదువు!

పే: టంకం పెట్టకుండా రెప్పమోపు చేసిన ట్లతికింది:-

స్ఫుర దరుణాంశురాగ రుచిఁ
బొంపిరివోయి నిరస్త నీరదా
వరణములై దళత్కమల
వైభవ జృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతర హంససారస మ
ధువ్రత నిస్వనముల్ సెలంగఁగా
గరము వెలింగె వాసర ము
ఖంబులు శారదవేళఁ జూడఁగన్.

సూ: శిష్యులెంతకూ చాల్తారు. లక్కలాకూడా అతికిందంటావు. ఇదంతా అతుకులూ అందతుకులూనూ!

పే : ఏ తండ్రికీ ఏ కొడుకులోనూ గొప్పతనం కనబడదు, వినండి ఇది :

అతిగాంభీర్య విభూతి నేకచులుకా
హంకార నిశ్శేష శో
షిత పాథోధి పయస్కుఁడైన మునిదోఁ
చెం బుణ్య తేజోమయా
కృతి నయ్యామ్య దిగంతవీథిఁ బ్రకట
క్రీడా కళాగర్వగ
ర్జిత మందాక కలంకితాంబు శుచితా
సిద్ధి ప్రదాచార్యుఁడై.

సూ : సరేకాని శ్రీకారం లేకుండా సురేకారంలాగా స్ఫుకారంతో మొదలేయడ మేమిటి? మాదన్న నిట్లాపిలు!

పే; ఇది సురేకారం కాదండి! ఇది ఛందోవేత్తల ఆచారం. మరి గ్రంథారంభం కాదాయె. అక్షర చక్రాన్ని బట్టి ఎ-కు, స, ఫ, లకూ చెలిమి. అఁ. మీకు తెలియదేమిటి? నేనుపోయి పిలుచుకొస్తా.

భటు : నేనూ వస్తిని. దేవరా! బుద్ధి బుద్ధి.

**2**

మాదన్న : ఏమి సెలవు?

సూరన్న : అరణ్యమంతా ఏిందంటాడు పేరన్న. ఎంత వరకు అయిం దేమిటి?

మా : ఆశ్వాసాంతపద్యాలు వ్రాస్తూ మీఆజ్ఞ విని ఇలా వచ్చాను.

సూ : నీలకంఠేశ్వరున కిది కృతా?

మా : కాదు, ఆయన సాక్షి.

సూ : దేనికి?

మా : ఇది రాజరాజ నరేంద్రునకే కృతి. నన్నయ వ్రాసిన ట్లే వ్రాత దీనికి.

సూ : ఇదేమిటోయ్? ఎఱ్ఱన్నే పూరించాడని వెనుకనుంచి టముకా వేయడానికి నీలకంఠుడు సాక్షి కాడూ?

మా : నేనూ ఉన్నానని అనుకోండి!

సూ : నీవు చెప్పేది దేముడు చెప్పేది నన్నయ్య చెప్పాడంటే ఎవరు నమ్ముతారు?

మా : నమ్మకపోనీండి! నన్నయగారిమీద అతనికి అంత భక్తి. వినండి—'నా అంశ నీలో ప్రవేశిస్తుంది,

ఇక రా'యి' అని నన్నయ్య మీ ఎఱ్ఱయ్యతో అన్నాడు.

సూ : నీవూ ఆమాట విన్నట్లున్నావు.

మా : నన్నయగారలా అన్నట్లతడు చెప్పుకోపోతున్నాడు.

సూ : పిచ్చివాళ్ళకూ పిచ్చివాళ్ళకూ సరిపోయింది.

మా : కవిత్వమంటేనే పిచ్చ కదండీ! మీకుమాత్రం తెలియదా? భక్తి, కవిత్వానికిమించిన పిచ్చాయె. కాకుంటే రాజరాజుకే కృతియివ్వడ మేమిటి ఎదుట దేము డుండగా? సమయంలో మల్లారెడ్డి మనిషికూడా వచ్చాడు. ఇస్తే అతడు పుచ్చుకోడానికే. ఈయడం అయిపోయిందని ఎఱ్ఱయ అన్నాడు.

సూ : అలాగా? నన్నుగూడా ఒకపిచ్చివాణ్ణిగా బనాయించి మీలో జమకట్టుకుంటున్నావా? పిచ్చివాణ్ణి పిచ్చివాడా అంటే నీవు పిచ్చి, నీతండ్రి పిచ్చి, నీతాత పిచ్చి అంటాట్ట! 'నేను నన్నయ భట్టారకు నంతవాడన'ని ఎఱ్ఱయకు గర్వం అని లోకు లనిపోరా ?

మా : తమరు నాకు గురుస్థానం. నేను నాసహాధ్యాయిని వెనుక వేసికొని వచ్చినటు లుంటుంది. దీని కెఱ్ఱనే ప్రత్యుత్తరించాలి.

[ప్రవేశించి]

ఎఱ్ఱన : దేనికి ?

మాద : నాయనగారంటున్నారు—'నన్నయ వ్రాసినట్లు చెపితే 'ఎంత గర్వం ఎఱ్ఱయకు?' అని లోకు లనిపోరా'? అని.

ఎఱ్ఱ : ఏం నాన్నా మీరలా అనుకున్నారా? నాకు నన్నయభట్టుగారు మొదటి అయ్యవారు, తిక్కయజ్వగారు పదపటి అయ్యవారూ. ఈ కవితా ప్రపంచంలో భక్తుడు భగవంతునిలో కలిసిపోయినటులు పేరు లేకుండా భట్టారకునిలో కలిసిపోవడమే నా తలపు. నన్నయగారెవరికీ అందేవారు కారని అందరకూ తెలుసు. లోకుల కేలాగూ తెలియక మానదని తెలిసిన నన్ను ఆ లోకులు గర్వపోతు అని అంటారా ?

సూర : నన్నయగారెవరికీ అందరు. 'కథ జగత్ప్రసిద్ధం కాబట్టి పూర్వ కథతో సమన్వయ పరచడానికి వేరే యత్నం అక్కర లేదంటూ తిక్కనగారు అరణ్యంనుండి పైతోలగారు. అది అలా ఉండనీ! నీకు అనృతదోషం తగలదూ ?

ఎఱ్ఱన్న : ఈ దోషం రప్పించడమూ తప్పించడమూ తిక్కన్నగారే చేశారు చూడండీ - నన్నయగారి తరవాయి తిక్కన్నగా రందుకోలేదు. పైగా నన్నయగారిమీద తమకుగల భక్తివల్ల 'మూడు పర్వాలు నన్నయగారే వ్రాశార'ని అన్నారు. నన్నయ తిక్కనలమీద భక్తివల్ల నేను కలిపిన ఈ అవంత గ్రంథానికీ నా పేరు పెట్టుకుంటే నా తోంటచేయి నేనే బయట పెట్టుకోటం కాదా ! ఇది అనృత దోషమో గుర్వాజ్ఞో ఇప్పటివారూ, పుట్టబోయేవారూ ఐన ఆంధ్రులు నిర్ణయించుకుంటారు.

సూరన్న : మంచిది నాయనా ! అధర్వణాచార్యుల వారు భారతం వ్రాశా రనిన్నీ అది ప్రశస్తంగా ఉందనిన్నీ వింటున్నాను. నన్నయ తిక్కనలపై నున్న నీ భక్తే వీరి సందున నీకు చోటుచేస్తుంది. నీవల్లనే మా కింత పేరూ తీరూ వస్తుంది. నీకు ఐహికంగానూ ఆముష్మికంగానూ మేలు కలగాలి.

ఎ : ఇది తమ ఆశీర్వచనమే కాదు, అనుగ్రహం.

## 3

[నీలకంఠేశ్వరాలయంలో ఘంటానాదం]

మాదన్న : భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుండు
శ్రీవత్స గోత్రుండు శివపదాబ్జ
సంతత ధ్యాన సంసక్త చిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుం డిలఁ బాకనాటిలో నీలకం
ఠేశ్వర స్థానమై యెసక మెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు
ధన్యుఁడు ధర్మైకతత్పరాత్ముఁ
డెఱ్ఱనార్యుండు సకల లోకైక విదితు
డయిన నన్నయభట్ట మహాకవీంద్రు
సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ
బెందుటయు సాధుజన హర్ష సిద్ధిఁగోరి,

క. ధీర విచారుఁడు తక్కవి
తారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయ కా
నారణ్య పర్వ శేషము
పూరించెఁ గవీంద్ర కర్ణ పుట పేయముగాన్.

# తెనుగు నేర్చిన తెల్లవారు: వీరమాముని

## శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

క్రీస్తుశకము **15, 16, 17** శతాబ్దములందు దక్షిణాపథములో చాలభాగము మేరుసమాన ధైర్య యశస్తిలకు లని పేరుపెంపులు గడించిన తెలుగు నాయకరాజుల పరిపాలనాధికారమున నుండెను. తెలుగు భాషావాఙ్మయములకు దక్షిణ భారతమున బహుళ ప్రచారము కలిగినది వీరికాలములోనే. ఆ నాళ్లలో పలువురు తమిళులు తెలుగుభాష నభ్యసించిరి. క్రైస్తవ మతవ్యాపనోద్దేశముతో ఏతెంచి తమిళ నాడులో స్థిరనివాసము లేర్పరుచుకొనిన పాదిరీలు కూడ రాజభాషయగు తెలుగు నభ్యసించిరి. తంజావూరు నేలిన మహారాష్ట్ర నృపతులును, తెలుగు భాషా సాహిత్యములను పోషించుటయే కాక తెలుగున రచనలు కూడ చేసిరనగా తెలుగు భాషావాఙ్మయముల యెడ అలనాటి ప్రభువులకును, ప్రజలకును గౌరవ ప్రపత్తు లుండెననుట స్పష్టము.

వస్తుతః నాయకరాజులు మతసహనముగల విశాల హృదయులు. అందువలననే పాదిరీలు నిరాటంకముగా మతప్రచారము చేసికొనగలిగిరి. కాని మలినమనస్కులైన కొందరు పాళెగాండ్రును, బుడతకీచు లనిన ద్వేష భావము కలిగిన కొందరు ప్రజలును పాదిరీలను ముప్పుతిప్పలు పెట్టిరి. కాగా, అనేక కష్టనష్టముల కోర్చి పాదిరీలు మతప్రచారము చేయవలసి వచ్చెను.

నాయకరాజులకు పిమ్మట తంజావూరు మహారాష్ట్రుల వశమయ్యెను. మహారాష్ట్రులు క్రైస్తవ మతానుయాయులను, ప్రచారకులను ద్వేషించిరి. తత్ఫలితముగా తంజావూరు తత్పరిసరములందున్న క్రైస్తవులు పరువులు తంజపురమును విడనాడి యితర ప్రాంతములకు పోయి తలదాచుకొనిరి.

తంజావూరు జిల్లాలోని కొల్లిడం నదియొడ్డున నున్న ఏలాక్కురిచ్చి అను నొక కుగ్రామము క్రైస్తవ కాందిశీకుల కాశ్రయ మొసగెను. ఏలాక్కురిచ్చికి పలువురు క్రైస్తవులు తరలి వచ్చిరి. వారిలో ఒక పాదిరీకూడ నుండెను. అతడచ్చట ఒక ఆలయము నిర్మించి అందు దేవమాత యగు మేరి విగ్రహమును ప్రతిష్ఠించెను. 'ఆశ్రయ మిచ్చుతల్లి' అని భక్తు లాదేవిని ప్రస్తుతించిరి. ఆమె చల్లని చూపులే ఆ గ్రామమునకు ఏడుగడయను నుద్దేశమున ఆ పాదిరీ తిరుక్కావలూర్ అని యా గ్రామమునకు నామకరణము చేసెను. నేటికిని తిరుక్కావలూరని యే ఏలాక్కురిచ్చి గ్రామమును ప్రజలు వ్యవహరించుచున్నారు. తుదకు తమిళవాఙ్మయమునగూడ తిరుక్కావలూరు చోటు చేసికొనెను.

కాలక్రమమున ఆ పాదిరీకి తిరుక్కావలూరనిన అంతులేని గౌరవభావము కలిగెను. తిరుక్కావలూర్ కలంబగమ్ అను కృతిలో "తిరుక్కావలూరు సుందరోద్యానమున పచ్చికగా జన్మించి మధుపము వలె తిరుగుచు, మధువును గ్రోలుచు, తీయని గేయములు" పాడవలెనని అతడభిలషించెను. మతబోధచేయు తలపున తమిళనాడున స్థిరనివాస మేర్పరుచుకొనిన ఆపాదిరీ జన్మభూమి ఇటలీదేశము. ఒక్క తిరుక్కావలూరు నందేకాక తమిళభాషాసాహిత్యములందును అతనికి ప్రగాఢమగు నభిప్రాయ మేర్పడెను. తమిళమున నిఘంటువు నిర్మించియు, వచనరచనలు వెలయించియు, మహాకావ్యము నొకటి రచించియు, తమిళ భాషాధ్యయనము చేయ నభిలషించు పాశ్చాత్యులకు నిఘంటువులు సమకూర్చియు తమిళభాషా వాఙ్మయములకు తుదలేని మహోపకార మొనర్చిన ఆ పాదిరీ నిజమునకు ఋషితుల్యుడే! నాడును నేడును కూడ తమిళు లతనిని వీరమామునివర్ అని సభక్తికముగా వ్యవహరించుట గమనింపదగు నంశము.

వీరమాముని బహుభాషావేత్త. తమిళముతో పాటు అతడు తెలుగు, కన్నడములను, హిందూస్తానీ పారశీకములను, సంస్కృతమును నేర్చినట్లు తెలియుచున్నది. తెలుగున కొన్ని గ్రంథములను, ఒక వ్యాకరణమును రచించెననియు తెలియుచున్నది.

వీరమాముని ఆభిజాత్యసంపన్నుడు. **1680** వ సంవత్సరము నవంబరు 8 న అతడు కన్‌టాల్ఫొ బెస్కి, ఎలిజబెత్ బెస్కి దంపతులకు జన్మించెను. తలిదండ్రు లతనికి జోసెఫ్ కాన్‌స్టన్‌టైన్ బెస్కి అని పేరిడిరి.

# తెనుగు నేర్పిన తెల్లవారు : వీరమాముని

కాని తరువాతి కాలమున తమిళముమీది యభిమానము కొలది బెస్కి ధైర్యనాథుడని తన పేరును మార్చుకొనెను. బెస్కి వంశనామమును విసర్జించెను. అంతటితో అతడాగలేదు! వేషభాషలను, ఆచారవ్యవహారములను గూడ మార్చుకొనెను. బెస్కి విద్వత్తును, వేషధారణమును చూచి ప్రజలతనిని వీరమాముని యని వ్యవహరింపజొచ్చిరి. తుదకీ పేరే తమిళసాహిత్యమునందును, తమిళనాడునందును నిలిచిపోయెను.

"ఈ దేశమునకు వచ్చినప్పటినుండియు ఆయన (వీరమాముని) మాంసాహారమును విసర్జించి శాకాహారమును స్వీకరించెను. వంటకు ఇద్దఱు తమిళులను నియోగించుకొనెను. రోజున కొక్కపూట మాత్రమే ఆయన భోజనము చేయుచుండెను. మఠమున నున్నప్పుడాయన నుదుట గోపి చందనపుబొట్టు పెట్టుకొనుచుండెను. సూర్యకాంతి పట్టుకుల్లాయి, నీర్కావిగుడ్డలు, తిరునల్వేలి అంచులుగల ఉత్తరీయము మున్నగువానిని ధరించుచుండెను. కాళ్ళకు పావుకోళ్లుండును. పర్యటనకు బయలుదేరునపుడు ఆయన చలువ వలువలును, లేతకావిరంగుగల శాటిని, తెల్లని తలపాగను ధరించును. చేత జపమాలయు దండమును, చెవులకు ముత్యాల కుండలములును, వ్రేలికి తంబాకు ఉంగరమును, కాళ్లకు చెప్పులు నుండును. పల్లకిలో మెత్తని పరపుమీద వ్యాఘ్రచర్మము పరుపబడియుండును. ఉభయపార్శ్వములందు వింజామరలు వేయుచుండగా ఇరువురు నెమలికన్నుల విసనకఱ్ఱలు వీచుచుండగా, స్వర్ణకలశము గల కావిరంగుగుడ్డగొడుగు పట్టుకొని ముందొకరు పోవుచుండగా అప్పుడాయన పల్లకి నెక్కి వెడలును. దిగిన చోట వ్యాఘ్రచర్మాసనముపై కూర్చుండెడివాడు."

ఇట్లు వీరమాముని వేషపుతీరును కన్నులకు కట్టునట్లుగా ఒక సహృదయు డభివర్ణించెను. పుట్టుకచే పరదేశీయుడైనను, ప్రదర్శించిన భాషాభిమానమువలనను, అవలంబించిన యాచార వ్యవహారములవలనను బెస్కి తమిళు డయ్యెను. అదియే అతని లక్ష్యమై యుండెననియు వ్యక్తమగుచున్నది.

అధ్యాపక వృత్తితో బెస్కి జీవితము ప్రారంభమయ్యెను. కాని మూడుసంవత్సరములు మాత్రమే అతడా వృత్తియందుండెను. ఆ మూడేండ్లలోను ఫ్రెంచి, హీబ్రూ, గ్రీకు, లాటిన్, పోర్చుగీసు మున్నగు భాషలు నేర్చెను. క్రైస్తవ మతవ్యాప్తి నిర్వహణమునకే జీవితము సంకిత మొనర్పనెంచిన బెస్కి 1706 నుండి నాలుగేండ్లు తత్త్వతర్కశాస్త్రము లభ్యసించి వానిని ఆపోశనము పట్టెను. కడపట అతడు బిషప్ పదవి నందెను. 1710 లో అతడు మనదేశమునకు వచ్చెను. అప్పటి కతడు ముప్పదేండ్ల యువకుడు!

గోవాలో కొన్నాళ్లు విశ్రాంతి తీసికొని అటుపిమ్మట బెస్కి దక్షిణాపథమునకు బయలుదేరెను. అంబలక్కాడు, మణప్పాడు, తూత్తుక్కుడి మొదలగు ప్రదేశములందు మతప్రచారము చేసెను. తూత్తుక్కుడిలోనే అతడు తమిళము నేర్చెననియు, ఆనాళ్లలో సుప్రసిద్ధ పండితకవిగా పేరొందిన సుప్రదీపకవియే అతని గురువని తెలియుచున్నది.

బెస్కి ఒకవైపు మతప్రచారమును, మరొకవైపు భాషాధ్యయనమును సాగించుచున్న యా రోజులలో తమిళనాడు రాజకీయ కలహములచే అట్టుడికి నట్లుడికి పోవుచుండెను. మధురను రాణి మీనాక్షియు, తంజావూరును మహారాష్ట్రులును పరిపాలించుచుండిరి. అక్కడక్కడ కొందరు పాళెగాండ్లు ప్రబలులై యుండిరి. ఆర్కాటు నవాబుల యధికారము నానాటికిని దక్షిణాపథమున ప్రబలమగుచుండెను. మహారాష్ట్ర నృపతుల యుద్ధములు, ఆర్కాటు నవాబుల దండయాత్రలు, కొందరు పాళెగాండ్ల వికటాట్టహాసము—మున్నగునవి తమిళదేశపు ప్రశాంత వాతావరణమును కలుషిత మొనర్చెను.

ఆ యప్రశాంత వాతావరణములో గూడ బెస్కి మతప్రచారమును మానలేదు: భాషాధ్యయనమును విడువలేదు. మీదు మిక్కిలి అతడు కాందిశీకులై వచ్చిన క్రైస్తవమతానుయాయుల నాదరించెను. వారికి గృహవసతి కల్పించెను. శిథిలములయిన క్రైస్తవాలయములను పునరుద్ధరించెను.

మేఘావృతమయిన ఆకాశము మున్నెన్నడో తాను త్రాగిన నీటిని క్రక్కుటచే ఏర్పడిన సెలయేటని చూచి విద్వాంసులు తాము చదివిన గ్రంథములను ఇతరుల కోసము చక్కగా వ్యాఖ్యానము చేయుచున్నట్లున్నదని వీరమాముని 'తేంబావణి'యను కావ్యము నందొక చోట పేర్కొనెను. వీరమాముని సాహిత్య సమాలోచనము చేయునప్పు డీ విషయము సత్యమని స్ఫురించును. మతవ్యాప్తిని మనసులో నుంచుకొనియే బెస్కి భాషాధ్యయన మొనర్చినను, అతడు సృష్టించిన సాహి-

త్యము మాత్రము అన్నిమతములవారియందును విజ్ఞాన వ్యాప్తికి తోడ్పడుచున్నదనుట అత్యుక్తి కాదు.

వీరమాముని యీక్రింది గ్రంథములు రచించెను.

(1) తిరుక్కావలూర్ కలంబగమ్
(2) తేంబావణి
(3) కిత్తేరియమ్మాళ్ అమ్మానై
(4) అన్నైయళుంగల్ అంతాది
(5) అడైక్కలమాలై
(6) తొన్నూల్ విళక్కం
(7) చతురగరాది
(8) వేదియర్ ఒళుక్కమ్
(9) వేద విళక్కమ్
(10) పరమార్థ గురుకథై
(11) ప్రాచీన తమిళ వ్యాకరణము (లాటిన్ భాషలో)
(12) వ్యావహారిక తమిళ వ్యాకరణము
(13) తిరుక్కుఱళ్ (లాటిన్ అనువాదము)

వీనిని వచనరచనలు, నిఘంటువులు, లక్షణ గ్రంథములు, కావ్యములు—అని నాలుగువిధములుగ విభజింపనగును.

## వచనరచనలు :

కడమ భాషలలోవలె తమిళమునందును వచన వాఙ్మయము క్రైస్తవ మతబోధకుల కృషివలననే సంపన్నమయ్యె ననుట సమంజసము. వచనవాఙ్మయ మాకర్షించినంతగా మరియొక సాహిత్య ప్రక్రియ సామాన్యప్రజను ఆకర్షింపలేదు. ఈ సత్యము కనుగొన్న వీరమాముని సామాన్యులకు సైతము సుబోధక మగు సరళశైలిలో తమిళమున పరమార్థ గురుకథను రచియించెను; ఈ పుస్తకము పుదుచ్చేరిలో ముద్రింపబడెను. హాస్య రస ప్రధానమయిన యీ కథ బహుళవ్యాప్తి నందుటయే కాక తెలుగు, కన్నడము, ఆంగ్లము, ఫ్రెంచి, జర్మను మున్నగు ప్రాచ్య పాశ్చాత్య భాషలలోనికి కూడ అనువదింపబడెను. 1861 న ముద్రితమయిన పరమానంద గురువుల కథలు బహుశః పరమార్థగురుకథకు వెలసిన తెలుగుసేత యనదగునేమో.

క్రైస్తవ మతబోధకుల యుపయోగార్థము వీరమాముని 'వేదియర్ ఒళుక్కు'మును రచించెను. ఇది కూడ తరువాతికాలమున తెలుగు కన్నడములందు పరివర్తింపబడెను. బైబిలులో చెప్పబడిన ధర్మములను వివరించుచు నతడు వేద విళక్కమును సంతరించెను. ఈ మూడు వచనరచనలను తమిళ వచన వాఙ్మయమున వెలసిన తొలిరచనలు.

## నిఘంటువులు :

జైనబౌద్ధులయుగమునందే తమిళమున నిఘంటువులు వెలసెను. దివాకరం, పింగలం, చూడామణి మొదలగునవి ప్రాచీననిఘంటువులు. కంఠస్థము చేయుటకు వీలుగా ఈ నిఘంటువులు సూత్రరచనావిధానమున సాగెను. ఇవి కవిపండితులపాలిటి కల్పవృక్షములు; కాని సామాన్యులకు వీనివలన అంతగా లాభము చేకూరలేదు. అందును తమిళము నభ్యసించు పాశ్చాత్యులకీ నిఘంటువులవలన అణుమాత్రమైనను లాభము లేకుండెను. అకారాద్యక్షరక్రమమున తొలిసారిగా తమిళమున నిఘంటువును సంతరించిన చిరయశస్సు వీరమామునికే చెందుచున్నది. నిఘంటువునకు చతురగరాది అనిపేరు. ఇదియే తరువాతి నిఘంటునిర్మాతలకు మార్గదర్శకమైనది.

దివాకరం, పింగలం, చూడామణి మొదలగు ప్రాచీననిఘంటువులలో నున్న శబ్దములను గ్రహించి వీరమాముని వానిని అకారాదిగా చతురగరాదిలో నొసగెను. ఇందులో నానార్థపరిచ్ఛేదము, పర్యాయపద పరిచ్ఛేదము, సమాసపరిచ్ఛేదము అను నాలుగు పరిచ్ఛేదములు గలవు.

తమిళము నభ్యసించు లాటిన్‌భాషాభిజ్ఞుల యుపయోగార్థమై వీరమాముని తమిళము—లాటిన్ నిఘంటువు నొకటి సంతరించెను. ఇందు 9,000 తమిళశబ్దములకు లాటిన్‌లో అర్థము లొసగబడినవి. ఆనాళ్లలో బుడతకీచులప్రాభవ మెక్కువగా నుండుటచే వారియుపయోగార్థమై వీరమాముని పోర్చుగీసు—తమిళము—లాటిన్ నిఘంటువును కూడ సంతరించెను. ఇందులో 4,000 పోర్చుగీసు మాటలకు తమిళములోను, లాటిన్ లోను అర్థము లియ్యబడెను. వీరమామునివరేణ్యుని పాండితీప్రతిభల నవగతము చేసికొనుటకీ నిఘంటుత్రయము చాలును. నిఘంటు రచనా విషయమున తమిళమునకు తమిళు లెవ్వరును చేయని మహోపకారమును వీరమాముని చేసెనని నుడువదగును.

## లక్షణగ్రంథములు:

తమిళమునందలి ప్రశస్తమగు లక్షణగ్రంథములైన తొల్కాప్పియం, నన్నూల్ మున్నగువానిని వీర

మాముని లెస్సగ నభ్యసించెను. అటుపిమ్మట తొన్నూల్ విళక్కమను సమగ్రమగు వ్యాకరణము రచియించెను. సంజ్ఞా, శబ్ద, గుణ, ఛందోలంకార ప్రకరణము లిందు గలవు. తొల్కాప్పియమున గాని నన్నూలునందు గాని చెప్పబడని పలు వ్యాకరణాంశము లీ తొన్నూల్ విళక్కంలో వివరింపబడినవి. ఇదియే దీనియందలి విశిష్టత. ముఖ్యముగా గుణ ప్రకరణము గమనింపదగినది. సాహిత్య శాస్త్రమునకు సంబంధించిన విషయము లిం దుదాహృతము లయ్యెను. వ్యాసము, కవిత, కథ, నవల, నాటకము, ఉపన్యాసము మున్నగు సాహిత్య ప్రక్రియలకు లక్షణములు నిబంధింపబడెను. ఈ గుణ ప్రకరణమును పరిశీలించునప్పుడు వీరమాముని సాహిత్య పరిజ్ఞానము, దూరదృష్టి మున్నగునవి స్పష్టములగును.

ఇదికాక, వీరమాముని తమిళ లక్షణ శాస్త్రమును వివరించుచు లాటిన్‌లో గూడ మూడు గ్రంథములు వ్రాసెను. ఇవి ప్రాచీన తమిళ వ్యాకరణము, వ్యావహారిక తమిళ వ్యాకరణము, క్లావిస్ అనునవి.

భాష ప్రగతి శీలాత్మక మగుటచే, కావ్య భాషకును వ్యావహారిక భాషకును నడుమ కొన్ని భేదము లేర్పడుట సైజము. దీనిని గుర్తించి వీరమాముని తమిళ కావ్య భాషకును, సజీవమగు తమిళ భాషకును విడి విడిగా లక్షణ గ్రంథములు రచియించెను. ఇవి లాటినులో ఉండుటచే, తద్భాషాభిజ్ఞుల యుపయోగార్థమై వీనిని వీరమాముని సంతరించె ననుట స్పష్టము. ఛంద శ్శాస్త్రమును వివరించునదే క్లావిస్.

## కావ్యములు:

శిలప్పదికారము, మణిమేకలై, జీవకచింతామణి, కంబరామాయణము మొదలగునవి తమిళ మహాకావ్యములలో చాల ప్రసిద్ధములు. ఏ భాషయందైనను ప్రాచీనసాహిత్యము—ముఖ్యముగా కావ్యశాఖ—మతము నంటిపట్టుకొనియే వర్ధిల్లెననుట సుస్పష్టము. అటులనే తమిళమునందును జైన బౌద్ధ శైవ వైష్ణవ మత పరములుగా ప్రాచీన కావ్యములు సంతరింపబడెను. తమిళవాఙ్మయమునందలి లోతుపాతులను తెలిసికొనిన వీరమామునికీవిషయము తెలియకపోలేదు. క్రైస్తవమతపరముగా తమిళమున నొక మహాకావ్యము రచియింపబడవలెనని అత డభిలషించెను. తత్ఫలమే తేంబావణి యను మహాకావ్యము.

తేంబావణి యనగా వాడనిమాల అని యర్థము. ఏసుక్రీస్తును పెంచి పెద్దచేసిన జోసెఫ్ కథ యిందలి యితివృత్తము. ఇది 36 ఆశ్వాసముల కావ్యము; ఇందు 3615 వృత్తములు గలవు. జీవకచింతామణిని, కంబరామాయణమును దృష్టిలో నుంచుకొని వీరమాముని యీ కావ్యమును తీర్చిదిద్దినట్లు పండితులు చెప్పుదురు. ఈ మహాకావ్యమే కాక అతడు తిరుక్కావలూర్ కలింబగమ్, కిత్తేరియమ్మాళ్ అమ్మానై అను లఘు రచనలు కూడ చేసెను.

తమిళ వాఙ్మయమున నాడును నేడును కూడ ప్రసిద్ధిచెందిన నీత్యుద్బోధక గ్రంథము తిరుక్కుఱళ్. ఈ గ్రంథనందలి వైశిష్ట్యమును తొట్టతొలిసారిగా పాశ్చాత్య విద్వత్ప్రపంచమునకు తెలిసినజేసిన ఖ్యాతియు వీరమామునికే చెందుచున్నది. తిరుక్కుఱళులోని ధర్మ, అర్థ ఖండములను వీరమాముని లాటిన్ భాషలోని కనువదించెను. ఈ యనువాదము కుఱళును తమ తమ భాషలలోనికి అనువదించుకొనిన ఐరోపీయ విద్వాంసులకు చాల సహాయపడెను.

తన విద్వత్తును, తన జీవితమును తమిళభాషా సాహిత్యములకు మీదుకట్టిన వీరమాముని **1757** వ సంవత్సరమున అంబలక్కాడులోని క్రైస్తవ మతమున నిర్యాణము చెందెను. డాక్టర్ ఆర్.పి. సేతుపిళ్లై పేర్కొనినట్లు "ఆయన తమిళ ఋషులలో ఒకడుగా పరగణింపబడుచున్నాడు." నిజమునకు వీరమాముని ఋషితుల్యుడే.[1]

---

[1] ఈ రచనలు సంప్రతించబడినవి: కిరుస్తవ తమిళ్ తొండర్—డా. ఆర్. పి. సేతుపిళ్ళై. మేనాట్టు తమిళ విద్వాంసర్—డా. మ. రాజమాణిక్కం.

# అపమానము

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి

రక్తధారా ప్రసిక్త వస్త్రములతోడ
భగ్న కోదండ కాండశితి ప్రభలతోడ
పరుల దారుణ శరపరంపరల కోడి
తిక్కనా, యేల యనినుండి తిరిగి తివు?

క్షత్రియ ధర్మమూని యని శత్రులచేత గతాసుఁడౌటయో,
శత్రులఁ జంపుటొండె పురుషత్వము గాని తలంపగా రణ
క్షేత్రము వీడి గేహమును జేరఁగ జాతికి వన్నె వచ్చునే,
పాత్రుఁ డటందు రేమి పరిపంథికి వెన్నిడి భీతి పాఱినన్?

ఉగ్గుతో వీరరసములో నిగ్గుపోసి శిశువులకుఁ బ్రీతి 'నాతాపి జీర్ణ'మందు
రాంధ్రమాతలు, దాని కొసంత యేని నీదు కడుపున లేదొ జీర్ణించి నేఁడు.

చలము వహించి యుద్ధమునఁ జచ్చి గతాసుఁడవౌదువేని ని
శ్చలమగు స్వర్గముం గనుదు, శాత్రవఘాత మొనర్చెదేని గా
సిరియును స్వచ్ఛమౌ యశము సేకుఱు కాదన నిట్టు లెల్ల నా
రిలవయి రెంటికిం జెడిన రేవడ వౌదువె ఖడ్గతిక్కనా.

నేఁడో రేపో మనము మరణించుమాట సత్యము ధరిత్రి మీఁదనో జలములోనో
ఇట్లు ప్రాణముపైఁ దీపి యేల, వినవొ పలుక 'జాతస్య మరణం ధ్రువం' బటంచు.

శాత్రవకార్ముక జ్యానినాదము రోదసీగహ్వరము మారుమ్రోగుచుండ,
పరరాజకుల జయధ్వజ సంవితానంబు లెక్క సెక్క మ్మొనరించుచుండ,
శత్రుధను ర్ముక్త శరధారలు శరధారలు వోలె రణభూమి రాలుచుండ
వైరిశస్త్ర చ్ఛిన్న వీరరక్తంబు భండనసీమ ప్రక్షాళనమ్ము సేయ,
'ఆంధ్రపౌరుషజ్వాల చల్లారెనే స్వ రాజ్య నిర్వాహదక్షు వీరవరు లెచట
లేరె' యని రాజ్యలక్ష్మి కన్నీరు నిడ్డ యెట్లు సూచి తిక్కనార్య, సహింతువయ్య.

బ్రతికిన నాల్గునాళ్లను పరాక్రమ మూని భళీ యనంగ కీ
ర్తికయి వీరధర్మము భరించి నుతింపఁగ నెల్లవారు భా

# అవమానము

రతపురుషుండవై కులపరంపరగాఁ జనుదెంచు దేశసే
వ తనును గాని భీరుగతి ప్రాణము దాచుకొనంగ నెంచెదే.

అరి విదారణ దారుణమైన కరము కదన రంగస్థలమ్మున పదను కత్తి
సాచి శాత్రవోత్పాటన మాచరించు నాఁడుగా భవదీయ జన్మ సఫలమగు.

అనుచు జను లాడుకొనుచుండు నంతలోన శీఘ్రగతి వాని సౌధమ్ము జేర్చె హయము
చూపులోఁ దమ భావవిస్ఫూర్తి మెఱయ నొకరినొకరు చూచుకొనిరి యువిదలెల్ల.

స్నానమును జేయఁబోవ మంచమ్ము చాటు పెట్టి పసుపుటుండయు నీళ్లబిందె విడియె
భార్య యిదియేమి యని చోద్యపడిన తిక్క వీరుతో నిట్టు లనియె నా వీరపత్ని.

"పగరకు వెన్నిచ్చినచో నగరే నిను మగతనంపు నాయకు లెందున్
ముగురాడువారి మైత్రిమి నగ పేటికి జలకమాడ వచ్చిన చోటన్."

భోజనము సేయ లోనికిఁ బోవ తల్లి భాజనములోన విఱిగిన పాలు పోసె,
అమ్మరో, యిది యేమని యడిగినంత పెదవులన్ విర్చి యిట్లనె వీరమాత.

"అసదృశముగ నరివీరుల మసిపుచ్చక విఱిగివచ్చు మగఁడంక్రియన్
గనవున్ మేయఁగఁ బోయిన పసులున్ విఱిగినవి తిక్క, పాలున్ విఱిగెన్."

విఱిగిన పౌరుషాన రణవీరుఁడు వీటిని జేరినంత నే
విఱిగెను వంటయింటఁగల పెర్గును పాలు నటంచు పల్కి నా
విరసపు మాటలన్నియును వీనుల ములుకుల వోలె సోఁకగన్
విఱిగెను తిక్కనార్యు మది వేఱిక పల్కులు సేయు నేటికిన్.

కుసుమకోమలమైన యతిసుకుమార సుందరశరీరవల్లికయందుఁ గూడ
క్రూరవిషభావముల్ గ్రక్కు దారుణాశ్మ సదృశమైన యీ కర్కశహృదయ మేల?

కఠిన పాషాణభయద విగ్రహమువంటి కర్కశోత్తుంగ భీకరకాయమందు
లలితమౌ రసాల నవపల్లవమువంటి మృదులమైన యీ సుకుమార హృదయమేల?

కుసుమములకంటె నొకమఱి కోమలంబు లుపలములకంటె నొకమా రతిపరుషములు
చిత్రములు సూవె మగువల చిత్తవృత్తు లరయ మగవారి కెందు సాధ్యమ్ముగాదు.

కోపతీవ్రత నొక్కకోమలి డాకాల తననాథు మూర్ధంబు దన్నివేసె
కామతీవ్రత నొక్క కనకాంగి పరకాంతు బిగ్గఁ గౌగిలి వట్టి యేచ్చె,
పెంకియై యొకతన్వి ప్రియుని చెప్పఁగరాని పలుకీతి బాధలపాలు చేసె,
లోభియై యొక్కతలోదరి నాథు సర్వస్వమ్ము హరియించి భంగపఱచె,
పరుల హృదయంబు నెంతయు నరయఁజోని పరమ తీవ్రభావావేశపరులు బహుళ
శీఘ్రకోపులు నిగ్రహ చిత్తహీను లతివ లుచితానుచితశూన్యమతులు గారె.

ఎట్లొ స్నానమాడియు భుజియించి లేచి దీర్ఘనిశ్వాసపవనసందీప్తుఁ డగుచు
నిశ్చలుం డయి మొగసాల నిలచె, వ్రేలు ముక్కుపై నేసి, పంకించి మూర్ధము కృత
నిశ్చయుం డయి తా నిక నిల్వరాదటంచు, హయము నారోహించి యడికి వెడలె.

వైరి శస్త్రవ్రణమ్ములఁ బాటి సేయనట్టి ధీరచిత్తుఁడ వయో, యబల లాడు
పలుకు లెల్ల నీ హృదయాన ములుకు లగుచు మర్మభేదమ్ము చేసెనే మానధనుఁడ!

ఆ మహాకాళరాత్రి భయానక మయి
ప్రళయకాల సంభూత రౌద్రమ్ముతోడ
సమర మొనరించుచుండ తేజంబొకండు
వెడలె యందుండి తారకావీథిఁ జేర.

‘బ్రాహ్మణుండవు పోరు సల్పంగఁ దగదు
మాకు సీతోడ’ నని రాముమాడ్కి పలుకు
రిపులఁ దెగఁజేయఁ దొడఁగి పోరిన త్వదీయ
కీర్తి వాసించు భార్గవు కీర్తిపోలె.

# అంగజాస్త్రము: అనంత అప్పకవుల మతాలు

శ్రీ రావూరి దొరస్వామి శర్మ

అనంతామాత్య కృతమగు ఛందోదర్పణము తృతీయ ముద్రణము నాచే బహిష్కృతమై నా సమీక్షతో వావిళ్ల వారిచేఁ బ్రకటింపఁబడినది. అంతకుఁ జాలకాలము ముందు ఛందోదర్పణమును విమర్శించుచుఁ గొన్ని వ్యాసములు వ్రాసి ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలలోఁ బ్రకటించియుంటిని. ఆ వ్యాసములలోని కొన్ని విషయములను సంగ్రహముగా నీ సమీక్షలోఁ జేర్చితిని.

అందు అర్ధసమ విషమవృత్తములఁ గూర్చి యిట్లు వ్రాసితి (81. పుట)

"అంగజాస్త్రము : అనంతుఁడు దీనిని స్వస్థాన విషమవృత్తమని చూపినాఁడు.

భూరి భయంబుల్ పొంగుసగం బిం
పారఁగ నర్థంబై యట సామున్
శౌరీ విస్మయజంబు గాంతమై
యారూఢంబగు నంగజాస్త్రమున్.

'ఒక ఛందంబున నొగిఁగొని పాదముల్ వేఱైన స్వస్థాన విషమ మయ్యె'నని యనంతుని నిర్వచనము. ఒకేఛందమునఁ బుట్టిన నాలుగుభిన్నవృత్తములు నాలుగు పాదములందున్న స్వస్థాన విషమవృత్త మగునని పై నిర్వచన భావము. పై లక్ష్యమునఁ బూర్వార్ధమున 'భ - మ - - స - గ' గణములు, ఉత్తరార్ధమున 'మ - స - జ - గ' గణము లున్నవి. నాల్గు పాదముల భిన్నవృత్తములు లేవు. పై లక్ష్య పద్యము స్వస్థానార్ధ సమవృత్త లక్షణ ప్రకార మున్నది. అనంతుఁడెట్లు విషమవృత్తమని పేర్కొన్నాఁడో దురూహముగా నున్నది. అప్పకవి యంగజాస్త్రమునకు నాల్గు చరణము లందుఁ గ్రమముగా — 'భ మ స గ లు, మ స జ గ లు, మ న య గ లు, ర జ ర గ లు' అనుగణము లుండునని చెప్పెను."

శ్రీ భట్ట వేంకటసుబ్బయ్యగారు అగస్టు భారతిలో దీనిని విమర్శించుచు 'ప్రథమ తృతీయ చరణములు, ద్వితీయ చతుర్థ చరణములు ఒకేఛందమునఁ బుట్టిన వృత్తములు కలదిగా నున్న నది స్వస్థానార్ధ సమవృత్తమని, ఒక్కఛందమునఁ బుట్టిన వృత్తములు వేఱు వేఱుగా (ప్రథమ తృతీయచరణములు, ద్వితీయ చతుర్థ చరణములు ఒకటిగా నుండునట్లు కాక భిన్నముగా ననియర్థము) చెప్పిన స్వస్థాన విషమవృత్తమని, ప్రథమ ద్వితీయ చరణములు తృతీయ చతుర్థచరణములు ఒకటిగానుండునట్లు చెప్పిన యంగజాస్త్రము స్వస్థానార్ధ సమవృత్తముగాక స్వస్థాన విషమవృత్తమే యగునని నిరూపించిరి.

ఈ విమర్శపై నా యభిప్రాయము నిందుఁ దెల్పుచున్నాఁడను.

అనంతుఁడు—'సమపాదము లొకవిధముగా విషమపాదము లొకవిధముగానున్న అర్ధసమవృత్తమని, విషమవృత్తంబులు నెలయుఁ బాదంబులు గణములు వేర్వేఱుగా నొనర్ప...ఒక్కఛందంబున నొగిఁగొని పాదముల్ వేఱైన' స్వస్థాన విషమ మయ్యె'నని అర్ధసమ విషమ వృత్త లక్షణముల నిర్వచించె. 'గణములు వేర్వేఱుగా పాదముల్ వేఱైన' అనియుంటచే అన్ని పాదములు భిన్న భిన్న వృత్తములు గలవిగా నుండవలెనని యర్థము చెప్పితిని. విమర్శకులు 'స్వస్థానార్ధ సమవృత్తమునందుఁ జెప్పిన లక్షణముకంటె వేఱైన విధముగా ననియర్థము చెప్పవలయును' అని వ్రాసిరి. ఈ యర్థము పై సీసపంక్తులచే విస్పష్టము గాదు గాని యనంతుని లక్ష్యములఁ బట్టి వారు చెప్పినయర్థము గ్రాహ్యమగును. దీనిని దెలిపినందులకు వారికి నా ధన్యవాదములు.

పరిశీలింపఁగా అనంతునికిఁ బూర్వము వెలసిన కవిజనాశ్రయ కావ్యాలంకార చూడామణులలోను, దర్వాత రచితమైన చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహములోను విమర్శకులు చెప్పిన అనంతునిమతమే కానవచ్చుచున్నది. పై లాక్షణికులు అంగజాస్త్రమును స్వస్థాన విషమవృత్తముగానే యుదాహరించిరి.

సంస్కృత వృత్త రత్నాకరమున నిట్లున్నది:

'ప్రథమాంఘ్రి సమో యస్య
తృతీయ శ్చరణో భవేత్,
ద్వితీయ స్తుర్యవ ద్వృత్తం
తదర్ధసమ ముచ్యతే.
యస్య పాదచతుష్కేపి
లక్ష్మ భిన్నం పరస్పరమ్,

త దాహు ర్విషమం వృత్తం
ఛందశ్శాస్త్ర విశారదాః.'

ఇందు అర్ధసమ వృత్తలక్షణ మనంతుఁడు చెప్పి నట్లే యున్నది. పాద చతుష్కము భిన్న లక్షణము (వృత్తము)గలది విషమవృత్త మగునని పై శ్లోకము తెల్పుచున్నది. ఆ ప్రకారము అంగజాస్త్రము విషమ వృత్తము గాఁజాలదు. వృత్తరత్నాకరమున అంగజాస్త్రము చెప్పఁబడలేదు. అందు ఇట్టి వృత్తములు (ప్రథమ ద్వితీయ పాదము లొకవిధము, తృతీయ చతుర్థ పాదము లొకవిధము, ఒకపాద మొకవిధము తక్కిన మూఁడుపాదము లొకవిధము అను రీతినుండు వృత్తములు) ఉపజాతి భేదములుగాఁ జెప్పఁబడెను. సంస్కృత విషమ వృత్తాధికారములోఁ దెలుఁగుఛందము లోని అంగజాస్త్రాదులు గానరావు. తెలుఁగు ఛందః కర్తలు చెప్పని, తెలుఁగులో వినియోగము లేని పదచతురూర్ధ్వ, ఉద్గతా, ఉపస్థిత, ప్రచుపిత, గాథానామక వృత్తములు చెప్పఁబడినవి.

ఇఁకఁ బ్రస్తుతము : సమపాదములు విషమ పాదములుగాని పూర్వార్ధము ఉత్తరార్ధముగాని తమలోనన సరిగా నున్న వృత్తములు గలవైనచో అర్ధ సమవృత్తము లగు ననుటలో విరోధమేమో ? పూర్వార్ధ మొకతీరుగా ఉత్తరార్ధ మొకతీరుగానున్న వృత్తము అర్ధసమము గాక విషమ మెట్లగును ? వీని నన్నింటిని బరిశీలించియే కాఁబోలు అప్పకవి విస్పష్టముగా నీ క్రిందిరీతి అర్ధసమ విషమవృత్త లక్షణముల నిర్వచించి లక్ష్యములరచించె. అప్పకవి చెప్పిన లక్షణములు (IV-ఆ-182,183)

“అక్షరములు సమము లయ్యె స్వస్థానార్ధ
సమములందు నాల్గు చరణములను
విషమపదము లొక్క విధము గణంబులు
సమపదంబులొక్క సరిగణములు.

సగమొక్క విధంబునఁ బెఱ
సగమొక్క తెఱంగుగాఁగ సమకూర్పఁదగున్,
జగతి నొక కాలొక కరణి
నొగి మూఁడుపదంబు లొక్క యోజం దనరున్.”

లక్ష్యములు :

ఉపజాతి: 1=3-ఇంద్రవజ్ర, 2=4-ఉపేంద్రవజ్ర

సమోపజాతి: 1=2 ఇంద్రవజ్ర, 3=4 ఉపేంద్రవజ్ర.

వైపరీత్యోపజాతి: 1 ఇంద్రవజ్ర, 2=3=4 ఉపేంద్రవజ్ర.

అప్పకవి మతమున స్వస్థానవృత్తములలో పూర్వార్ధ మొకవిధము ఉత్తరార్ధ మొకవిధముగా నున్నను, ఒకపాద మొకవిధము తక్కినమూఁ డొక విధముగా నున్నను అర్ధసమమే యగును. ఇట్టిది యనంతుని మతమున విషమవృత్తము.

అప్పకవి లక్షణము ననుసరించి అనంతుని యంగజాస్త్రము స్వస్థానార్ధ సమవృత్త మగునేగాని విషమ వృత్తము గాదు.

అప్పకవి అంగజాస్త్రమును స్వస్థాన విషమ వృత్తముగానే చూపెను కాని అనంతాదుల లక్షణమునకు భిన్నముగా నున్నది.

అప్పకవి స్వస్థాన విషమవృత్తము నిట్లువ్రాసె

‘చరణములను వర్ణసంజ్ఞలు దప్పక
నాల్గు పాదముల గణములు నాల్గు
విధములై చెలంగు వృత్తముల్ స్వస్థాన
విషమవృత్త సంఖ్య వెలయుచుండు.’ (4-204.)

పై లక్షణము ననుసరించి యప్పకవీయములోని అంగజాస్త్రమున నాల్గుపాదములు వేర్వేరుగా నున్నవి. చూ :

“రంగుభమస్గల్ గ్రాలు మసజ్గల్
పొంగై మన్యగముల్ రజర్గ లో
పంగా నార్తవ గిరివల్లైతే
నంగజాస్త్ర వృత్త మందగించున్.” (4-209)

ఇందు నాల్గుపాదములందుఁ గ్రమముగా రుక్మవతి శుద్ధవిరాటి, పణవము, మయూరసారి అను వృత్తములు రచితములు.

అనంతుఁడు అంగజాస్త్రమునే కాక వరాంగి నదీప్రఘోషముల స్వమతానుసారము విషమవృత్తములుగా జెప్పఁగా, అప్పకవి యందులకు భిన్నముగా వాని యందు నాల్గుపాదముల నాల్గు వేర్వేఱువృత్తముల రచించెను.

అర్ధసమ విషమవృత్తములలో నింక నిట్లే యనంతాదులకును అప్పకవికిని భేదము గానవచ్చెడు. బహులక్ష్య లక్షణపరిశోధకుఁడగు నప్పకవి ఇట్టి యస్తవ్యస్తములఁ బరిశీలించియే యనంతాదుల మతమునకు భిన్నముగా నిర్బాధముగా నర్ధసమ విషమవృత్త లక్షణముల రచించె ననఁజెల్లును.

అప్పకవి మతము ననుసరించి అనంతుఁడు చెప్పిన అంగజాస్త్రము అర్ధసమవృత్త మగునేకాని విషమ వృత్తము గాదు. ఈ యభిప్రాయముతోడనే నే నట్లు వ్రాసితి. పై సమీక్షలో అప్పకవి యంగజాస్త్రముఁ గూర్చి నేను బ్రస్తావించి యుండఁగా దానిమాత్రమేలకో విమర్శకులు స్పృశింపరైరి. అప్పకవి లక్షణము ద్రోసిరాజని యనంతుని లక్షణము మాత్రమే గ్రహించితిమేని విమర్శకులు వ్రాసినట్లు అనంతుని అంగజాస్త్రము స్వస్థానవిషమవృత్తమగునని యంగీకరింపవలెను.

# జ్యోత్స్నా రాత్రులు

## శ్రీ ప్రభల సత్యనారాయణమూర్తి

ఆ గదిగోడలు నాలుగూ నిత్యం వేయి కిన్నెరలై ధ్వనిస్తూంటాయి, అవిఘ్నంగా!

వేదనాభరితమైన ఆ స్వరం ఆలకించిన ప్రతి హృదయం నిజంగా నీరై పారుతుంది... గుండె స్తంభించిపోతుంది.

ఎన్ని గుండెలు ఆగినా—ఎన్ని నేత్రాలు జాలిపడి నీలాలు రాల్చినా, సుమిత్రాదేవి హృదయాన్ని రంపపుకోత పెడుతూన్న గతించిన ఆ స్మృతుల దుర్భర కాఠిన్యం మాత్రం రవ్వంతైనా తరగదు.

గడచిపోయిన సంగతులు దారుణంగా స్మృతిపథంపైన విలయతాండవం చేస్తూంటే—సహనాన్నంతా కూడదీసుకుని తలఎత్తే వేదనలను త్రొక్కి ఉంచే ప్రయత్నాలలో—విఫలురాలై—విడిచే వేడి నిట్టూర్పు లా కిన్నెరస్వరాలకు తాళాలు వేస్తూన్నట్లుంటాయి, అవ్యక్తంగా!

రాళ్లు కరిగే రాగం... గుండెలు పగిలే తాళం—

రాగానుభూతుల రంపపుకోతల కెరయై కంపించే హృదయం!

“పున్నమచంద్రుని మందహాసములో
ఏ దానాటి జీవకళల ప్రభ?”

—కోటి మూలుగ లొక్కుమ్మడిగా నిలచి కురిపించే ప్రశ్నలు!

అవుపించడం అంటూ ఉంటే—చూచినపుడల్లా చందమామ మందహాసాలు చిందిస్తూనే ఉంటాడు. ఓ నాడా చిన్నిహాసానికే ఉప్పొంగిపోయి ఉరకలెత్తిన మనసు, ఈనాడందులో నర్తిస్తూన్న జీవకళల్నే మాత్రం పోల్చుకోలేకపోగా, నిలచి నిందిస్తోంది నిస్సహాయంగా.

“బ్రతుకుబాటలో నిస్తేజముతో
మట్టిబొమ్మలా మనగలుగుదునా?”

—మనసులో ఉన్న బాధనంతా సుమిత్రాదేవి తన పాటల్లో పొదిగి కిన్నెర మీటుతూంటే, రాళ్ళు కరిగి మరి వరదలై ప్రవహిస్తాయా—అనిపిస్తుంది. ఇహ, నాలాంటి జాలిగుండెలు...

“స్మృతి సమాధిలో చివికిపోయిన
ఉద్వేగా లిక తలలు ఎత్తునా??”

...మధురగాయని అంతర్యంలోని సంక్షోభం అక్షరాల కూర్పుతో—తీవ్రతరమైన నిట్టూర్పులతో ఉవ్వెత్తున వెలికి వస్తోంది...

ఉండబట్టలేక ఓనాడడిగాను, సానుభూతితో మనసు సాన్నిహిత్యం కోరుతూంటే, గద్గదికం నాకంఠస్వరాన్ని ప్రకంపింప చేస్తూన్నా—

“ఇన్ని పాటలు పాడతారు - యిన్ని రాగాలుకడతారు భావానుగుణంగా! సుమిత్రాదేవీ, ఆ ఒక్క పాటే ఎందుకలా కోటిప్రత్యేకతలతో మా ఆలోచనల్ని చెదరగొడుతుందీ, విభిన్నరీతులతో దారుణంగా?”

పాట ముగించి, కిన్నెర తంత్రుల్ని వదులు చేస్తూన్న సుమిత్రాదేవి నిశ్చలదృష్టితో నిశితంగా చూసింది, నాలుగైదు క్షణాలు నా కళ్ళలోకి.

“అదా...” అంటూ ఏదో చెప్పబోయి, మరి ఏ భావాలు చదివిందో ఏమో నా కళ్ళలో—తక్కున తలవంచేసి పాతాళపు లోతుల్ని పరికిస్తూ నా ఉనికిని మర్చిపోయింది.

అలా మరోనాడూ...మరోనాడూనూ!

పరిచయం పరమావధుల్ని చేరుకుంటూనే ఉంది. అయినా, నా యీ కోరికపట్ల ఎందుకట్లా ఆమె ముభావం వహిస్తోందో...

చెబితే నా చిన్నహృదయం అర్థం చేసుకోలేదనా, లేక నా సంస్కారాలకు తప్పుడు విలువలు కడుతూ - నలుగురిముందుకూ పోయి ఆ పవిత్రరహస్యాలను గొంతుచించుకుని నీచంగా ఆలాపిస్తాననా?— ఆమె కిష్టం లేనపుడు పదేపదే అడుగుతూ కష్టం కలిగించటం యిష్టంలేక చిట్టచివరకు నా కోరికను నాలోనే త్రొక్కి ఉంచుకోవలసి వచ్చింది!

అయితే, ఆనాడు పనిగట్టుకుని కబురు పంపించిందావిడ, పనిమనిషి చేత—తీరిక చేసుకుని, ఓసారి వచ్చిపొమ్మని!

కెమిస్ట్రీ 'లేబ్'లో ఉండగా అందిందా వర్తమానం. కోటికంఠాలు కమనీయంగా నన్నాహ్వానించినట్లయింది, విమహోన్నతలోకాలకో! ఇంతకాలానికి నా ఆశలూ, ఆవిడపట్ల నా ప్రత్యేకతలూ చప్పపడిపోయే భయంకరమైన ఈ చివరి క్షణాల్లో నా మొర ఆలకించేటందుకు విచిత్రంగా తలపడుతోంది...

ఆ కళాహృదయం సమస్యకూర్చున్న నా కుతూహలం మన్నించి అపారమైన కరుణను నాపై కురిపిస్తూన్నట్లనిపిస్తోంది.

—బుసబుసలు విసవిసలు చేసుకుంటూ పొంగే ఏసిడ్లూ, తల తిరిగిపోయేలా కంపుకొట్టుకుంటూ ఘాటైన విషవాయువులూ మరొక్క క్షణం 'లేబ్'లో ఉండడం దుర్భర మనిపిస్తుంది.

శిష్యబృందం తలలు వంచుకుని తదేక దీక్షతో టెస్ట్‌ట్యూబులవంక పరికించి చూస్తోంది, గుడ్ రిజల్ట్సకోసం. నెక్స్ట రొటీన్ నిమిత్తం టైంటేబిల్స తయారు చేస్తున్నారు, డిపార్ట్‌మెంటు హెడ్ స్పెషల్ రూంలో కూర్చుని. హృదయం—పాపం—శృంఖలలు త్రెంపుకుని, నావేపు ఉరకలు వేస్తూంటే అటకాయించుకోవాలన్న విశేషమైన ఆందోళనతో తలతిరిగి, బోర్డుమీద తప్పుడు ఫార్ములాలు బనాయిస్తున్న వో—డిమాన్‌స్ట్రేటర్‌కి ఓ సానుభూతిసూచకమైన చిరునవ్వు విసరి, హెడ్‌పర్మిషన్ తీసుకుని బైటపడి ఓరిక్షాలో కూర్చున్నాను. .సంగీతం టీచరింటికి పోనీమంటూ.

ఏ పూర్వజన్మకు సంబంధించిన బాంధవ్యమో మరి, కబురు విన్నవెంటనే పిచ్చిదాన్నిచేసి పరుగు లెత్తిస్తోంది!

రిక్షా ఆగుతూండగానే చిల్లరతీసి సీటుమీదుంచుతూ, టీచ రావిసంగా కబురుచేయడంలోగల ఆంతర్య మేమిటూ అని తబ్బిబ్బవుతూ—రెండంగల్లో పోయి మెట్లవద్ద నిలిచాను... రెండుమూడు మెట్లెక్కానేమో కూడా.

"కనుపాపలు చూపుకరుణ
నవ్వులు చిందే పెదవులు
తేనె లొలుకు మాటలన్ని
ఈ నయవంచనకేనా?"

—మ్రాన్పడి పోయాను! ఆడదాని కంఠంలో ఆవిఘ్నమైన గాంభీర్యం ధ్వనిస్తూంటే, నిలచి ఆలకించే అదృష్టం ఎంతమందికుందో ఈ లోకంలో—ఆడవాళ్ళలోనైనా!!!

క్రింది వాటాలో కాపురముంటూన్న ఓ ఎన్. జి. ఓ. గారి విశవప్పగారు, మేడమెట్లపై నిలబడిపోయిన నా వంక ఓ పర్యాయం వింతగా చూసి, మేడపైనించీ...'మహాప్రళయాని కిది నాంది కాదు గదా' అని భీతిపుట్టించే సంక్షోభానికి తట్టుకోలేక,—కిటికీలో గడ్డంగీసుకుంటూ చేష్టలుడిగి నావేపు చూస్తూ ఉండిపోయిన తన తమ్ముణ్ణి చెరచటానికి చేసే నీచప్రయత్నాలనుకుంటూ నిట్టూరుస్తూ—

"సానికొంపలేనా నయం... కొత్తకాకపోతే కొత్తంతయినా!" అంటూ ముక్కూ మూతీ తిప్పుకుంటూ, ములుకుల్లాటి ఆ పలుకులు నా చెవుల్లో దూరాయి కదానన్న సంతృప్తితో లోపలికి చక్కాపోయింది.

నిలవేసి నా గుండెలమీద ఎవరో సమ్మెటతో మోదినట్లయింది. కఠినాత్ములు...

ఆశ్చర్యం—నాకేమో సుమిత్రాదేవి పాటంటే రాళ్లు కరుగుతాయని విశ్వాసం. సాటివనిత, మరి ఈమెకేమో...

"నాటి వాగ్దానాలన్ని
నీటి వ్రాతలేనా?"

ఈ లోకపు రాగద్వేషాల్తో ఏ ప్రమేయాలూ లేకుండా, బురదలో నిలిచిన పద్మంలా వాటి ప్రభావాలు తనపైన ప్రసరించనీయకుండా—ఏమిటి ఈ సుమిత్రాదేవి?—మెట్ల దిగువనించీ సాధింపులు వినవస్తూనే ఉన్నాయింకా. పాషాణాలకన్నా కఠినమైన పదార్థాలతో తయారించబడతాయేమో, కొందరికొందరి హృదయాలు మరి?

అడుగులో అడుగు వేసుకుంటూ, భారంగా మెట్లన్నీ అధిగమించి, పోయి ద్వారంముంగిట నిలబడ్డాను. ఏ విలయతాండవానికో లయలు పలుకుతోంది సుమిత్రాదేవి వీణ! ఆ ధ్వనులకు అక్షరాల రూపంలో భాష్యాలు వివరించడం ఏ కెమిస్ట్రీ థియరీలవల్లా కాదు, మరి.

నా అడుగుల సవ్వడి విన్నది.

"వచ్చావా—" అంటూ కిన్నెరతంత్రుల్ని వదులుచేసి, ఓ వారగా ఉంచుతూ యుగయుగాలుగా బంధించిఉంచిన హృదయకవాటాలు తెరుస్తూన్నట్లుగా ఆహ్వానించింది. ఆ ఆహ్వానంలోనే నా కుతూహలం తిరిగి ప్రాణం పోసుకుంది. లోపలికిపోయి, తివాసీపై ఆవిడ కల్లంతదూరాన కూర్చుంటూ—కావా

లనే "టీచరుగారూ—" అంటూ చాలా మంకుగా చూస్తూ ఆవిడ నేత్రాల్లోకి, పిలిచాను - హృదయం ఎంతగా తరుణం కాదు సుమా అని అభ్యంతరాలు పలుకుతూన్నా ఆలకించకుండా. ఏ విద్యుత్తు ప్రవహించిందో తత్ఫలితంగా ఆమెలో, నిలువెల్లా కంపించిపోయింది. కుమిలే ఆత్మని చితకబాదిచానేమో—కానీయ్...

"నన్ను రమ్మని కబురుచేశారు. ఏ అపూర్వమైన సంఘటనో తమలో ఏదో విశేషమైన మార్పు తీసుకువచ్చి ఉంటుందని భావిస్తూ, కబురువిన్న ఉత్తర క్షణంలోనే పరుగుపరుగున చక్కా వచ్చాను. మార్పుల్లేవు సరికదా—మూర్తీభవించిన శోకదేవతలా ఏమిటి చెప్పండి, ఈ విషాదాకృతి?"

"రజనీ—" ఒక్క కేకతో నన్నటకాయించబోయారు మధ్యలో. అయితే నేనా—!

"అటకాయించకండి. సర్వకాల సర్వావస్థల్లోనూ మీ శుభసౌభాగ్యాల్ని ఆకాంక్షిస్తూ ఉంటాను. సౌందర్యవంతమైన మీ ముఖం జీవకళల్తో ఎప్పుడు హాసిస్తుందా అని ఆ శుభఘడియలకోసం వెతుకుతూంటాను. సుమిత్రాదేవీ... ఈ మీ చిన్నారి చెల్లాయి మంకుపట్టును మన్నించండి. నాతోడుగా, మీ రీనాడు—మీ హృదయాన్ని రంపపుకోత పెడుతూన్న ఆ సమస్యని వివరించితీరాలి."

కెవ్వుమని మరో కేక పెట్టిందామె.

తన ఆంతర్యాన్ని మరో వనిత చదివేస్తోందన్న ఆరాటం ఆ కేకలో కోటి కంఠాల్తో ధ్వనించింది. నే నేమీ చలించలేదు. పైగా తెచ్చిపెట్టుకున్న గాంభీర్యం ద్విగుణం అయింది. ఆమె కళ్ళల్లోకి సూటిగా చూస్తూ—

"మీ రెందుచేత—వివాహం చేసుకోలేదు..."

"ర...జ...నీ—!"

"అవును! రజనీయే, కుతూహలం కోటి హాస్తాల్తో తొందరపెడుతూంటే, చిరకాలంగా త్రొక్కి ఉంచిన ఆరాటం తిరుగుబాటు చేస్తూంటే—తట్టుకోలేక!"

నాలుగు క్షణాలు నిశ్శబ్దం. నా యీ పాతిక సంవత్సరాల జీవితంలోనూ ఊహించుకోలేని గాఢమైన నిశ్శబ్దం...

"తెలుసుకుని ఎవరూ చేయగలిగిందేమీ లేదు." దీనంగా—చాలా దీనంగా!

విద్యావతీ—కాలేజీ లెక్చరర్‌గా సమాజంలో ఓ ఉన్నతురాలూ అన్న అహం ఏమైనా ఉంటే, రజనీకిది ఒక సవాల్! అన్నాను—

"ఉంది టీచరూ. నా విద్యా, నా సంస్కారం, తత్ఫలితంగా సంలభ్యమైన సామాజికస్థానం, సాటివనిత దుఃఖాన్ని కొంతయినా ఉపశమింపచేయగల శక్తిమంతమైనవనే గాఢవిశ్వాసం నాకుంది!" అంటూండగానే గుండెల్లో పే అనుమానం కలిగింది, నాకు. భయపడిపోతూ ప్రశ్నించాను: "కాని ... కానీ" యిప్పటికే అంతా మించిపోయిందంటారా?

మౌనంగా లేచి, వీణతీసుకుని కేసులో పెట్టి రావడానికని వెళ్తోంది ఆమె. నేనూ ఆవిణ్ణనుసరిస్తూ అన్నాను, జాలిగా—

"మరో వ్యక్తిపట్ల సానుభూతిని వ్యక్తం చేయడానికే—తలపడి సహాయం చేయాలని సంకల్పించుకోవడానికి సాటిమానవులు శక్తిసంపన్నులు కారనీ—అనర్హులనీ అర్థంవచ్చే భయంకరమైన అభిప్రాయాల్లోనే ఉన్నారా, మీరింకా?"

"ర...జ...నీ..."

భాష్యాలకందని మాతృవాత్సల్యం ఆ మూడక్షరాలకూ అమరత్వాన్నాపాదిస్తోంది.

దీనంగా చూస్తూ రెట్టించాను:

"చెప్పండి చెప్పండి. నీటిరాతల్లా చంచలమైన ఆ వాగ్దానా లేవిటి? అవిఘంగా గాలిని పోగుచేసి మాటలుగట్టి మీ చేతుల్లో ఉంచిన నీచు డెవడు?"

"రజనీ—"

"క్షమించండి మీరిక." ఆవేశంలో ధ్వనించిందీ అపస్వరం. జాలిగా చూసింది, సుమిత్రాదేవి, నావంక. చూస్తూనే ఓ ప్రఖ్యాత రచయిత పేరుచ్చరించింది, వణికే పెదవుల్తో—

"వారు—" అసందిగ్ధంగా వెలువడిన నా ప్రశ్న.

"అవును." ప్రశ్నించిన నా కర్థం అయ్యేలా సూచ్యంగా వెలువడిన సమాధానం; త్రుళ్ళిపడ్డాను.

—ఇటు రాళ్లు కరిగే సంగీతం—అటు ఈ దివ్యగానానికి మానవహృదయాల్ని ప్రకంపింపజేస్తూ శ్రుతులు పలికిస్తూ ఔన్నత్యాలకు తీసుకుపోయే సారస్వతం!

ఎంతటి అపూర్వమైన సమ్మేళనం...

కళాహృదయాలు రెండూ ఒకటిగా ఐక్యమై ధ్వనించే స్వరాలను విరాగాల్తో పోల్చుకోనూ, విశాస్త్రాల సాధారంగా తీసుకుని విలువలు కట్టనూ?

*　　*　　*

వాస్తవాన్ని వీడి ఊహాలోకాల్లో విపరీత స్వభావాలతో, నిర్దుష్టం కాని అభిప్రాయాలతో సతమతమవుతున్న రామచంద్రానికి ఓ విచిత్రమైన క్షణంలో పరిచితురాలైంది, సుమిత్రాదేవి.

ఈనాటి గాథ కాదిది.

ఏనాటిదో యిదమిత్థంగా లెక్కించి చెప్పడానికి పాతపుటలు చిరిగిపోయాయి, జ్ఞాపకాల పంచాంగంలో.

సక్రమమైన రీతిలో పరిణతినందని అతని ఊహాల్నీ, కథనంలోని నైపుణ్యాన్నీ అప్పటికే లోకానికి కళ్ళు తెరిచిన సుమిత్ర చాలా జాలిగా పరిశీలించేది. సున్నితమైన పదజాలంతో, అతనిలోని రచయిత నిరుత్సాహపడకుండా — ఏ భావాలకే మెరుగులు దిద్దాలో — వాస్తవికతను ధ్వనింపజేయడానికే శైలిని ఏ విషయాల్లో వినియోగించాలో — చుట్టూ ఆవహించి తమ తమ ప్రభావాల్ని ప్రసారితం చేస్తూ వ్యక్తుల్నీ వ్యక్తిత్వాల్నీ కబళిస్తూన్న పరిస్థితుల్నీ, మానవస్వభావపు మాధుర్యాన్నీ ఏ ఏ కోణాల్లోంచి పరిశీలించి — ఏఏ రీతుల్లో ప్రతిబింబింపచేయాలో...తన విజ్ఞానం — తన ప్రతిభ — సునిశితమైన తన విమర్శనపాటవం — సాధ్యమైనంతవరకూ బహిర్గతం కాకుండా గోప్యంగానే ఉంచుకుంటూ, అతనిలోని 'రచయిత'కు అనుసరణీయమైన పథాలను చేయెత్తి చూపిస్తూ వస్తూ రామచంద్రం స్థితినే చాలా మార్చివేసింది సుమిత్రాదేవి.

మధుర గాయనీ- విశ్వసౌందర్యవతీ.. ఈ సుమిత్రాదేవి తనపట్ల ఈ ప్రత్యేకతల్ని రూపొందించుకోవడం తన పూర్వజన్మల పుణ్యాల ఫలితం అనుకుంటూ పసివాడిలా వింటూ కూర్చునేవాడా స్థితిలో.

సుమిత్రాదేవి అతనికవితా హృదయానికి ఓ ప్రేరణ. శక్తిస్వరూపిణి తన పురుషుణ్ణి సర్వసమర్థునిగా మహిమాన్వితునిగా తయారుచేసుకుంది — యజ్ఞాలు చేసి నిజంగా — లోకాల కెదురీది—నానా అగచాట్లకూ తలలొంచి !

పరిస్థితులు వక్రించాయి, చూస్తుండగానే.

స్వప్నాల్లో కూడా సందర్శించలేని మహోన్నతస్థాయి నాక్రమించాడు రామచంద్రం. వేలుపెట్టిన ప్రతి విషయం విజయవంతమై అతని ప్రతిష్ఠను వేయింతలు చేస్తూ వస్తోంది. సినిమా రచయితల రంగంలో విపరీతమైన పలుకుబడీ, సంపాదనా కలవాడయ్యాడు.

స్థితిగతులు తారుమారు కావడంతో, తన ఈ మహోన్నతి నాకాంక్షిస్తూ ప్రతినిత్యం పరితపించిపోయే

# జ్యోత్స్నా రాత్రులు

ఓ హృదయం ఈ పురోగమనానికి పునాది అన్న విషయం విస్మరించాడు, పూర్తిగా.

సుమిత్రాదేవి తానై చెప్పలేదీ విషయాన్నంతా. ఆవిడ అర్ధనిమీలిత నేత్రాల్లో అవుపించీ అవుపించకుండా మినుకు మినుకుమంటూన్న కాంతిపుంజాల మెరుపులు చెప్పాయి, అవ్యక్తంగా. మిగిలిన భాగాలు రామచంద్రాన్ని గురించి నాకు లోగడ తెలిసిన సంగతులు.

ఆవిడఆరోగ్యం ఎటువంటిదో అక్షణంలో తెలియవచ్చింది, నాకు. ఆయాసంతో ఎగిసిపడే రొమ్ములూ, తెగిన కిన్నెర తంతిలా కంపించే పెదవులూ, మాట్లాడింది చాలా తక్కువ. మరి ఎంత వేదన పేరుకొని పోకపోతే ఆహృదయం-ఆ మనిషి అట్లా అయిపోతుంది? విశ్రాంతి నివ్వకుండా మాట్లాడిస్తే ఏం ప్రమాదం వాటిల్లుతుందో ఈ గుండెనీరసంప్రాణిసున్నితజీవానికి? క్రమంగా సంభాషణ మార్చి మరునాడు వస్తానని చెప్పి సెలవుతీసుకున్నాను...

* * *

మరునాడు కాదు—ఆ మరునాడూ కాదూ!

రెండుమాసాలు గడిచాయి, తీరిక చేసుకుని సుమిత్రాదేవిని కలుసుకుందామని తరలివెళ్లేటందుకు.

కుడిచేత్తో చీరకుచ్చెళ్ళను కొంచెంగా పైకెత్తి పట్టుకుని, చకచకా మెట్లెక్కుతూన్న నన్ను 'అమ్మాయీ—' అని పిలిచింది, క్రింది వాటాలో ఉంటూన్నావిడ. విసుక్కుంటూ అటు తిరిగి చూశాను.

"పంతులమ్మకోసమా—" ఎంత ఏహ్యం ఆ కంఠంలో !

"మరేనండి—" అంటూనే మరో మెట్టెక్కాను. అయితే ఆవిడ రెట్టిస్తూ పిలిచేసరికి మెట్లు దిగి ఆమెను సమీపించాను.

"పంతులమ్మనా—పాపం, ఆ రోజూ ఏదో ఉత్తరం వచ్చిందమ్మా, చచ్చేటన్ని ముద్రలతో. అది చూసుకుని పంతులమ్మ అద్దేనా చెల్లించకుండా తలుపు తాళంవేసి నువ్వొచ్చినపుడు తాళంచెవులు నీ కిమ్మని చెప్పి చక్కాపోయింది. నెలా పది హేనురోజులవుతుంది. కబురుచేద్దామంటే చేతిలో మనుషులు లేరు—"

చటుక్కున నా దృష్టి కిటికీలో కూర్చుని 'క్రైం' పఠిస్తూన్న ఆవిడ తమ్ముని పై పడింది. నా అసహ్యం గమనించినట్లున్నాడు, పాపం నీళ్ళు నములుతూ తల వంచేశాడు. తాళాలు తీసుకుని, నాలుగంగల్లో పైకిపోయి తలుపు తెరిచాను.

గదంతా ఎలా ఉండాలో అలా ఉంది. క్రమంగా నా దృష్టి గోడవారనున్న టేబిల్ పైకి ప్రసరించింది.

తెగిన వీణ...

దానిక్రింద దుమ్ము కొట్టుకుపోయిన ఓలేఖ !

ఒక్క దూకులో వెళ్ళి దాన్ని తీసుకున్నాను.

"రజనీ—

పిడుగులాటివార్త పిచ్చిదాన్ని చేసి, నన్నిక్కణ్ణుంచి తరిమివేసింది. ఏతీరాన సేదపడతానో... ఏగుండాలపాలవుతానో ... రామచంద్రం ప్రఖ్యాత నేపథ్యగాయని లక్ష్మిని వివాహం చేసుకున్నాడు, మొన్ననే. ఈ సమ్మేళనాన్ని చిత్రసీమలో పలువురు ప్రశంసిస్తున్నారు. ఇహ, ఎందుకై నేను వేదనాభరితమైన జీవితాన్ని అన్వేషిస్తూ సాగించాలి?

నా ఉనికి తెలిస్తే అతని శాంతి ఏమవుతుందో—

సంగీతసాహిత్యాలీరూపాన విడివడ్డా, ప్రయోజనాత్మకంగా ఆరూపాన ఐక్యమవుతున్నాయి.

మనశ్శాంతికై అన్వేషిస్తూ, రామచంద్రం రాసిన పాటలు ప్రచారంచేస్తూ తీర్థయాత్రలు సాగించాలని ఉంది.

అతని క్రొత్తపాటలు నువు వినలేదు. ఇటీవలె ముద్రితమయినాయి. ఏయోగినో-ఏ బిచ్చకత్తో మానవ జౌన్నత్యాలకు నూతనవ్యాఖ్యలు ధ్వనింపచేసే పాటలు పాడుతూపోతూ ఉంటే నన్ను జ్ఞాపకం తెచ్చుకో...

సుభాశీస్సులతో

సుమిత్రాదేవి"

నా ఉపేక్ష కోటినాల్కలతో నన్ను పరిహసించింది.

"ఏమయ్యా ఇంతకాలం ప్రాణంలో ప్రాణం అని ఆశలు చూపించి ఆమె విషయం స్మరించకుండా? నిఘవపరిక్షలా – ఆ కళాతపస్విని జీవితంముందు యివన్నీ ఎంత-" నా కనిపిస్తోంది, అప్పుడే నేను కల్పించుకుంటే రామచంద్రం కళ్లు తెరిచి సుమిత్రను గుర్తించేలా చేయగలుగుదు నేమోనని!!!

బాధతో తలఎత్తి తెరిచిఉంచిన వాకిలిగుండా శూన్యంలోకి చూశాను. చంద్రోదయం...

"జ్యోత్స్నా రాత్రులు...

......................

రామచంద్రం రాసినపాట పాడేటందుకు మనసొప్పటంలేదు...సుమిత్రాదేవికట్టిన రాగం నాలికను, పెదవుల్నీ కంపింపచేస్తూన్నాను కూడా.

# సాహితీ సుగతుని స్వాగతం

మన దేశంలో త్రిమూర్తులతర్వాత విశేషంగా పూజ లందుకునే దైవం వినాయకుడు. ఏ కార్య మైనా

"శుక్లాంబరధరం విష్ణుం
శశివర్ణం చతుర్భుజం,
ప్రసన్నవదనం ధ్యాయేత్
సర్వవిఘ్నోప శాంతయే"

అని నిర్విఘ్నంగా కొనసాగడానికి వినాయకపూజతో ఆరంభమౌతుంది. మన కవులూ తమ రచనలను ఇష్ట దేవతా స్తుతితో ప్రారంభిస్తూ, ఆ ఇష్టదేవతలలో వినాయకుణ్ణీ చేర్చారు. నన్నయ

"హరి హరాజ గజాననార్క
షడాస్య మాతృ సరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతి
కి న్నమస్కృతి సేసి"

పిదప వాల్మీకిని స్తుతించి భారతరచన కుపక్రమించాడు. శైవ వైష్ణవమతాలు పరస్పర ప్రత్యర్థులుగా ప్రబలిన పిదప ఈ విఘ్నేశ్వరార్చనం వైష్ణవులలో విష్వక్సేన పూజగా మారింది. వినాయకాదులు (గజానన హయానన షడాననాదులు) విష్వక్సేనుని కింది సేనాపతులని వీరి సంప్రదాయం. ఈగణపతినే ప్రధానదైవంగా పూజించే శాఖవారికి గాణాపత్యులనే పేరు తర్వాత తర్వాత ఏర్పడింది.

ప్రతి కార్యారంభంలోను పూజించబడే యీ దేవుడు భాద్రపద శుక్ల చవితినాడే విశేషంగా ఆరాధించబడడానికి, ఆనాడే వినాయకచవితిగా కొనియాడ బడడానికి కారణం ఏమిటి?

ఇంతటి ప్రాముఖ్యంపొందిన ఈదైవం పుట్టుకను గురించి పురాణాలలో గాథలు పలురీతులుగా ఉన్నాయి.

లింగ పురాణంలో యీ విధంగా వుంది: అసురులు, రాక్షసులు శివునిగూర్చి తపంచేసి, పెక్కు వరాలు బడసి, దేవతలను హింసించే వారట. వారి హింసలకు సహించక దేవతలు శివునికి మొరపెట్టుకున్నారు. శివుడు విఘ్నేశ్వరుని సృష్టించి రాక్షసుల తపస్సుకు విఘ్నాలు కల్పిస్తూ, దేవతలకు తోడ్పడవలసిందని ఆదేశించాడు. ఈతడు విఘ్నాలు నివారించడానికీ, కల్పించడానికీ సమర్థుడు. కనుక అప్పటినుంచి ప్రతి కార్యారంభంలోను వినాయక పూజింపబడుతున్నాడు.

శివపురాణం గణేశ ఖండంలో మరొక విధంగా ఉంది: జయ విజయులు ఒకమారు పార్వతిని దర్శించి శివునికి నంది భృంగ్యాదులు పరిచారకులున్నారు; అలాటివారు ఆమెకూ వుండాలని మనవి చేశారట. దానిని ఆమె పాటించి, ఒకనాడు తలంటుకోబోయి, నలుగుపిండితో ఒక బొమ్మచేసి, దానికి ప్రాణప్రతిష్ఠ చేసి, ఎవర్నీ లోపలికి రానివ్వవద్దని వాకిట్లో కావలి పెట్టిందట. ఇంతలో శివుడు ఆమెకోసం వచ్చాడు. వినాయకుడు అతనిని లోపలికి పోనివ్వలేదు. దానితో శివుడు మహోగ్రుడై అతన్ని శిరశ్ఛేదంచేసి, లోపలికి వెళ్ళిపోయాడు. పార్వతికి ఈ సంగతి తెలిసిం తర్వాత చాల చింతించింది. తను సృష్టించిన బిడ్డను బ్రతికించ వలసిందని బ్రతిమాలింది శివుణ్ణి. శివుడు అంగీకరించి ఉత్తర దిక్కుకు తలపెట్టి నిద్రపోతున్న ప్రాణితల నరికి తెచ్చి అతని మొండానికి అతికించవలసిందని ఆజ్ఞాపించాడట. అలా నిద్రపోయే ప్రాణి అప్పుడు ఏనుగొకటే కనిపించిందట. దాని తలకాయ నరికి ఈ మొండానికి అతికించారు. అప్పటినుండి వినాయకుడు గజాననుడయ్యాడు.

శైవాగమాల్లో ముఖ్యమైన సుప్రభేదాగమంలో మరొకవిధంగా వుంది: శివుడు ఉమాదేవితో హేమ వనంలో విహరిస్తుండగా, ఒక ఏనుగుల జంటను చూచాడు. దానిని చూచినపిదప శివునికి తాను మగ ఏనుగు, ఉమాదేవి పిడి ఏనుగు అయి క్రీడించాలనే బుద్ధి పుట్టింది. వెంటనే ఇద్దరూ అలా చేశారు. అప్పుడు పార్వతి గర్భం ధరించింది. గజాననుడు ఉద్భవించాడు.

శైవాగమ సంప్రదాయాలను పుణికి పుచ్చుకున్న నన్నెచోడుని కుమార సంభవములోను గజానన జనన గాథ ఇలాగే వుంది. పార్వతీ పరమేశ్వరులు రజతనగం పైన గజవనంలో విహరిస్తుండగా ఏనుగుల గుంపొకటి

ఎండ వేడిమికి తట్టుకోలేక అక్కడి సరోవరంలో జలక్రీడలాడ దొడగింది. అప్పుడు

"హృదయాహ్లాదముతోడ బాయక సదా
నైకప్రకారంబులన్
మదనాసక్తి బెనంగుచున్న విలస
న్మత్తేభ విక్రీడితం
బది దాక్షాయణి చూచి కౌతుకరతై
కాలీన భావాభిలా
షదృగత్యుజ్జ్వల దీధితుల్ నెరపె
నీశానాన నాబ్జంపుపైన్."

అప్పుడు శివుడు ఆమె ఇంగితం గ్రహించి—

"సతి గరిణి యగుడు ద్రిజగ
త్పతి గరియై గూడె సతుల భావించిన యా
కృతి గూడ నేర్పు గాదే
యతిశయముగ నింగితజ్ఞులకు ఫలమెందున్."

అపుడు సద్యో గర్భంలో విఘ్నకరుడు కరి వదనము గుజ్జుపాద కరములతో ఉదయించాడు. బ్రహ్మేంద్రాది దేవతలు, ఋషిగణాలు, అఖిల జగజ్జనములు ఆ గజవనానికి వచ్చారు. వారి ప్రార్థన మన్నించి శివుడు ఆ కుమారునికి "శివగణ సురగణ సమస్తగణాధిపత్యాఖిల క్రియారంభాధిపత్యాలతో" యువరాజు పట్టం కట్టాడు. క్రియారంభాధిపత్యంగల ఈ కుమారునికి కోపంవస్తే, పనులకు విఘ్నాలు కలుగుతాయని భయపడి అందరూ విఘ్నేశ్వరుని పూజించసాగారు.

ఈ కుమార సంభవంలోనే తారకాసుర సంగ్రామ ఘట్టంలో

ఉరుతర తనుడగు సద్భట
వరునట్ట నిభంబు శిరము వడి నదికె బలో
త్కరమున బ్రతివీరభయం
కరుడై యుద్ధంబుచేసె గణపతి వోలెన్ (11-170)

అనిభటుని మొండానికి ఏనుగుతల అదికించినట్లు వర్ణన వుండడంవల్ల పిండిబొమ్మ కథకూడ నన్నెచోడుని కాలానికె ప్రచారంలో వుండడం స్పష్టం.

ఈ వినాయకుణ్ని పలుగాథలు, స్తోత్రాలు గజరూపుడు, ఏకదంతుడు, మూషికవాహనుడు, బ్రహ్మచారి, లంబోదరుడు—అని వర్ణించాయి.

"వినాయకో విఘ్నరాజ
ద్వైమాతుర గణాధిపాః,
అప్యేకదంత హేరంబ
లంబోదర గజాననాః"

అని అమరసింహుడు వినాయక పర్యాయాలిచ్చాడు.

ఈ వినాయకచవితి వ్రతాన్ని సిద్ధివినాయక వ్రతమని వ్రతగ్రంథాలు తెలుపుతున్నాయి. "భాద్రపద శుక్ల చతుర్థ్యాం సిద్ధివినాయకవ్రతం. ఇయం రవి భౌమ యోగే ప్రశస్తా" అని ధర్మసింధు కారుడన్నాడు. నిర్ణయసింధువులోను ఇట్లే వుంది. ఈవ్రతంచేసి పాండవులు విజయం పొందారని, ఈ వ్రతాన్ని చేయవలసిందిగా, యుధిష్ఠిరునికి కృష్ణుడే ఉపదేశించాడని స్కాంద పురాణంలో వున్నట్లు హేమాద్రి వ్రతఖండంలో తెలిపాడు. భవిష్యోత్తర పురాణంలోను ఈ వ్రతమాహాత్మ్యం పైన పేర్కొన్నవిధంగా తెలుపబడింది.

వినాయక చవితినాడు చంద్రదర్శనం నీలాపనిందలు కలిగిస్తుందని, తత్పరిహారంగా శ్యమంతకోపాఖ్యానం వినాలని పురాణాలు, వ్రతగ్రంథాలు ఘోషిస్తున్నాయి. ఈ ఉపాఖ్యానాలు అందరికి తెలిసినవే.

ఇది ఇలావుండగా, వినాయకుడు కేవలం విఘ్ననియంతగానే కాక విద్యాధిదైవతంగాను, లేఖన సంప్రదాయ ప్రవర్తకుడుగాను, బ్రహ్మచర్య దీక్షా స్వరూపుడుగాను అనాదిగా పూజలు పొందుతున్నాడు. ఋగ్వేదం

"గణానాం త్వా గణపతిగ్ం హవామహే
కవిం కవీనా ముప మశ్రవస్తమమ్
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనః శ్రుణ్వ న్నూతిభిః సీదసాదనమ్"

అని గణపతిని బృహస్పతిగాను, విద్యాధిదేవతగాను కీర్తిస్తున్నది. యాస్కాచార్యుడు తన వైదికనిఘంటువైన నిరుక్తంలో గణశబ్దం వాక్కుకు పర్యాయంగా చెప్పాడు. సమానార్థద్యోతకపదాలు గణమని, వాటికి అధిపతి గణపతి అని, అతడే బ్రహ్మణస్పతి అని ప్రాచీనాచార్యులు భావించారని మ్యూర్ అనే పాశ్చాత్య విద్వాంసుడు అభిప్రాయపడ్డాడు.

నేటికీ భారతదేశంలోని పలుప్రాంతాలలో "శ్రీ గణేశాయనమః" అని గణపతి నమస్కారంతోనే అక్షరాభ్యాసం జరుపబడుతున్నది. వేదవ్యాసునికి గణాధిపతి లేఖకుడుగా ఉండినట్లు చెప్పేగాథ అందరూ విన్నదే. వ్యాసమహర్షి భారతేతిహాసం రచింపదలచి తగిన లేఖకుడు లభించలేదనే

ఆలోచనలో వున్నాడట. "పరం నలేఖకః, కశ్చిత్ ఏతస్య భువి విద్యతే", అని బ్రహ్మతో మొరపెట్టుకొన్నాడట. అప్పుడు బ్రహ్మ "కావ్యస్య లేఖనార్థాయ గణేశః స్మర్యతాం మునే" (కావ్య లేఖనానికి గణేశుని స్మరించు మునీ) అని వ్యాసునితో అన్నాడట. బ్రహ్మ మాట మేరకు వ్యాసుడు గణపతిని స్మరించాడు. అతడు ప్రత్యక్షమై

"........................
యది మే లేఖినీ క్షణం,
లిఖతో నావతిష్ఠేత"

నేను వ్రాసేటప్పుడు నా లేఖిని ఒక్క క్షణంకూడ ఆగటానికి వీలులేదు. అలాఅయితే వ్రాస్తానని షరతు పెట్టాడట. వ్యాసుడు దానికి అంగీకరించి, "నేనుచెప్పేటప్పుడు అర్థం చేసుకొంటూ వ్రాయి. నీ లేఖిని ఆగకుండా చెబుతాను" అన్నాడు. గణేశుడు సరేనన్నాడు.

ఈ కథ నన్నయ భారతోపక్రమణికలో లేకున్నా అనూచానంగా, జనశ్రుతిగా వస్తూంది. మూల భారతంలోను కొన్ని ప్రతులలో లేదని పండితులు అంటున్నారు. కాని రాజశేఖరకవి (940) బాలభారత నాటకంలో

"వినాయకో య శ్శివయో రపత్యం
అర్థం పుమా నర్థ మిభశ్చ దేవః,
స వర్తతే భారత సంహితాయాం
వృత్త స్తపోభి ర్మమ లేఖకో త్ర."

అని వ్యాసుడే తెలిపినట్లు వ్రాశాడు. ఇది నన్నయ కాలంనాటికే వున్న జనశ్రుతి అని ఆయన వదలివేశాడేమో !

వినాయకుడు బ్రహ్మచర్య దీక్షాస్వరూపుడుగా వర్ణించబడినాడని ఇదివరకే అన్నాను. బ్రహ్మచర్య దీక్షకు మన గ్రంథాలలో చాల ప్రాముఖ్య మివ్వబడింది. బ్రహ్మచర్యం సకలార్థ సిద్ధిదాయకమని మన పూర్వుల విశ్వాసం. కనుకనే విఘ్నేశ్వరునికి వివాహం చేయకుండా పెట్టారు. "విఘ్నేశ్వరుని పెండ్లికి వేయి విఘ్నాలు" అనే సామెతకూడ పుట్టింది.

వినాయకుని వివాహ విఘ్న విషయమై పురాణాలలో ఒకవింత గాథ వుంది. పార్వతీ పరమేశ్వరులు అతనిని పెండ్లి చేసు కొమ్మన్నారట. అన్నిటా తల్లితో తులదూగే కన్య దొరికితే పెండ్లాడుతానన్నాడట విఘ్నరాజు. ఆ జగన్మాతకు సాటి అయిన కన్య ఎలా లభిస్తుంది ! కనుక అప్పటినుంచి యిప్పటి దాక కన్యాన్వేషణ తత్పరుడై శివాలయాలలో మొదట మూషిక వాహనంపై తిష్ఠ వేసుకొని దేవదర్శనానికి వచ్చే స్త్రీలనందరినీ పరిశీలిస్తుంటాడట.

కాని శివ పురాణంలో వినాయకునికి బుద్ధి, సిద్ధి అనే భార్య లున్నట్టు గాథ వుంది. ఒకనాడు పార్వతీదేవి తనకుమారులైన గజానన షడాననులను పిలిచి "నా వద్ద బుద్ధి సిద్ధి, అనే యిద్దరు కన్య లున్నారు. ఏడు సార్లు భూ ప్రదక్షిణంచేసి ముందుగా వచ్చే వారికి ఆ కన్యల నిస్తాను."అన్నదట. వారిద్దరు తమతమ వాహనాలపై యెక్కి భూ ప్రదక్షిణానికి బయలుదేరారట. కాని, యెలుక నెమిలితో పోటీపడడం సాధ్యమా ? కనుక వినాయకునికి చక్కని ఉపాయం తోచింది - మాతృదేవి భూమికన్నా గొప్పది. ఆమెకు ఏడుసార్లు ప్రదక్షిణంచేస్తే భూప్రదక్షిణ ఫలం లభిస్తుంది-అని. వెంటనే అలా చేశాడు. పార్వతీదేవి అతని తెలివితేటలకు మెచ్చి, ఆ కన్య లిద్దరిని ఇచ్చి వివాహం చేసింది. ఈ బుద్ధి, సిద్ధులకు క్షేముడు, లాభుడు అనే యిద్దరు కుమారులు పుట్టారట.

ఈ కథ ఆంతర్య మేమిటి ? బ్రహ్మచర్యంతో బుద్ధి సూక్ష్మత, కార్యసిద్ధి అవుతాయని, వాటివల్ల క్షేమలాభాలు కలుగుతాయనిన్నీ.

తంత్రశాస్త్రంలో వినాయకుడు త్రికోణమధ్యగతుడుగా వర్ణించబడ్డాడు. దీక్షితులవారి "వాతాపి గణపతిం భజేహం" అనే కృతిలోను వినాయకుడు "త్రికోణ మధ్యగతుడు"గా పేర్కొనబడినాడు. ఈ త్రికోణం సమత్రిభుజాలు ప్రపంచ మూలకారణమైన పరమేశ్వరుని ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులను సూచిస్తున్నవని పెద్దలంటారు. ఈ త్రికోణ మధ్యగతుడైన వినాయకుడు ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తి స్వరూపి, క్షేమలాభ దాయకుడును.

ఎలుకలు ఎలా తన వాడి పళ్ళతో భూమిని ఛేదించి బొరియలు చేసుకొని,నివాసాలు ఏర్పరచుకొంటాయో, అల్లే బ్రహ్మచారి తన నిశితబుద్ధితో ప్రతి గహనవిషయంలోను ప్రవేశించగల డనడానికి తార్కాణంగా ఎలుకతో వినాయకునికి సంబంధం కల్పించబడిందని కొందరన్నారు.

కాని కొందరు పాశ్చాత్య పండితులు గణపతి స్వరూపం, పూజనం బౌద్ధమత ప్రభావంవల్ల వైదిక

మతంలో ప్రవేశించాయని అభిప్రాయపడుతున్నారు. బుద్ధుని జన్మవృత్తాంతంతో ఐరావతానికి సంబంధం వుంది. మాయాదేవికి స్వప్నంలో తెల్ల ఏనుగు కన్పించినట్టు జాతక కథలు చెబుతున్నాయి. బుద్ధునికి వినాయకుడనే పేరూ వుంది. "షడభిజ్ఞో దశబలో అద్వయవాదీ వినాయకః" అని అమరకోశంలో బుద్ధ పర్యాయాలలో వినాయక పదమూ వుంది. వినయతి= శిక్షయతి దుష్టాన్, విఘ్నాం శ్చేతి వినాయకః (దుష్టులను, విఘ్నాలను అదుపులో పెట్టేవాడు), విగతో నాయకో యస్య సః (నాయకుడు లేనివాడు, స్వతంత్రుడు) అని వినాయక శబ్దానికి వ్యుత్పత్తులు చెప్పారు. కనుక బౌద్ధమతవ్యాప్తి తర్వాతనే గజానన దైవం వైదికమతంలో చోటు చేసుకొంది—అని వీరి వాదం.

ఈ వాదం అమూలకమని, బౌద్ధమతావతరణము నాటికే వైదిక సంప్రదాయంలో స్థానం కలిగివుండడం చేత బౌద్ధులే తంత్రవిధానంతోపాటుగణపతికి తమవాఙ్మయంలోను స్థానంకల్పించుకున్నారని కొందరు పండితులన్నారు. క్రీస్తుశకం మొదటి శతాబ్దినాటిదని చరిత్రకారులు అనే హాలుని గాథా సప్తశతిలో గణపతి చేష్ట వర్ణించే ఒక చక్కని గాథవుంది:

హేలా కరగ్గ యట్ఠిఅ
జలరిక్కం సాఅరం పఆసంతో.
జఅఇ అణిగ్గ అ వడవ
గ్గి భరిఅ గగణో గణాహివఈ. (5-3)

గజాననుడు సరదాకోసం తన తొండంతో సముద్రంలోని నీటినంతా తోడివేశాడట. సముద్రం వట్టిపోయింది. బడబాగ్ని ఆకాశం కప్పింది. అట్టి అల్లరి చేసే గణాధిపతి జయించు గాక ! అని ఈ గాథ భావం. రెండు వేలనాటిఏళ్ల చాటువులలోనే ఎక్కిన గణాధిపతి బౌద్ధులనుంచి వైదికమతానికి వచ్చినవాడయి వుండడు.

"హిందూయిజం" అనే ఆంగ్ల గ్రంథకర్త శ్రీ గోవిందదాసు వినాయకుడు అనార్యదేవతఅని,ఆర్యానార్య సంబంధం ప్రబలినతర్వాత ఆర్యులచే పూజలందుకో జొచ్చాడని అన్నారు.యాజ్ఞవల్క్యస్మృతిలో ఈ దేవత దుష్టదేవతగా పరిగణించబడ్డాడని, వాల్మీకి యితనిని స్మరించలేదు గనుక రామాయణ కాలంలో ఇతడు కానరాడని, 'గణానాం త్వాగణపతిగ్ం హవామహే' అనే ఋగ్వేదమంత్రం బృహస్పతికి సంబంధించిందేగాని గణేశ్వరునికి గాదని, తర్వాత తర్వాత ఈ మంత్రం ఈ దైవానికి అన్వయించబడిందనీ దాసుగారన్నారు. గృహ్యసూత్రాలలో ఈ దేవత ఒక్కడుగాగాక శలకటంకట, కూష్మాండ, రాజపుత్ర, అజస్మిత, దేవయజనులు—అని నాలుగు దేవతలుగా పేర్కొనబడి ప్రజాకంటకుడుగా చిత్రించబడ్డాడని,యాజ్ఞవల్క్యుని కాలంలో ఈ దేవత ఒక్కటేఅయి పేర్లుమాత్రం శల, కటంకట, కూష్మాండ, రాజపుత్ర, మిత, సమ్మిత అని ఆరు అయాయని ఈయనన్నారు. విఘ్నకారుడు, విరూపుడు అయిన ఈ అనార్యదేవతను ఆర్యులు భయంతో ఆరాధించడం ప్రారంభించి, వైదిక మంత్రాలను సమన్వయ పరిచారని ఈయన అన్నారు.

ఈ గణపతికి పురాణకాలంలో చాల ప్రాధాన్యం ఏర్పడింది. వామాచారం ప్రకారం, తాంత్రిక పద్ధతి ప్రకారం పెక్కు సంప్రదాయభేదాలు ఏర్పడ్డాయి. వాటిలో ముఖ్యమైనవి ఎనిమిది: లక్ష్మీగణపతి, చిక్షిప్ర గణపతి, సిద్ధిగణపతి, చింతామణి గణపతి, శక్తిగణపతి, ఉచ్ఛిష్ట గణపతి, ఏకాక్షర గణపతి, కుమారగణపతి.

వినాయకుడు పంటల దేవుడని రావుబహదూర్ శ్రీ బి. ఎ. సప్తేగారు అభిప్రాయపడ్డారు. ఆయన వాదం సారాంశం ఇది: గణపతిని మూషిక వాహనుడని అంటున్నాము. మూషక శబ్దం "ముష స్తేయే" అనే ధాతువునుంచి పుట్టింది. దొంగ అని దీని అర్థం. అంటే వినాయకుడు క్షేత్ర తస్కరుడైన మూషికంపై సవారి చేస్తున్నాడన్నమాట. ఈ దేవతకు గజముఖం, తొండం-బహుశా ధాన్యం కోతలయిన పిదప వరిమోపును తలపై పెట్టుకొని వెళ్లే రైతురూపం ప్రతిబింబం కావచ్చు. మనదేశంలో పెద్దది అనే భావం తెలుపడానికి ఏనుగు పోలిక చెప్పడం సహజం. కనుక, పంటపొలాలు పాడు చేసే ఎలుకలను జయించి పెద్ద పంట పండించాలనే దానికి ఉపలక్షణంగా ఏనుగుతల, ధాన్యంగాదెవంటి దేహం, మూషిక వాహనంగల దైవాన్ని ఆదిమానవులు సృష్టించుకొని వుంటారని తోస్తున్నది. తాము జయించిన పశుపక్ష్యాదులను తమ దేవతలకు వాహనాలుగా చేయటం పెక్కు విషయాలలో కానవస్తుంది. శివునికి నంది వాహనం. కృష్ణుడు తనుజయించిన కాళీయుని పడగపై నాట్యమాడుతాడు. అలాగే తాను ధ్వంసం చేసిన మూషకం గణపతికి — పంటల దొరకు వాహనం చేశారు. గణపతికి వున్న శూర్పకర్ణ, ఏకదంతాది పర్యాయాలు ఇతడు పంటలదేవుడనడానికి సాక్షి. చేటలు ధాన్యం తూర్పారపట్టడానికి

ముఖ్యమైనవి. ఏకదంతం నాగలికి రూపకల్పన. గణపతికి నివేదించే ఉండ్రాళ్లు, కుడుములు కూడా ఇతడు పంటల దేవత అనడానికి మరొక నిదర్శనం. లంబోదరం—ధాన్యం గాదె—దాని చుట్టు పామును బిగించడం పంటలు పాడుచేసే ఎలుకలను నాశనం చేయడానికి సూచన.

గణపతి విగ్రహాలు చెరువులోనో, బావిలోనో కలిపిన తరువాత అక్కడి ఇసుకో, బంకమన్నో గణపతి విగ్రహం తీసుకొనివెళ్లిన పళ్లెంలో వేసుకొని వస్తారు. ఇల్లుచేరిన తర్వాత దానిని ధాన్యం కణజంలోనో, గాదెలున్న గదులలోనో, సరకులు పెట్టుకొనే ఉగ్రాణపు గదులలోనో చల్లుతారు. అనాదికాలంలో యూరోపులోను, ఇతర దేశాలలోను ఇలాగే చేసేవారట. భారతీయుల గణపతి మెక్సికోలోని ధాన్య దేవతను, టోంగాదీవుల ఆలో ఆలో దేవతను, గ్రీకుల డెమెటర్‌ను, రోమనుల కెరెస్ అనే దేవతను పోలి వున్నాడు.

తమ పంటలు సమృద్ధం కావడానికి, నిర్విఘ్నంగా కృషి కర్మ కొనసాగడానికి మన పూర్వులు నెరవేర్చిన ప్రకృత్యారాధనమే వినాయక వ్రతమని శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారన్నారు. వారి వ్యాసంలో కొంత ఇట ఉదాహరిస్తాను.

"వినాయక చతుర్థి......వర్షర్తులో నుత్తరార్థమందలిది. ప్రకృతియంతయు ప్రౌఢవయః పరిపాకమున రమణీయ దర్శనమైయుండును. అపుడు తొలి కారు సస్యములన్నియు ఫలోన్ముఖములై యుండును. సిద్ధముగనున్న అపూర్వ సస్యఫలాగమము మధ్యాపర సస్య ఫలాభ్యుదయము నిర్విఘ్నముగ సాగవలెనను వాంఛతో నాచరింపబడునది ఈ వినాయక పర్వము.

"వినాయకుని ఏనుగరూపము ధాన్యమునిలువ చేసుకొను మట్టిగాదెను స్ఫురింపజేయును. చెమ్మగిల్లి ఆ గాదె శిథిలము కాకుండుటకై చేసిన యాచ్ఛాదనమును పత్రముల దూర్వాంకురముల పూజ స్ఫురింపజేయును. మూషిక బాధ యనివార్యమగుటను వాహనము సూచించును.

"సర్వ కార్యక్రమము ముగిసిన తరువాత వినాయక విగ్రహమును గాదెలో దాచుట యాచారము. గాదెలో ధాన్య మక్షయముగా నుండవలెనను వాంఛయే యిందులకు కారణము."

పూర్వం రాజాంతఃపురాలలో "హస్తి మంగళం", "హస్తి మహం" అనే వుత్సవాలు జరుపుతూండే వారని జాతక గ్రంథాలలో పేర్కొనబడింది. ఆ నాడు రాజాంతఃపురాన్ని పుష్పమాలికలతో, రంగురంగుల తోరణాలతో, ధ్వజాలతో అలంకరించేవారు. వందమత్తగజాలను బంగారు వెండి నగలతో అలంకరించి పూజించేవారు. దీనికీ, వినాయక పూజకూ సంబంధం వుందేమో విజ్ఞులు ఆలోచించాలి.

భాద్రపదశుద్ధ చవితి నాడే ఈ పూజ ఎందుకనే ప్రశ్న ఇంకా మిగిలేవుంది. దానికి జవాబు చూద్దాం. సర్వకార్యావిఘ్నంకోసం ఈ నాడే వినాయక పూజ చేయాలని భవిష్య, నృసింహ పురాణాలలో వుంది. ఫాల్గుణ శుద్ధ చతుర్థినాడు ఈవ్రతం చేయాలని వరాహపురాణంలో వుంది. భవిష్య పురాణంలోనే మరొక ప్రసంగంలో భాద్రపద మాసంలోనో, శ్రావణ మాసంలోనో, మార్గశిర మాసంలోనో - కాని శుక్ల చతుర్థినాడే—అర్చించవచ్చునని వుండగా, భాద్రపద చతుర్థినాటికే ఎందుకో ప్రాధాన్యం? దీనికి శ్రీ విస్సా అప్పారావుగారు మంచివుపపత్తి చెబుతూ, ఈనాటిదొక ఖగోళదృశ్యమన్నారు. ఆయన అన్న విషయాలు సంగ్రహంగా చెబుతాను: పురణాల దేవతలకు సంబంధించిన గాథలకూ ఖగోళ దృశ్యాలకు పరస్పరసంబంధం కల్పించడం అనాదిగా వస్తున్నది.

"ప్రాతర్యవాణా ప్రథమా యజధ్వం,
నో రనసామయంతి దేవాయా అజుష్టం."

అని ఋగ్వేదంలో వున్నది. సూర్యోదయానికి ముందు తూర్పున ఏనక్షత్రం ఉదయిస్తుందో, ఆ నక్షత్రానికి సంబంధించిన దేవతను ఆనాడు పూజించాలని, లేదా సూర్యాస్తమయంలో తూర్పున ఉదయించిన దేవతనైనా పూజించాలని ఈ ఋక్కు తాత్పర్యం. నక్షత్రాలకు సరైనదేవతాస్వరూపాలుకల్పించబడ్డాయి. సప్తర్షిమండలం-సప్తర్షులు. ధ్రువనక్షత్రం - ధ్రువుడు. ఇలాటివే. ఇలాగే విఘ్నేశ్వరునికి సంబంధించిన నక్షత్రాల గుంపొకటి కల్పించబడింది. చిన్న ఎలుక ఆకారం గల నక్షత్రాలగుంపు, దానిమీద విఘ్నేశ్వర రూపంలో భావించదగిన మరొక నక్షత్రాలగుంపు వున్నాయి. ఈ నక్షత్రాలగుంపు సూర్యోదయాత్పూర్వం భాద్రపదశుద్ధ చవితినాడు ఉదయిస్తుంది. అందువల్ల ఆనాడు ఈ సిద్ధి వినాయకవ్రతంచేసే ఆచారం పుట్టివుంటుంది. ఆ మర్నాడే సప్తర్షి మండలంలోని పడమటిభాగం సూర్యోదయాత్పూర్వం ఉదయిస్తుంది. కనుకనే ఆనాడు ఋషి పంచమీవ్రతం చేస్తారు.

# సాహితీ సుగతుని స్వాగతం

అంతేకాక భాద్రపదశుద్ధ చవితినాడు సాధారణంగా హస్తానక్షత్ర మవుతుంది. అంటే ఆనాడు చంద్రుడు హస్తానక్షత్రంలోవుంటాడు. హస్తానక్షత్రం ముంజేతి ఆకారంతో వుంటుంది. కనుక అనాటి చంద్రునికి హస్తిత్వం కలిగింది. ఆనాడు సూర్యోదయాత్పూర్వం వినాయక నక్షత్రం వుదయిస్తుంది గనుక వినాయకుడు హస్తి-హస్తంకలవాడు-అయాడు. ఆ నాటిచంద్రుడు బోసినోటితోనవ్వుతున్నట్టుకనిపిస్తాడు. చంద్రగోళమంతా భూమిమీదినుంచి ప్రతిఫలించిన సూర్యకాంతితో సుంద్రంగా కనబడుతుంది. దీనినిబట్టి విఘ్నేశ్వరుని చూచి చంద్రుడు నవ్వినట్టు కథ, శ్యమంతకకథ కల్పించబడ్డాయి. ఈ శ్యమంతక మణిలోని సింహం సింహరాశి. శ్యమంతకమణి సూర్యుడు. జాంబవంతుడు సప్తర్షి మండలము-గ్రేట్ బీర్. ఇవన్నీ ఖగోళ దృశ్యాలు.

భాద్రపదశుద్ధ చతుర్థికి ఆరు నెలల తర్వాత ఫాల్గుణశుద్ధ చవితినాడు విఘ్నేశ్వర నక్షత్రంసూర్యాస్తమయ సమయంలో తూర్పున వుదయిస్తుంది. ఆనాడు పుత్రగణపతి వ్రతం పంచాంగాలలో వుంటుంది. ఇలా ఖగోళ దృశ్యాలను పురాణ గాథలకు ముడిపెట్టడం ప్రాచీనకాలంలో అన్ని దేశాల ప్రజల ఆచారం.

దీనినిబట్టి వినాయక చతుర్థి భాద్రపదశుద్ధంలోనే చేయడానికిగల కారణం స్పష్టమైంది.

వినాయకుని గజానన సత్వానికి నక్షత్రమండల సన్నివేశమే కారణం. చంద్రుడు ఖగోళచక్రంతో ఒకమారుతిరిగి రావడానికి 27 రోజులు పడుతుంది. అందుచేత దాన్ని ఇరువదేడు భాగాలుచేయగా అశ్విన్యాది నక్షత్ర పరిగణ ఏర్పడింది. ఈ మార్గంలోనే సూర్యుడు కూడా తిరిగి రావడానికి సంవత్సరం పడుతుంది. అందుచేత ఈనక్షత్రాలను పన్నెండురాసులుగా రూపకల్పనచేశారు. ($12 \times 2\frac{1}{2} = 27$) అశ్విని, భరణి, కృత్తికలో నాల్గవవంతు చేరి మేషరాశి అవుతుంది. నేటివలె పూర్వం ఈరాశి నిర్ణయం అంత నిశితంగా లేదు. పరిశీలన కొనుకొను నిశిత నిర్ణయం జరిగింది. ఒకప్పుడు ఆర్ద్రా నక్షత్రం వృషభరాశిలో చేర్చారు. (అశ్విని భరణి కృత్తిక-మేషం; రోహిణి మృగశిర, ఆర్ద్ర-వృషభం) ఇది లెక్కకుసరికాదని తెలియగానే దాని తర్వాత రాశి అయిన మిథునంలో ఆర్ద్రను చేర్చారు. ఇదొక కథగా కల్పించ బడింది.

రోహిణి, మృగశిర ఆర్ద్రలు ఆకాశంలో గజవీధి అనేదానిలో వుంటాయి. ఈ గజవీధి పైభాగమైన ఆర్ద్రానక్షత్రాన్ని గజవీధినుంచి తీసివేసి మిథునరాశిలో చేర్చడం గజాసురుని తల నరకడం. ఆర్ద్రను పునర్వసుతో చేరిస్తేకాని మిథునరాశి ఏర్పడదు. మిథునమంటే పురాణదంతులైన శివపార్వతులు. ఆర్ద్ర చేరక పూర్వం పార్వతి (పునర్వసు) ఒంటరి. తనభర్త జాడ తెలియక గజవీధిలో గజాసురుని గర్భస్థుడైవున్నట్లు తెలిసి విష్ణువును వేడగా (సూర్యుని వేడగా) అతడు సరిదిద్దినట్లు కథ. ఆర్ద్ర రుద్ర దేవతాక నక్షత్రం. అది వృషభ రాశిపైన సూర్యాస్తమయ సమయంలో గోచరిస్తుంది. కనుక శివుడు వృషభవాహనుడు. శివుని వాహనమైన నంది గజాసురుని చంపి పార్వతితో శివుని చేర్చటం కథ.

ఇవన్నీ పరిశీలింపగా బ్రహ్మచర్య దీక్ష, విద్యార్జాత, పంటల అభివృద్ధి, నక్షత్రమండల సన్నివేశం, పురాణగాథలు మొదలయినవెన్నో సహస్రాబ్దాలుగా కలగాపులగమై ఈ పండుగ ఏర్పడినట్లు భావించవచ్చు.

భారతీయసంస్కృతి విస్తరించినపిదప, వినాయకుడు చైనా, జపాన్, ఇండోనీసియాలలోను దేవుడుగా వెలసినాడు. జపానువారు వినాయకుని "బినాయికియా" అంటారు.

—రామచంద్ర

# నాట్యమాడే వెలుగు

శ్రీ శంకరంబాడి సుందరాచార్య

ఓ వెలుగు, నా వెలుగు
ఇలను నింపే వెలుగు;
కనుదోయి ముద్దాడి,
కదలి పోయే వెలుగు;
చిత్తమ్ములో సుధలు
చిలికేటి వెలుగు,
నాట్య మాడెను సహో!
నా బ్రతుకు నడుమ.

ఈ వెలుగు చూడరా
నా వలపు చెలికాడ!
ఈ వలపు తంతులను
ఎగమీటి పోవురా,
ఈ వెలుగు చూడరా,
నా వలపు చెలికాడ;

వినువీధి విచ్చెరా
పెనుగాలి వీచురా,
లోకమంటే నవ్వ
ప్రాకు లాడిదిరా;
వెలుగుల్ల కడలిపై
విరివిగా తెరచాప
చెలువు సీతాకోక
చిలుక విచ్చిందిరా!
తెల్ల కలువల తోడ
మల్లె పూవులు గూడి
వెలుగు తరగల కొనల
వెల్లి బ్రాకుచుండెరా!

పసిడి ఛాయల తోడ
పరచి పోయిన వెలుగు
విరివిగా జలదాల
వెదజల్లబడినది,
రంగు రంగుల వేయి
రత్న రాసులు గురియ
ఈ యాకులో నుండి
ఆ యాకు వరకూ,
పట్టరాని ముదము
పరివి పోయింది:

అంతు పొంతే లేని
ఆనందమునకు
దరిమించి మిన్నేరు
పొరలి పారింది;
వరదలై మోదాలు
పొరలి పారాయి.

(రవీంద్రుని గీతానికి అనువాదం)

# శ్రీరాముని రాజ్యకాలము

శ్రీ దుంపల రామిరెడ్డి

పూర్ణ మానవుడగు శ్రీరామచంద్రుడు లోక సామాన్యముగ సుఖదుఃఖాదుల ననుభవించెను. దుష్ట శిక్షణ శిష్ట రక్షణముల సేయుచు లోకరంజకముగ పరిపాలించెను. రాముని పాలనలో అకాల మరణములు క్షామాదిబాధలు లేకుండెను. వర్ణాశ్రమ ధర్మములు తప్పక అనుష్ఠింపబడెను. ప్రజా శ్రేయమే లక్ష్యముగ పాలింపబడుటవలన రామరాజ్యమను పేరు చిరస్థాయిగ నిలచియున్నది. ఇట్టి శ్రీ రామపాలనము పదునొకండు వేల వర్షములు సాగినట్లు రామాయణాదులలో వర్ణింప బడినది. రామావతారమంతయు మానవాతీతములుగాని మానవసహజ విషయములతో కూడియున్నందున రాజ్య పాలన కాలము పదునొకండు వేలనుట ఆశ్చర్యకరముగ నున్నది. ఈ వేల సంఖ్యను మార్చి చర్చించి యధార్థ మేమైయుండునో తెలిసికొన ప్రయత్నించుటయే యీ వ్రాత ఉద్దేశము.

రాముని రాజ్యకాలము శ్రీమద్రామాయణమున నాలుగు స్థలములలోనిట్లు వ్రాయబడియున్నది:

(1) దశవర్ష సహస్రాణి
దశవర్ష శతాని చ,
రామో రాజ్య ముపాసిత్వా
బ్రహ్మలోకం గమిష్యతి.
(బాలకాండ 1-97)

(2) ఉత్తర కాండమున 51 సర్గలో 30 వ శ్లోకము పై విధముగనే యున్నది.

(3) దశవర్ష సహస్రాణి
దశవర్ష శతానిచ,
భ్రాతృభి స్సహితః శ్రీమాన్
రామో రాజ్య మకారయత్.
(యుద్ధకాండ 131—10).

(4) దశవర్ష సహస్రాణి
దశవర్ష శతాని చ,
కృత్వా వాసస్య నియతిం
స్వయమే వాత్మనాపురా.
(ఉత్తరకాండ 104—12)

పై నాలుగు శ్లోకముల పూర్వార్ధములన్నియు నొకే విధముగనుండి రాముని రాజ్యకాలము పదునొకండువేలని చెప్పుచున్నవి. మానవత్వమును ప్రస్ఫుటించు నీ అవతారమున పాలనకాలము మానవాతీతముగ నుండుట ఆలోచింపదగియున్నది.

పురాణేతిహాసములలోని భీష్మాది మహారాజులు, దధీచ్యాది మహర్షులు సుదీర్ఘ కాలము జీవించియుండుట వలన శ్రీరాముడును అవతారపురుషుడుకావున అన్నియేండ్లు జీవించి యుండునని సమర్థించుట సరికాదు. రామాయణమునందు వాల్మీకి నాలుగు స్థలములలోను చర్విత చర్వణముగ పై పూర్వార్ధమును చెప్పి యుండుట గమనింపదగిన అంశము. ఈ "దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ" అనువాక్యమునకు పలువురు పండితులు పలువిధములుగ అర్థము చెప్పినారు. సంస్కృత వ్యాఖ్యాతలు దీనినిగూర్చి విశేషముగ చర్చింపక "శతం సహస్ర మయుతం సర్వ మానంత్య వాచకం" అను నిఘంటు వచనము ననుసరించి దశ సహస్ర దశ శతవర్షములనగా బహువర్షములని అర్థము చెప్పినారు. ఆధునికులు రామాయణము ఇతిహాసము కాదనియు కావ్యముగావున నీ విషయములకంత ప్రామాణ్యము నొసగబనిలేదనియు చెప్పుచున్నారు. ఆధునికులలో ప్రాచీన సంప్రదాయములను గౌరవించు వాసు దాసులు తమమందరమున నీవిషయమును ఉత్తర కాండలో చర్చింతునని చెప్పిరి. కాని అది పూర్తిగాకమునుపే స్వర్గస్థులైనందున నీ విషయ మట్లే నిలిచిపోయినది. రామాయణము కావ్య మైనప్పటికిని వేదతుల్యముగావున నందలి ప్రతి అక్షరమును ప్రమాణికమేయని సనాతనపండితుల అభి ప్రాయము. దీనితో నేకీభవించుచు వాల్మీకి వచనము

సప్రమాణమని తెలుపుకొనుచున్నాను. పైశ్లోకపూర్వార్థములకు నాకు తోచిన అర్థ మిది :

కాలమానమున కొన్ని సంకేతములను వాడుట మనకు ప్రాచీనాచారమై యున్నది. కొన్ని చమత్కార పద్యములలోఁగూడ నిట్టి సంకేతములు వాడబడియున్నవి. సంఖ్యామానమునుగూర్చి మన పెద్దలు "తృతీయం శత మిత్యాహుః చతుర్థంతు సహస్రకం" ఇత్యాది ప్రమాణములను వచించినారు. దాని ననుసరించి దశ సహస్రము లనగా పదినాలుగులు నలుబది, దశ శతము లనగా పదిమూళ్ళు ముప్పది అగుచున్నవి. ఈ లెక్క ప్రకారము రాముని రాజ్యకాలము 40+30=70 వర్షములు కావచ్చును. ఈ కాలము మానవాతీతము కాదు. వాల్మీకి ఈ ఉద్దేశముతోడనే పైశ్లోకార్థమును పలుమార్లు వాడెనని భావించుచున్నాను. ఇదే సత్యమైనచో శ్రీరాముని జీవితకాలము 108 సంవత్సరములని చెప్పవచ్చును.

శ్రీరాముని జననాది విశ్వామిత్ర యాగరక్షణ పర్యంతము 12 సంవత్సరములు; వివాహానంతరము అయోధ్యావాసము 12 సంవత్సరములు; వనవాస కాలము 14 సంవత్సరములు; పట్టాభిషేకమునకు పూర్వము 38 వర్షములు; తరువాత డెబ్బదికలిపి మొత్తము శ్రీరాముని కాలము 108 వత్సరము లగుచున్నది. అనగా నిది మానవుని ఆయుః ప్రమాణముతో సరిపోవుచున్నది.

రామాయణకావ్యము పారాయణయోగ్యమైనది. రామాయణ కథానాయకుడగు శ్రీరామచంద్రుని జీవిత కాల వర్షములసంఖ్యయే తరువాత నామజపాగులలో ముఖ్యమై అక్షమాలికలు అష్టోత్తరశతసంఖ్యతో వెలయుటకు కారణమైయుండునని తలచుచున్నాను. నా ఈ అభిప్రాయము తప్పని భావించు విద్వాంసులు సకారణముగ తెలియజేసినచో విధేయుడనై స్వీకరింతునని సవినయముగ విన్నవించుకొనుచున్నాను.

# నైషధము తిమ్మకవి : అతని నివాస స్థలము

## శ్రీ కె. ఎస్. కోదండరామయ్య

నైషధము తిమ్మయమంత్రి యనునతడు 'లక్షణ మంజరి' అను ఏకాశ్వాసముగల గ్రంథమును తెలుగున రచించెను. ఇతడు ఆరువేల నియోగి బ్రాహ్మణుడు ; తండ్రిపేరు పాపయ ; ఇంటిపేరు నైషధము వారు. ఈకవి సంస్కృతాంధ్రములందు ధౌరేయుడట ; మరియు శివపూజా ధురంధరు డట. తిమ్మయ తనగ్రంథమును గరళపురీశ్వరునకు అంకిత మొనర్చెను. కీ. శే. చాగంటి శేషయ్యగారు తమ ఆంధ్రకవి తరంగిణిలో ఆరవభాగమందు ఈ తిమ్మయ కవినిగురించి సంగ్రహముగ వ్రాసియున్నారు.

లక్షణ మంజరియందు కవి తన నివాసస్థలమును పేర్కొనియున్నను, దానిని గుర్తించుటకు సాధ్యము కానందున కాబోలు, శేషయ్యగారు "గరళపురి, కపిలానదు లెచ్చటనున్నవో, అవి యేమియో తెలియరాలేదు." (చూ. పు. 236) అని వ్రాసి యున్నారు. అందువలన ఈ కవి నివాస స్థలమును ఈ వ్యాసమున దెలియజేయుచున్నాను.

లక్షణమంజరికర్త తన నివాసస్థలమును గురించి యీరీతిగ జెప్పియున్నాడు: "సీ॥ దీన మందార! కపిలానదీ విహార! ఘన దయాకాంత! గరళ పట్టణ నిశాంతా."

కపిలానది : ఇందు పేర్కొనబడియుండు కపిలానది కావేరీనదికి యొక ఉపనది. ఇది మైసూరు రాష్ట్రమందలి సుప్రసిద్ధ క్షేత్రమైన 'నంజనగుడి' అను పట్టణమువద్ద ప్రవహించుచున్నది. ఈ నదికి కపినీ, కబ్బినీ, అను మరి రెండుపేళ్లుగూడ నున్నవి.

గరళ పట్టణము : నంజనగుడియే గరళ పట్టణము. దీనినే గరళపురి అనికూడ అందురు. ఈ గరళపురిలో శ్రీ నంజుండేశ్వర స్వామివారి ఆలయ మున్నది. నంజుండు డనగా నంజును– విషమును– తిన్నవాడు – శివుడు. తిమ్మయకవి తాను 'శివపూజా విధేయుడు' అని చెప్పుకొని యున్నాడు. "ఇది శ్రీమదుదయాద్రీశ్వర కృపాకటాక్ష సమాసాదిత సంస్కృతాంధ్రభాషా ధౌరేయ, శివపూజా విధేయ, నైషధాన్వయ రత్నాకర సుధాకర......" అని గద్యలో నున్నది. ఇచ్చట పేర్కొనబడియుండు శివుడు, గరళపురిలో 'నంజుండేశ్వరుడు' అను పేరుతో నెలకొనియున్నాడు.

'బ్రహ్మ నారద సంవాదము' అను మహాప్రబంధమును మృదుమధురముగ ఆంధ్రభాషలో వ్రాసిన, కోణిదెన నాగయకవి యిచ్చటివాడే. ఈ కవిని గురించి కొన్ని నెలలకు ముందు ఆంధ్రపత్రిక ద్వారా తెలియజేసియున్నాను.

పూర్వ మీ ప్రాంతమున సంస్కృతాంధ్రభాషా పండితులును, కవులును పెక్కుమంది యుండినట్లు పరంపరగ వచ్చుచుండు విషయములనుండియు, అప్పుడప్పుడీ ప్రాంతమున లభించుచుండు తాళపత్ర గ్రంథములనుండియు దెలియుచున్నది.

# గ్రంథ విమర్శనము

## తెలుగు కావ్యమాల

[ప్రాచీన నవీన కవితా సముచ్చయం. సముచ్చాయకులు: శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు. కేంద్ర సాహిత్య అకాడెమీ ప్రచురణ. డెమ్మీ పుటలు: 400 వెల: 7-50. ప్రాప్తిస్థానం: త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్టణం.]

పరవారి రచనలలోని రామణీయకాన్ని గుర్తించి గౌరవించడమనే సహృదయత ప్రాచీన రచనల పట్ల అహమహమికతో పరుగులు వారినంతగా, సమకాలిక రచనలవైపు మొగ్గదు. కనుకనే సమకాలము వారిని మెచ్చడం సహృదయతకు పరాకాష్ఠ.

ఈ పరాకాష్ఠకు తొలిసారిగా పట్టాభిషేకం జరిగింది తెలుగునాడులోనే. హాలశాతవాహనుడు తన కాలంలో ఆనోట ఆనోట వినిపించే కమనీయ ప్రాకృత కవితలను—పూర్వం వున్నవాటిని, సమకాలికమైనవాటిని—ఏర్చి, గాథాసప్తశతిగా కూర్చి, ఈ రంగంలో తర్వాతివారికి తెన్నులు తీర్చాడు. కాని, హాలునికి వేయేళ్ళ తర్వాతగాని ఈలాటి ప్రయత్నం మరల ప్రారంభం కాలేదు. ప్రాకృత సప్తశతి ఫక్కీని సంస్కృతంలో సంకలితమైన తొలి కవితా కదంబకం కవీంద్రాచార్యుని కవీంద్రవచన సముచ్చయం (11 వ శతాబ్ది). పిదప పేర్కొనదగినవి శార్ఙ్గధరదేవుని శార్ఙ్గధరపద్ధతి, మల్లికార్జునుని సూక్తి సుధార్ణవం (12 వ శతాబ్ది), దేవగిరి యాదవ రాజుల కాలంనాటి బిల్హణుని సూక్తి ముక్తావళి, కుమారదాసుని సదుక్తి కర్ణామృతం (13 వ శతాబ్ది), తెనుగు దేశపు అజ్ఞాత సంస్కృత కవుల రచనలు, మనకిప్పుడు లభ్యం కాని కొన్ని సంస్కృత గ్రంథాలలోని పద్యాలు లభించే వట్టం పోతయార్యుని ప్రసంగ రత్నావళి (1380), వల్లభదేవుని సుభాషితావళి (15 వ శతాబ్ది), అజ్ఞాత ఓఢ్రకవి గ్రథించిన ప్రపంచదర్పణం (16 వ శతాబ్ది) మున్నగునవి కొల్లలు.

వివిధ కావ్యాల ఘట్టాలతో వేరొక ఇతివృత్తాన్ని పొసగించే వింత పద్ధతికూడ సంస్కృతంలో బయలుదేరింది. ఈ పద్ధతి కావ్యాన్ని 'సంచిత కృతి' అంటారు. ఇలాటి సంచితకృతులు సంస్కృతంలో విస్తారం.

ప్రాకృత గాథాకదంబాన్ని సంకలనం చేసుకున్న గౌరవం తెలంగాణాకు దక్కినట్టే తెనుగు సూక్తుల సంకలనసౌభాగ్యమూ తెలంగాణాకే దక్కింది. 14-వ శతాబ్దివాడైన మడికి సింగన రాజనీతి దృష్టితో తనకుముందు, తన కాలంలోను ఉన్న నీతిశాస్త్ర గ్రంథాలలోని విషయాలు సేకరించి సకల నీతి సమ్మతమనే నీతిగ్రంథం కూర్చాడు. ఇతను వెలిగందల వాసి.

> "ఆలోలకల్లోలమగు దుగ్ధనిధి ద్రచ్చి
> దేవామృతము తేటతేర్చుపగిది,
>
> ..........................
>
> కృతులు మునుచెప్పినట్టి సత్కృతులు ద్రవ్వి
> కాంచుకంటెను నొకచోట గానబడగ
> సకల నయశాస్త్ర మతములు సంగ్రహించి
> గ్రంథ మొనరింతు లోకోపకారముగను."

అని సింగన తన రచనాప్రణాళికను వివరించాడు. తెనుగులో సంచిత కృతులలో మడికి సింగనదే మొదటిది. రెండవది ప్రబంధ రత్నాకరం. దీనిని పెద్దపాటి జగన్నాథకవి కూర్చాడు. దీని సమకాలికమైందే సంచిత కృతి మరొకటికూడా లభించింది. ఈ రెండింటిని చేర్చి శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 'ప్రబంధ రత్నావళి' అనే పేర ప్రకటించారు. ఎవరో అజ్ఞాతకవి ప్రబంధమణిభూషణమనే సంచిత కావ్యాన్ని కూర్చాడు. "ఉజ్జయినీ నాథుడగు రాజశేఖరుడు పాండ్యభూపతి పుత్రియగు రత్నసుందరిచే స్వయంవరమున వరింపబడెనను నూతన కథావస్తువు పరిణమించునట్లు నానాప్రబంధపద్యములు పొసగించి" ఈ కావ్యం సిద్ధం చేయబడింది. వీటి రచనోద్దేశం వేరగనుక వీటిని కేవల కవితాకదంబాలనలేము.

ఆణిముత్యాలవంటి ముక్తకాలగుచ్ఛాలు చాటుపద్య మణిమంజరి, చాటుపద్యరత్నాకరాలు. వీటి లక్ష్యం సమకాలిక రచనల అపచయం కాదు.

సమకాలిక, ప్రాచీనకాలిక కవితాస్తబకం ఒక విధంగా రూపుదిద్దుకున్నది శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి 'గోలకొండ కవుల సంపుటి'లో ననవచ్చు. కాని, అది కేవలం తెలంగాణా కవులకే పరిమితం. తర్వాత వచ్చిన వైతాళికులు, మహోదయం, కల్పన, ఉదయఘంటలు, హైదరాబాదు నవ్య సాహితీ సమితి వారి నవ్యసాహితి కేవలం సమకాలిక కవితల సముచ్చయాలు. కరుణశ్రీగారు ప్రచురించిన కల్యాణ కల్పవల్లి ప్రాచీన కవితావల్లరి మాత్రమే. దక్షిణ భారత పుస్తక సంసవారు ప్రచురించిన కావ్యమంజరి ప్రాచీన నవీన కవితాగుచ్ఛమైనా విడివిడిగా రెండు సంపుటాలది. కాగా, యావదాంధ్ర ప్రాచీన నవీన సమకాలిక కవితా కదంబం ఒకే సంపుటిలో పూర్తిగా రూపు దిద్దుకుంది సాహిత్య అకాడమీ వారి "తెనుగు కావ్యమాల"తోనే ననడం అతిశయోక్తి కాదు.

ఈ కావ్యమాల మూడు పేటలుగా గుచ్చబడింది. మొదటి పేటలో నన్నయ మొదలు వేమన వరకు (1000 - 1500) ప్రాచీనుల కవితాకుశేశయాలు, రెండవ పేటలో పెద్దన మొదలు త్యాగరాజు వరకు (1501 - 1850) ప్రబంధ, మధ్యయుగ కవి వాగ్గేయకారుల కవితాపదపారిజాతాలు, మూడవ పేటలో దాసు శ్రీరాములు మొదలు నేటివరకు గల ఆధునికుల కవితాకదంబాలు - మొత్తం 106 గురు కవులవి - గుబాళిస్తున్నాయి.

ఈ కావ్యమాలను శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు ఎంతో సరసతతో, సహృదయతతో గ్రథించారనడం నిస్సందేహం. "ఎప్పటి కప్పుడు నవనవంగా వర్ధిల్లుతున్న ఆంధ్ర సాహిత్యమండలి కావ్యభేదాలను, రీతులను ఇందు ప్రదర్శించుటకు యత్నించితిని. ఆంధ్ర సాహిత్యంలో కేవలం మేలేర్చి కూర్చే ప్రయత్నం కాకపోవడంవల్ల, ఆంధ్ర రసజ్ఞులోకానికి పరమాదరపాత్రములైన కొన్ని కొన్ని రచనల నిందు చేర్చలేకపోతిని. రుచిభేదంవల్ల, పరిశీలన లోపంవల్ల, స్థలసంకోచంవల్ల కూడా ఈ కూర్పు కొంత అసమగ్రతకు పాల్పడి ఉంటుంది." అని అంటూ, ఈలోపాలను మన్నించవలసిందిగాను వారు 'నివేదనం'లో కోరారు.

నిజమే: ఎంత విమర్శైకదృష్టితో చూచినా ఇలాటి మహత్ప్రయత్నాలలో కొన్ని లోపాలు జరగడం సహజం. కాని, చూచీచూడగానే అలాటివి కనిపిస్తే మనస్సు చివుక్కుమనడమూ సహజం.

ప్రథమభాగంలో నన్నిచోడదేవుని, పాల్కురికి సోమనాథుని నన్నయ తిక్కనల మధ్య వేయడంవల్ల అర్థశతాబ్దిగా జరుగుతున్న వాదానికి స్వస్తిచెప్పించినట్లయింది. ఇది చాలబాగుంది. కాని, కాకతీయుల కాలంలో వెలువడిన మహాగ్రంథమైన రంగనాథ రామాయణంనుంచి ఒకటిరెండు గుచ్ఛాలు చేర్చకపోవడం చింత్యం. ఎఱ్ఱాప్రగ్గడ రచనలలో ఏడింటిలో నాలుగు తీసివేసి అయినా కేతన, జక్కన, మంచన, మారనలకు చోటుచేయ వలసింది.

శ్రీనాథుని రచనలను ఏరుకోడంలో కొంత విమర్శకు అవకాశ మిచ్చారు. కూర్చిన పది ఖండికల లోను ఎనిమిది క్రీడాభిరామంలోనివి. క్రీడాభిరామం వివాదగ్రస్తమైనది. అలాంటిదానినుంచి అన్ని గ్రహించడంకంటే, హరవిలాస భీమఖండ శృంగార నైషధాల నుంచి గ్రహించివుంటే సరిపోయేది.

ప్రథమభాగం తాళ్లపాక పెద తిరుమలాచార్యుని వెంకటేశ్వర విన్నపాలలో ఒక విన్నపం చేర్చుకొని మరింత వన్నె హెచ్చింది.

వేమన—కడపమండలంలోని వేమన మత సంప్రదాయాన్నిబట్టి, ఇతర చారిత్ర కాధారాలనుబట్టి—16 వ శతాబ్దివాడనడం స్పష్టం. కనుక రెండవభాగంలో చేర్చవలసినవాడు.

పెద్దన నుంచి ద్వితీయభాగం ప్రారంభించడం ఈ మాలాకారుల కళావైదగ్ధ్యానికి తార్కాణం. అంత వరకు తూర్పున పారుతున్న తెనుగుకవిత పశ్చిమవాహిని అయి సముత్తుంగవీచికలతో ముంచెత్తిన ఘట్టమది. ఈ భాగాన్ని త్యాగరాజు కృతుల సొగసుతో ముగించడమూ ప్రశంసాపాత్రం.

కాని, కుతుబుషాహీలు తెలుగు రాజులకు శత్రువులయినా, తెనుగు జనంతో కలిసిపోయి, తెనుగు కవితాసుధను కుత్తుకబంటిగా గ్రోలి తెనుగు సాహిత్యాన్ని అందలాలపై ఎక్కించారు. వారి కాలంలోనే అచ్చతెనుగు కవిత అనే ప్రత్యేకశాఖ ఏర్పడింది. ఈ శాఖ మహోద్యమమై తిమ్మకవి కాలందాక సాగింది. దీనిలో

# గ్రంథ విమర్శనము

తొలిరచన యయాతి చరిత్ర. దానినుంచి, రసవత్తరాలైన వైజయంతీ విలాస తపతీసంవరణాలనుంచి కొన్ని ఘట్టాలు చేర్చడం భావ్యం కాదా?

ఇలాగే యక్షగానమూ తెలుగు వాఙ్మయంలో - అందులోను దక్షిణాంధ్ర వాఙ్మయంలో - విరియబూసిన పూలకొమ్మ. దీనినుంచి కూడా కొన్ని చిన్న పూవులనో, మొగ్గలనో తీసుకోవలసింది.

నవ్యకవితా ప్రస్థానాచార్యుడు నేనంటే నేనని పలువురు కయ్యానికి కాలుదువ్వుతున్న నేటి పరిస్థితిలో దాసు శ్రీరాములు గారితో తృతీయభాగం ప్రారంభించిన గడసరితనాన్ని పొగడకుండా ఉండలేము. ఔను మరి! కాలాన్ని బట్టే కదా ఈమాలారచన. ఈభాగంలో నాటినుండి నేటిదాక గల పలువురు ప్రముఖ రచయితలతో పాటు అంతగా ప్రసిద్ధులుకాని కొందరూ కూర్చున్నారు. అభిరుచి భేదం. కాదనలేము. కాని, 19-వ శతాబ్ది ఉత్తరార్థంలోను, 20-వ శతాబ్ది పూర్వార్థంలోను ప్రసిద్ధులైన కొందరు విద్వత్కవులు వదలివేయబడడం ఆశ్చర్యం కలిగిస్తుంది.

ప్రాచ్య సంప్రదాయం అతిక్రమించి, పాశ్చాత్య సంప్రదాయం సంతరించుకొని వెలువడిన తొలినాటకం చిత్రనళీయం. పానుగంటివారి రాధాకృష్ణనుండి పద్యాలు గ్రహించినప్పుడు చిత్రనళీయంనుండి, చిలకమర్తివారి గయోపాఖ్యానంనుండి, బలిజేపల్లివారి హరిశ్చంద్రనుండీ కూడా కొన్నిపద్యాలు ఏరుకొనివుంటే బాగుండేది.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి పద్యాలు చేరినప్పుడు వారి దృక్పథం, ఫక్కీ గల జనమంచి శేషాద్రిశర్మ, వావిలికొలను సుబ్బారావుగార్ల రచనలు ఎందుకు చేరలేదో! అవిధంగానే మూన్నాళ్ళ ముచ్చట కడుపుతీపు వంటి ముద్దులుమూటగట్టే పెక్కు ఖండకావ్యాలు రచించిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారివి చేరకపోవడం విచారకరం.

నవీనుల్లో పదవులు, పటాటోపాలు గలవారు ఈ మాల కెక్కారనే అపోహకుకూడా ఈభాగంలో కొంత ఎడం కలిగింది. కొందరివి—అతిపేలవమైనవి చేర్చబడ్డాయంటే అపచారమేమో! "మా తెలుగుతల్లికీ మల్లెపూదండ" అనే రంజకమైన గేయంతో నేకాక, ఇతర రచనలతోనుఎన్నదగిన శ్రీ శంకరంబాడి సుందరాచారి, రాయలసీమనవకవిత్రయంలో ఒకరైన బెళ్లూరి శ్రీనివాసమూర్తి గార్ల రచనలు చేర్చడం భావ్యం.

అత్యాధునికులలో పట్టాభి, బైరాగి, అజంతా గార్ల రచనలలో ఒక్కొక్కటయినా చేర్చవలసినదే. బైరాగిగారు హిందీలోను ప్రముఖ నవకవి.

కవయిత్రులలో పలువురు ఈ మాలచెంతకు రాలేదు. 'స్థలసంకోచం' అన్నది సామాన్య ప్రచురణ కర్తలకుగాని, ప్రభుత్వసంస్థలకు కాదు. కనుక మరి కొన్ని పుటలకు వెనుకాడక మరికొందరిని చేర్చివుండవలసింది.

ఈ కావ్యమాల నవ్యకాల్పనిక కవితా ప్రస్థానాచార్యులైన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'జయగీత'తో సమాప్తికావడం పాఠకులకు సంతోషం ఒనగూరుస్తుంది.

అనుబంధంలో 'కవులనుగూర్చి' సంగ్రహ పరిచయం, కావ్యసూచిక, కవినామసూచిక పొందుపరచబడ్డాయి.

ఏమైనా, శ్రీ కాటూరివారి ఈ ప్రయత్నం ప్రశంసనీయమనే అనాలి. "ఈ ముప్పేట కావ్యమాలను సాహిత్య అకాదెమీ శారదా చరణ కమలములచెంత సమర్పించడం" బహుధా సంస్తవనీయం.

ఉత్తమకావ్యం, ఉత్తమమిత్ర మన్నారు పెద్దలు. ఈ కావ్యమాల స్థూలారుంధతీ న్యాయంగా ఎందుకు, శృంగగ్రాహికగానే ఆంధ్రకవితా సంపదను అందరికి చూపగలదనే ఆశించవచ్చు.

## బాల వ్యాకరణోద్యోతము

[రచయిత: కళాప్రపూర్ణ శ్రీ వఝల చిన సీతారామస్వామిశాస్త్రి, కోడుగంటివారివీథి, విజయనగరము. డెమ్మీక్రౌను సైజు 37+483 పుటలు: వెల రు 6 లు.[

ఆంధ్రభాషకు గల ప్రాచీనవ్యాకరణములు సంస్కృతమున శ్లోకరూపమున కానవచ్చుచున్నవి. ఆంధ్రశబ్దచింతామణి తొలి వ్యాకరణ మనియు, వికృతి వివేకము దాని శేషగ్రంథమనియు కొందరి యాశయము. వీని కర్తృత్వమును గురించియు, కాలమును గురించియు వాదోపవాదము లిప్పటికిని తెగకున్నవి. తిక్కన సోమయాజి కాలములోని వాడగు మూలఘటిక కేతన రచించిన ఆంధ్రభాషా భూషణముమాత్రము ప్రాచీనమైనదని యందరు నంగీకరించుచున్నారు. అది మిక్కిలి చిన్న గ్రంథ మగుటచే వ్యాకరణమును సమగ్రముగా తెలిసి

కొనుట కది ఎక్కువ ఉపయోగకారి కాదు. కావ్యాలంకార చూడామణి, అప్పకవీయము మున్నగులక్షణ గ్రంథములందును కొంతవరకు వ్యాకరణ విషయమున్నది కాని, ఎందును సంగ్రహముగా నైనను సమగ్ర విషయవివేచనము లేదు. గతశతాబ్ది ద్వితీయార్ధమున శ్రీ పరవస్తు చిన్నయసూరి 'బాలవ్యాకరణము'ను రచించువరకును భాషా జిజ్ఞాసువులకు సమగ్రముగ తెలుగువ్యాకరణమును తెలుపగల గ్రంథమే వెలువడలేదు. అయ్యది వెలువడిన కొన్ని యేండ్లకు ప్రౌఢ వ్యాకరణమను నామాంతరముగల 'త్రిలింగ లక్షణ శేషము'ను శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు గారు రచించి, బాలవ్యాకరణమునందు విడువబడిన విషయములను సప్రమాణముగ వివరించిరి. నాటినుండి నేటివరకును ఆంధ్ర వ్యాకరణ జిజ్ఞాసువులకీగ్రంథద్వయమే ఉపాదేయమైయున్నది. సమకాలీనములగు కొన్ని వ్యాకరణములు ఉన్నను వీనికిగల ప్రచారముగాని, ఆదరముగాని ఇతర గ్రంథములకు లేదు. ఇంతేకాదు. భాషా, వాఙ్మయ పరిశోధన చేయువారికి ఇష్టమున్నను—లేకున్నను కూడ ఇవి ఆవశ్యకములయి, విమర్శనశక్తిని వృద్ధిపరుపజాలి నవియయియున్నవి. ఈ గ్రంథద్వయమునందలి బాలవ్యాకరణమునకు విమర్శనతోడి వివరణమే యీ "బాలవ్యాకరణోద్ద్యోతము."

"బాల వ్యాకరణోద్ద్యోతము" ను రచించిన శ్రీ చిన సీతారామస్వామి శాస్త్రులుగారీ యిరువదవశతాబ్దియందలి ఆంధ్ర వైయాకరణ విద్వాంసులలో అగ్రశ్రేణికి చెందినవారు. ఏబది యేండ్లకు పైగా భాషా వాఙ్మయములందు పరిశోధన మొనర్చుచు, మద్రాసు విశ్వవిద్యాలయమున ఆంధ్ర పరిశోధకులుగా కొంతకాలము పనిచేసిరి. విజయనగర సంస్కృత కళాశాలయందును, ఆంధ్ర విశ్వకళాపరిషత్తునందును అధ్యాపకులయి వందల కొలది విద్వాంసులను తయారుచేసిన ఆదర్శగురువులు. శ్రీ శాస్త్రిగారు వసుచరిత్ర విమర్శనము, హరిశ్చంద్ర నలోపాఖ్యాన విమర్శనము, చింతామణి విషయపరిశోధనము, వైయాకరణ పారిజాతము, వ్యాకరణసంహితా సర్వస్వము, ద్రావిడభాషా పరిశీలనము, మున్నగు గ్రంథములను ఆంధ్రలోకమున కర్పించి, గొప్పకీర్తిని సంపాదించిరి. ఇట్టి విద్వద్విమర్శకుల రచనలో అనేకములగు అపూర్వ విషయములు ఉండుటలో వింతలేదు.

తమ గ్రంథమును గూర్చి శ్రీ శాస్త్రులుగారే "విజ్ఞప్తి"లో ఇట్లు చెప్పియున్నారు.

"ఆంధ్ర గ్రాంథికభాషా జిజ్ఞాసువుల కిపుడు బాలవ్యాకరణ మత్యంతోపకారకమైయున్నది. కాని, దీనియందును, దీని వివరణ మనదగు త్రిలింగలక్షణ శేషమునందును గొన్ని యపసిద్ధాంతములు, లక్షణ విరోధములును నుండుటయేగాక యాంధ్రగ్రాంథిక వాఙ్మయస్థములగు పెక్కులక్షణములు పేర్కొనఁ బడలేదు. లక్షణ విరోధములును, నపసిద్ధాంతములును విద్యార్థుల నెమ్మనములందు నాటుకొనుట మిక్కిలి ప్రమాదకరము. కావుననందలి యపసిద్ధాంతములను, లక్షణవిరోధములను దొలఁగించి బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణములయందుఁ బేర్కొనఁబడని లక్షణ విశేషములనుజేర్చి మిగిలిన బాలవ్యాకరణ విషయములను నిల్పి రచించుట విద్యార్థుల కత్యంతోపకారకమగునని తలంచి యీ బాలవ్యాకరణోద్ద్యోతమును రచించితిని.

"మఱియు నాంధ్రభాషలో సగభాగము నాశ్రయించియున్న సంస్కృతభాష నభ్యసించుట విద్యార్థుల కత్యావశ్యకముగాన నాంధ్రోపయోగి సంస్కృతభాషా లక్షణములు సంక్షేపముగానైనఁ దెలియుటకై యిందు సంస్కృత కృ త్తద్ధిత సమాస విషయములును, సంస్కృత సమాస సంధులును సంక్షేపముగాఁ జేర్పఁబడినవి. కావున దీనిని జదివిన విద్యార్థి సంస్కృత వ్యాకరణమును వేఱుగఁ జదువ నక్కరలేదు."

ఇట్లు ఉభయభాషల వ్యాకరణ విషయములు నుండుటచేతనే శ్రీ శాస్త్రులుగారు దీని 'కృతి సమర్పణ' పద్యములలో

"క. బాల వ్యాకరణోద్ద్యో
తాలోకన ముభయ భాషలందును వ్యాకృ
త్యాలోడన ఫల మీయం
జాలుట నిది శబ్దశాస్త్ర సర్వస్వముగన్."

అని చెప్పికొనియున్నారు.

ఈ గ్రంథము 'బాలవ్యాకరణోద్ద్యోత' మని పేర్కొనబడినను ఇందలి విషయములను పరిశీలించినచో ఇది బాలవ్యాకరణ ఖండన గ్రంథముగా మాత్రము తోచకమానదు. ఇందు సంస్కృతవ్యాకరణ విషయములు కొన్నియున్నను, అవి సంస్కృతమున కొంత పాండిత్యమున్నవారికే సుబోధములగును; అట్టి పరిచయములేని

వారికివి అంతగా ఉపయోగింపగలవని చెప్పలేము. కావున బాలవ్యాకరణఖండనరూపమగు నీ గ్రంథము "శబ్దశాస్త్ర సర్వస్వ"మనుట సరికాదేమో! గ్రంథాంతర నిరపేక్షముగ దీనిం జదివిన సమగ్ర వ్యాకరణ లక్షణ మవగాహమగు నేని పయినామము సార్థకమగును. కాని బాల, ప్రౌఢ వ్యాకరణములు చదివి, సమగ్రముగ పరిశీలించినవారికే ఇయ్యది యుపయోగకారి.

బాల వ్యాకరణములోను, దానికి శేష గ్రంథ మనదగు త్రిలింగ లక్షణ శేషములోను కొన్ని లోపము లుండుట వాస్తవమే! కాని, అంత మాత్రమున అవి తప్పులకుప్ప లనుటయు, అపమార్గమును త్రొక్కింప గలవని భావించుటయు సరికాదేమో యని తోచు చున్నది. తగిన సౌకర్యములు, సాధనసంపత్తి, గ్రంథసముదాయములేని గడచిన శతాబ్దిలో రచితములగు ఆ గ్రంథములలో లోపము లుండుట సహజము. సర్వవిధములగు సాధనముల సంపత్తి, పరిశోధనసంస్థలు, అమూల్యములగు ముద్రితాముద్రిత గ్రంథములుగల యీ కాలములో—వానికంటె మిన్న కాకున్నను, సమానముగనైన ఒక్క వ్యాకరణ గ్రంథమేని వెలువడలేదని అందరును అంగీకరింపవలసియే యున్నది కదా!

ఈ విమర్శగ్రంథమున బాలవ్యాకరణమునందలి సంజ్ఞా పరిచ్ఛేదము మొదలుకొని కృదంత పరిచ్ఛేదము చివరివరకును వివరణ కలదు. దానితో గ్రంథము ముగిసినది. ప్రకీర్ణక పరిచ్ఛేదము విడువబడినది. అందలి విషయములు కొన్ని అక్కడక్కడ వివరింపబడుటచే కాబోలు శ్రీ శాస్త్రిగారు దానిని విడిచిపెట్టిరి.

ఏదైన గ్రంథమును విమర్శించినపుడు దానిలోని దోషములతోపాటు గుణములనుకూడ చూపుట పరిపాటి. ఇక వివరణ గ్రంథమును వ్రాయునెడల గుణములను పేర్కొనుట ఆవశ్యకమని వేరుగా చెప్పనక్కరలేదు. శ్రీ శాస్త్రిగారు 'బాలవ్యాకరణ మత్యంతోపకారకమై యున్న'దని అంగీకరించుచునే అడుగడుగునకు చిన్నయసూరిని విమర్శించుచు, అతని యసమర్థతను వెల్లడింప ప్రయత్నించిరి.

"ప్రయోగమూలం వ్యాకరణ" మ్మని అభిజ్ఞు లంగీకరింతురు. కావున లక్షణములు ప్రయోగములపయి ఆధారపడియుండును. ఇందు కొన్ని పదములు సాధువు లనియు, కొన్ని అసాధువులనియు తెలుపబడినది. దుక్కిటెద్దు, మిద్దెటిల్లు మున్నగునవి సర్వజనాంగీకృతములైనను శాస్త్రిగారు వాని నసాధువులనియే తెలుపుచున్నారు. 'దుక్కిటెద్దు' అనునది ప్రామాణిక కవి ప్రయుక్తమే! హనుమానుడు అసాధువు! 'కాళ్లు' అని వ్రాయుట సరికాదని 'కాల్లు' అని వ్రాయవలెనని వారి యాశయము. 'దొంగ భయము' మున్నగునవి సరి కావట! స్త్రీలను బోధించు 'ఆడి' ప్రత్యయాంతములకు ప్రాచీన ప్రయోగములు లేవని శ్రీ శాస్త్రిగారు వ్రాయు చున్నారు. 102 వ పుటలో వారు వాడిన 'స్నేహిత' శబ్ద మెట్లు సాధువగునో? ఒకవేళ దాని కేదేని ప్రయోగమును చూపినచో, తక్కినవానికిని అట్టి గతిని కల్పింపవీలు కలుగవచ్చును గదా! 'అన్న! మీ తండ్రి కోపగాఁడౌనా కాదో' (పుట 305) అను శ్రీనాథుని ప్రయోగమున 'కోపగాఁడు' అనుటకు బదులు 'కోపకుండు' ఉండవలెనని (అట్లు దిద్దవలెనని)యు, బసవపురాణము లోని 'అభిమానకర్త' (పుట 306)కు బదులు 'అభిమాన కర్త్రి' అని ఉండవలెననియు శ్రీ శాస్త్రిగారి అభిప్రాయము. కాని ఇట్లు దిద్దినపదము లస్వాభావికములని తెలియనివా రుండరు.

ఇట్లే 'చిత్తగించు, కోపగించు, మేళగించు' మున్నగునవి చిత్తగ + ఇంచు, కోపగ + ఇంచు, మేళగ + ఇంచు (పుట 411) అను ఇంచుగాగముపు చేరికచే ఏర్పడినవనుట భాషా స్వభావమునకు విపరీతముగా తోచును. సూరి చూపిన ప్రతిక్రియయే కొంత ఉచితముగా కానవచ్చును!

శ్రీ శాస్త్రిగారు బాలవ్యాకరణములోని విషయములను సనిశిత్య పరీక్ష యొనర్చియు వివరణము కావలసిన ఒండు రెండు స్థలములను విడిచిపెట్టిరి. 114 వ పుటలో "మువర్ణకంబునకు మానుడియోనిం బూర్ణబిందు పూర్వక 'బు' వర్ణకంబేని విభాషనగు" నను సూత్రమున

మాముడి యాగమనియు, 'ంబు' ఆదేశమనియు చెప్ప వలసియున్నది. అది యీ వివరణమున లేదు.

పుట 4-లో "ఇష్ట దంత్యచజలపై '౨' అని నిల్పుదు"రని కలదు. ఆ చిహ్న మేల వచ్చెనో వివరించుట లెస్స. అది 'రెండు' అను సంఖ్యకాని వేఱొక గుర్తు కాదు. తాలవ్య, దంత్య చ జలపై '౧, ౨' అను సంఖ్యలు స్పష్టార్థము పూర్వము బ్రౌను దొర వాడుకలోకి తెచ్చినవి. ప్రస్తుతము తాలవ్యముపైగల '౧' (మొదటి సంఖ్య) సమసిపోయి, దంత్యముపై గల ద్వితీయసంఖ్య మాత్రము నిలిచినది. ఇప్పుడు క్రమముగా అదియు జారిపోయినది. లక్షణ గ్రంథములలో మాత్రము కొన్ని యెడల నిల్పబడుచున్నది.

ఇందు బాలవ్యాకరణ శేషముగ ప్రౌఢ వ్యాకరణమునందలి విషయములు కూడ పెక్కుచోట్ల విమర్శింపబడినవి. "మహ ద్బహుకర్తృ క్రియకు నేకవచనంబు విభాష నగు" అను ప్రౌఢ. సూత్రము సరికాదని చెప్పుచు శ్రీ శాస్త్రిగారు '...ఇది యెట్లు చెప్పుమని యడిగినఁ జెప్పనివాఁడును సత్యము చెప్పనివాఁడును ఘోర నరకపంకమునఁ బడున్ అనుచోట ప్రత్యేకాన్వయము జేసి సమర్థించుకొననగు'నని చెప్పిరి. ఇట్టి చోట్ల సూత్రము లున్ననే జిజ్ఞాసువులకు విషయము స్పష్టముగా తెలియగలదు.

41-వ పుటలో 'వెఱచిట్లు' అను నిర్వచనోత్తర రామాయణమునందలి ప్రయోగము క్త్వార్థకేకారసంధికి ఉదాహరణముగ చూపబడినది. అచట "వెఱ నిట్లంబుధి" అను పాఠాంతర మున్నట్లు 1947 నుండియు వావిళ్ళ వారు ప్రకటించు ప్రౌఢ వ్యాకరణ ప్రతులలో సూచింపబడుచునే యున్నది.

పుట 73 లో 'ఆడిదె నీదు పందెము' అను కళాపూర్ణోదయ ప్రయోగమును, 'భవచ్చిత్తేప్సితం బెద్ది చెప్పనినన్' అను మార్కండేయ పురాణ ప్రయోగమును సాధించుటకై—ప్రౌఢవ్యాకరణము ననుసరించి శ్రీ శాస్త్రిగారు "ప్రార్థనా ద్యర్థక మవ్యయ'ము' వర్ణకమున కంతటను లోపము విభాషనగు"నని సూత్రించియున్నారు—కాని, పయి ప్రయోగములు సరికావు. సందర్భమును, సాధు పాఠమునుబట్టి 'ఆడిదె'కు బదులు 'ఆడితె' అని యుండవలెననియు, 'చెప్పనినన్-' అనుటకు బదులు 'చె, ప్పు నినున్' అని యుండవలెననియు లేనిచో యతి భంగమగుననియు, గుప్తార్థ ప్రకాశికాకారులు కూడ పయి విషయములను గమనింపలేదనియు, ప్రౌఢ వ్యాకరణ వ్యాఖ్యలో శ్రీ బులుసు వేంకటరమణయ్యగారిచే వివరింపబడియున్నది. శ్రీ శాస్త్రిగారు వానిని చూడలేదేమో!

మచ్చున కివి కొన్ని చూపబడినవి. ఇట్టివాని నింకను పెక్కింటిని చూపవచ్చును. శ్రీ శాస్త్రిగారి వ్రాతను విమర్శించు ఉద్దేశముతో కాక, గ్రంథమునందలి విషయములను తెల్పు నభిప్రాయముతోనే ఇవి చూపబడినవి.

ఇయ్యది బృహద్గ్రంథము! ముద్రణ స్ఖాలిత్యముల కెంతో అవకాశము కలదు. కాని 94 పుటలో దకారాంత మనుటకు మకారాంత మనియు, 181 పుటలో 'మా యేపురందు' అనుటకు 'మాయే పురందు-' అను నిట్టి ఒండు, రెండు అచ్చు తప్పులు మాత్రము కానవచ్చుచున్నవి. ఇట్టి శాస్త్ర గ్రంథమును తప్పులు లేక ప్రకటించిన శ్రీ శాస్త్రిగారు అభినందనీయులు.

'విజ్ఞప్తి'కి గల అనుబంధములో సుప్రసిద్ధ విద్వాంసులు ఆచార్య పట్టభద్రులు తీవ్రముగా విమర్శింపబడిరి. అభిప్రాయములలోని మంచి చెడ్డలను తెలుపుట ధర్మము; వ్యక్తిదూషణ అనావశ్యకము. అయ్యది యిందు కొంత అధికముగా కానవచ్చుచున్నది.

లక్షణగ్రంథములయెడ ప్రత్యేకకృషి సల్పి ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వాదులగు బృహద్గ్రంథములను వ్రాసిన శ్రీ శాస్త్రిగారి విమర్శన శక్తి అనన్య సాధారణము. వారి పరిశోధనల ఫలితముగ క్రొత్త సిద్ధాంతములు బయలు వెడలుటలో ఆశ్చర్యము లేదు. ఈ 'బాలవ్యాకరణోద్ద్యోతము'ను అట్టి ధోరణిలోనే రచింపబడినది. ఇది విమర్శక విద్వాంసుల కెక్కువ ఉపయోగకరము; సామాన్య జిజ్ఞాసువుల కిందలి విషయము లవగాహన మగుట కష్టము.

బాలవ్యాకరణ, ప్రౌఢ వ్యాకరణాదులందు లోపములు లేకపోలేదు. వానిని వివరించిన మాత్రమున సామాన్యలక్షణ జిజ్ఞాసువులకు ప్రయోజనము మృగ్యము. అన్యూనానతిరిక్తముగ సూరి సూత్ర పద్ధతిని సంగ్రహముగ వ్యాకరణ మొకటి కావలసియున్నది. అట్టి గ్రంథమును రచించుటకు సమర్థులు నేటి కాలమున వ్రేళ్ళపై లెక్కింపదగినవారు శ్రీ శాస్త్రులుగారి వంటి వారు మాత్రమే యున్నారు. శ్రీ శాస్త్రిగా రట్టి సమగ్ర సంగ్రహ వ్యాకరణమును రచించినచో ఆంధ్ర

భాషావాఙ్మయములకు మహోపకార మొనర్చినవారగుదురు. శ్రీ శాస్త్రిగారట్టి పనికి పూనుకొనగలరని విశ్వసించుచున్నాను.

సామాన్యులకు కాకపోయినను భాషావాఙ్మయ పరిశోధకులకే 'బాలవ్యాకరణోద్ద్యోతము' ఎంతో ఆవశ్యకము. వ్యాకరణములోని లోతుపాతులను చర్చించుట కత్యంతోపయుక్తము. ఆంధ్రావళి యీ గ్రంథమును ఆదరించును గాక!

రా. చ.

## మ నో భూ మి క లు

[కవిత. కర్త: మాదిరాజు రంగారావు. రసఘుని ప్రచురణ, 3-4-685 నారాయణగూడ, హైద్రాబాదు. ప్రతులకు ప్రచురణకర్తలపేర వ్రాయాలి. 29 పుటలు. వెల : రూపాయి.]

శాంతము ప్రకృతిస్థితి. భావము విక్రియ; వికృతిస్థితి; అశాంతి కారణము. భావానుభవమునకు కారణమైన మనస్సు ఇంద్రియములద్వారమున ప్రవర్తించును. 'మనో హి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే.' పంచకోశములలో మనోమయకోశ మొకటి. మనోమయకోశములో నెక్కువగా బ్రదుకువారిలో నిత్యము ఆవిష్టులై భావయోగమును సాధించుకవులు మొదటి వారని చెప్పబనిలేదు.

'మనోభూమిక'లను ఈ కవితా రచన వ్యష్టి — సమష్టికోణములలో, అశాంత్యావరణమునుండి 'ప్రగతి శీల పరిణామము' 'అభ్యుదయము' ఏర్పడుటను వర్ణించుచున్నది. శివశక్తుల ఐక్యము నభ్యూహించుచున్నది. స్థూలముగా కవిదృష్టి ఇది. కాని అశాంతి శాంతిగా అభ్యుదయముగా మారు పరిణామములో వ్యష్టికిగాని సమష్టికిగాని తమ సత్సంకల్పము, సాధన చోదకశక్తులుగాని: అశాంతి సహజపరిణామము శాంతి కాదు. వ్యష్టికి ఇంద్రియోపశమనము శాంతిదము. సమష్టికి ప్రలయము! ఆ ప్రలయము రుద్రుని కరుణాకటాక్షము. మరి కవి కోరుచున్న ఆ శాంతి స్వరూపముగూడ ఎట్టిదో స్పష్టముగా తెలియదు. 'తెరలు తెరలుగా జారిన భిన్న భిన్న వర్ణోహాలు, పొరలుపొరలుగా ఒదిగిన మానవ సమాజం, క్రియాశైపరీత్యం, ఊహావ్యాపారంలేని, శాంతిలో, మానవునికి నిజంగా శాంతి లేదు' అని వ్రాయుచున్న కవి తనతరపున నేకాక అందఱితరపున ఈ మాట లనుచున్నాడు! ఇది కేవలము కవి లౌకికతను నిరూపించు ఊహామాత్రమే. స్పష్టమైన ధ్యేయము, అధికారము, చాలదేమోనని యనిపించుమాట.

ఈ రచనలో—

'కాలనియమం లేకుండా సంచరిస్తూ
అజ్ఞాతంగా, అద్దంవంటి బుద్ధిలో
అవిజ్ఞేయంగా బింబించు మనోభూమికలు'

ఉన్నవి. ఈ పుస్తకానికి పేరుపెట్టుటకీ పంక్తులు కారణము కావచ్చును. పంచభూతములు, మనోబుద్ధ్యహంకారములు, పంచతన్మాత్రలు, చతుర్వింశతి తత్త్వములు — ఇవన్నియు ఆధ్యాత్మిక సంబంధులగు (Metaphysical) మాటలు. ఈ రచనలో మనస్సు, బుద్ధి, అహంకారమువంటి పదాలు తరచుగా కనబడినను దీని నాధ్యాత్మికకవిత అనుటకు వీలులేదు. సమష్టి దృష్టితో సోషలాజికల్ గా వ్రాసిన పంక్తులు, రసాయనశాస్త్రముతో ఉద్భవిల్లే భావిమానవులను కూర్చిన వ్రాత దీనినొక వింగడీపునకు రానిచ్చుటలేదు. దీనికి తోడు కవికి, సామాన్యమైన సంప్రదాయము తెలియక పోవుట, మనోబుద్ధ్యహంకారాదుల స్వరూపా నభిజ్ఞత ఉండి రచన కపకర్ష హేతువు లగుచున్నవి. తన సంగతి తా నాలోచించుకొనుటకే చాలని పరిణతితో, లోకము బరువుకూడ తనమీద పెట్టుకొని ఏదో అస్పష్టమైన, మిహికాచ్ఛాదితమైన ధ్యేయముమీద, మిహిర ప్రస్ఫుటముకాని దృష్టిబరపి వ్రాసిన ఈ రచనలో అర్థమగు దానికంటె కానిభాగమే ఎక్కువ. ఏ ఖండములోను పరమార్థ మంతుపట్టదు. శాస్త్ర సంప్రదాయములను మతముగా సంభావించి వానిని విడిచి లౌకికముగా (secular) వ్రాయబూనుట ఇందుకొక కారణము కావచ్చును. సంప్రదాయగంధముతో వ్రాసినచోట మాత్రము బోధావరణములోనికి వచ్చునట్లుగా నే వ్రాయును, చూడుడు :

'సంధ్యాసమయ తాండవారభటితో
మనోంతరపథాలను నాదమయం చేసి
ప్రళయకాల ఝంఝూహస్తాలు చాచి
నను గాఢంగా కౌగిట బూనే రుద్రమూర్తి
మూర్తీభవించిన అశాంతి—
నా జీవిత సారస్వతం సమావరించి
ఊర్జిత ఆనందకళాస్ఫూర్తి—శాంతి
కలిగించే ఆకారం లేని 'ఈశ్వరుడు'.

అంతే కాదు.

'జీవితాంతం వెల్లుతూ త్రైగుణ్య విపర్యయంతో
అసంపూర్తి కాముకులతో మనశ్శ్మశానం'

అని సకృదుత్తముగా స్పష్టముగాను పలుకగలడు.

'పగలు నాటిచుట్టూ నిద్రవంటి బ్రతుకుతో
రాత్రి మేల్కాని ఒకరి నొకరు పల్కరించుకొని
చీకట్లో నవ్వుకునే కుర్చీలు-కౌగిలాలు, కలాలు
ఉదయం కాగానే ఏమీ ఎరగనట్లు కన్పిస్తవి'

అని ఒక ఎబ్బెట్టయిన (queer) ఊహాలో కవితా స్పర్శయు చూపించగలడు.

'ఇసుక ఎడారి నాలుకచాచి
దూరంగా సరస్సులా కన్పించే
చంద్రబింబం వైపు పరుగుతీస్తూ (?)
ఎంతకాలానికీ అందుకోజాలని భూమి'

అని ఒకపాటి భావచిత్రణ చూపించనూగలడు. కాని గ్రంథంలో చాలచోట్ల కవి వికలచిత్తత మాత్రమే కానవచ్చును. మనస్సు, బుద్ధి అనేవానినిగూర్చి - కథాగతముగానే-శ్రీనాథుడు 'పాడయినట్టి చిత్త మొక పాటున నిల్వక మాటి మాటి కూటాడుచునుండు'... 'కట కటా తనబుద్ధి పెడగాటఁగలయ, నిసువుజంఘంగ దలఁచెనే నీమగండు' అని వ్రాసినమాట లాధ్యాత్మిక స్ఫూర్తిగలవి; స్పష్టమైనవి. అంతవర కెందులకు? ఈయన వ్రాసిన

'జ్వాలదగ్ని సమోహా (?) సంభ్రాంతిమత్
సంధ్యాటవీ 'ధావన్మృగ పక్షిసమూహము'

అన్న వర్ణనకంటె స్వరోచి వేటవర్ణనలోని పెద్దన పద్యము స్ఫూర్తిమంతముగదా! పోలికమాట లెందులకనగా ఈయన రచనలోని కొన్ని దోషములు సంవిధాన రాహిత్యముగా, శబ్దమునకు కావలసిన ఊహచోదక శక్తి చాలనిచోట దానిని సమాసములతో గప్పిపెట్ట జూచుటగా, ఉపసర్గల దుర్వ్యయముగా ఉన్నవి. మనస్సాహితీ సంస్కృతి, జీవిత సారస్వతము, ఆనంద కళాస్ఫూర్తి, ప్రగతిశీల పరిణామము—వంటి నినాద సదృశములైన మాటలకూర్పులు అసకృదావృత్తములగుట కవిమీది పాఠకుని విశ్వాసమును భగ్నపరచునదిగా తోచును. వానిలో కొన్ని వ్యాఖ్యాతలు వాడుకొనదగినమాటలు. కవి సంకేతములు, నినాదసదృశములైన శబ్దములు పట్టుకొని నేలవిడచి సాముచేయరాదు.

'జ్వాలదూహ శిఖలతో నిను ఆహ్వానిస్తా
పవమాన పంక్తివలె రివ్వున ఎగసిరా
కలసిపోయి మన మిరువుర మొకటిగా
నిలచిపోదాం ప్రకాశమాన రోదసివలె.
మనకంటిముందు బూదికుప్ప సర్వసృష్టి
మేధా పదవి (వేలాడే మబ్బుగుంపు స్వర్గావళి(?
అణువున కతీతంగా ?), సర్వాభిముఖీనంగా)
స్ఫురించుదాం శైవతనూ సుమమారోచివలె.'

ఇంతఊహా తీవ్రత చూపించే యీ రచన చాలా చోట్ల 'ఏనాడో తెగిపోయి హారాత్తుగా, ఆలోచనాస్ఫూర్తి రేఖల సంబంధం' వ్రాసిన దనిపించును. ఇది నామట్టుకు నేను తినలేని పులగము.

## అమ్మతో ముచ్చటలు

[తత్త్వకవిత. కూర్పరి: శ్రీ శ్రియానందనాథాపర నాములగు ఈశ్వర సత్యనారాయణ శర్మ, శ్రీకాకుళము. ప్రకాశకులు: సాధనగ్రంథమండలి, తెనాలి. ప్రతులకు: ప్రకాశకులపేర వ్రాయవలెను. 148 పుటలు. వెల రు 1-50 న. పై.]

'గిరామాహుర్దేవీం ద్రుహిణగృహిణీ మాగమ విదో
హరేః పత్నీం పద్మాం హరసహచరీ మద్రితనయామ్,
తురీయా కాపి త్వం దురధిగమ నిస్సీమ మహిమా
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మమహిషీ'

అని శంకర భగవత్పాదులవారు పరాశక్తిని నుతించిన శాక్తమనాది: శ్రీవిద్యయు నట్టిదే. దక్షిణాచార మార్గమునకు జెందిన శ్రీవిద్య శంకరుల కాలమునుండి విరివిగా వ్యాప్తమైన దనవచ్చును. వామాచార పద్ధతి, సమయాచార కాలములు తంత్రమార్గమున నుండనే యున్నవి. ఈ తత్త్వకవితాసంపుటము శ్రీవిద్యోపాసనా మార్గమున బొడమిన సాత్త్విక ప్లుతి.

తత్త్వచింతన మీదేశమున ప్రాతబడిపోయినది. సాధకులకుదక్క తక్కినవారికిది సర్జనశీలముగ, అభ్యుదయకారణముగ కనుపింపకపోవుట విచారకరమైన విషయము. ఎంత ఆధునికులైనను ఆస్తికులైనచో జాలు నొకసారి కాకున్న నొకసారియైనను ఈ విశ్వసృష్టి నావరించి నడుపుచున్న దివ్యశక్తి యొకటున్నదని తోపకమానదు. ఆ తోచినపుడు మనసునకొక క్షణిక శాంతి, తొలచినచో నానందరేఖగ భాసిల్లగల హ్లాదము కలుగుననుట కెవరికి వారే సాక్షులు. మరి ఆశక్తి నారాధించుచు దాని నిరంతర సాన్నిధ్యమును గల్పించుకొని మరియు సాధకుల యానందానుభవ మింతయని చెప్పలేము. అది ఉపాసనామార్గము: ఉపాస్తియన గానేమి?

'కర్మణా మనసా వాచా సర్వావస్థాసు సర్వదా,
సమీపసేవా విధివా ఉపాస్తి రితి కథ్యతే.'

# గ్రంథ విమర్శనము

పాదుకాంత దీక్షాపరులు శ్రీ శివానందనాథా పరనాములునగు ఈశ్వర సత్యనారాయణ శర్మగారు 'శాక్తశిశువు'లమని చెప్పుకొన్నారు. 'అమ్మ' సన్నిధానమును గల్పించుకొని మునుపు చెప్పిన త్రిశతి ఇప్పుడు ఆరునూర్ల పద్యములతో 'అమ్మతో ముచ్చటలు'గా నిబ్బడియైనది. ఈ గ్రంథమున పలువిధములగు భావమార్గములున్నవి. కొన్ని శాక్తవిషయము లుపన్యసించునవి; కొన్ని సాధనానుభవముల జెప్పినవి; కొన్ని సాధకుడైన 'శాక్తశిశువు' అమ్మకు నివేదించుకొనునవి; కొన్ని లోకసంగ్రహము నాకాంక్షించునవి. శాక్తము నుపన్యసించుచోట సహజముగా పద్యములు వ్యాఖ్యానసాపేక్షములుగా నున్నవి.

'కటకట! పూర్వసిద్ధ కవి
  కావ్య సమాఖ్యలె పాల్లులల్లి మే
మటమట బుద్ధితో మొగము
  నం దిడినంతనె, నీకుఁ జాటె? మృ
ద్వటకముల న్గరండనిహి
  తమ్ములు చేసి 'సువర్ణ భైరవీ
వటకము'లన్నయంత గుణ
  వైభవ మెట్లువచ్చు భైరవీ!'

ఈ పద్యమున శాక్తమున జెప్పబడు వటుకాశక్త్యాదిపూజ స్పృశింపబడినది. అష్టైకులము, సమయము, బైందవము స్వభావ విక్షేప పరిణామములను మాయా విభాగములు, నాదము, పరాపశ్యంతీ మధ్యమా వైఖరులు—మొదలగు సంకేతము లున్నవి. గ్రంథాంతమున నిచ్చిన 'కొన్ని మాటల కర్థము'లను పట్టికలో నిట్టి సంకేత వివరణములు మరికొంత విపులముగ జేర్చిన సామాన్య పాఠకులకు సులభముగా నుండెడిది.

ఈ కూర్పున జెప్పబడిన సాధనానుభవములు సాధకుల కుపకరించునవి. చూడుడు:

'చెవులను హోరు, కన్నులను
  జీకటి, బ్రహ్మబిలంబుపోటు, వే
డి వలని దద్దురుల్ వెలువ
  డె న్నినుఁ బ్రాణ నిరోధ కర్మతోఁ
దవిలి భజింప; దాని గని
  దక్షిణుడంచునో, జాలితోనో, న
న్నవన మొనర్చినట్టి కరు
  ణార్ద్రిత మర్మను, చక్రవర్తినీ!'

తన్ను గురించి తాను జెప్పుకొన్నచోట తన శిశుభావమును తల్లిముందెట్లు వెలయించుచున్నారో చూడుడు:

'అనుభవమయ్యె నాకు సక
  లాంబయె ప్రాపని; నాకవశ్యమా
పను లెవి లేవు; సాధన ల
  వార్య విశుద్ధిని బొందు; నేను నగ్న వ
త్సునివలె నీ యొడి న్నిలిచి
  చూచుచు నుండెద; నన్ను మొండి బి
డ్డను దిగఁద్రోయఁగాఁగలవె?
  డంబము లేక వచింపు మంబికా!'

ముఖ్యముగా తత్త్వచింతన ననాది శక్తిధామమునకే మరలింపక దానిని సమకాలీన మానవ ప్రపంచమున కన్వయించి తత్త్వమార్గమును సర్జనశీలము చేయుట శాంతికాముకతగా రూపింపజేయుట ఆ మార్గమునకు సామాన్యుల దృష్టిలో నూర్జస్వితను ఆర్జవ విశ్వాసమును కల్పించగలదు. ఈ పద్యమట్టిది:

'సమరము లేలరేప? అణు
  శస్త్రహతిఁ గలిదోషదూర జ
న్తుమరణ మేల? మానవ త
  ను శ్రితవై యవమాన్యవైనఁ గో
పమణచుకొనిదా వెరవు?
  వానికి నీ వెటో మెల్లగా నహం
మమతల వేరుద్రెంచు మతి
  మత్త్వముఁ బెట్టినఁ జాలదా? శివా!'

శర్మగారిది ధారాళమైన కవిత. సామాన్యముగా తెలుగులెక్కువ. కాళిదాసు రచనలోని చిద్గగన చంద్రికమీది మోజు ఆయనను చకోరజన్మను గోరజేసినది. పరాశక్తిని మనసున బెట్టుకొని ద్వంద్వసమాసమును, చాతుర్వర్ణ్యమును వారు వ్యాఖ్యానించిన పద్ధతి హృద్యము; 'వందేమాతరమ్మ'ను దానిని పరాశక్తి కన్వయించి దేశభక్తికి లగించుట ఆయన దేశాభిమానమునకు మచ్చుతునుక; సినిమాతెర మొదలుకొని అణ్వస్త్రములదాక ఈతాత్త్విక రచనలో పరామృష్టములగుట శర్మగారి లోకజ్ఞతకు నిదర్శనము, ఒకచిన్న విషయమును దీసుకొని ఆయన జగద్రహస్యమును మన పరిశీలన కెట్లు పెట్టుదురో చిత్తగింపుఁడు.

'ఒకటే పిచ్చుకజాతి; నీడరచనో
  ద్యోగంబు బంగారుపి
చ్చుకకుం బిచ్చుక కెంత భిన్నముగఁ గూ
  ర్పు న్నీ విలాసం బుమా!
స్వకుటుంబమ్మగు జీవు లొక్కటయినన్
  సంరక్షలో భేద మెం
దుకొ నీకే తెలియున్; నమస్కృతులు నీ
  దుర్జ్ఞేయ భావాళికిన్'

మత ప్రాతిపదిక వీడి కేవల లౌకిక (Secular) మార్గమున నాలోచించువారును మననము చేయదగిన పద్యములు గూడ నిందున్నవి. ఒక్కటి చూడుడు:

'భావమె నామరూపములు;
భావమె నీరవమైన శబ్ద; మా
భావము లూరుటన్ మనసు
వాగుచునుండును దిక్కుపోలికన్
రేవగ; లాత్మబోధము ఘ
నీకృతమైనపుడే సశబ్ద భా
వావళి యాఱిపోయి స్థిర
మౌ నొక సత్తను నిల్చు; శాంభవీ!

ఆనంద నాథ సంప్రదాయమువారైన శర్మగారిట్లు తమ యానందానుభవమును ఆధ్యాత్మపిపాసగలవారి కెల్లను బంచిపెట్టినారు.

## మహాసౌరమంత్ర పాఠము

[సస్వరము. ఆంధ్రపద్య, ఆంగ్లగద్య అనువాద సహితము. ఆంధ్రపద్యానువక్త: శ్రీ శ్రీయానంద నాథాపరనాములు ఈశ్వర సత్యనారాయణశర్మ. ఆంగ్లగద్యానువక్త: తచ్ఛిష్యులు శ్రీ ఎమ్. పి. రామారావు. ప్రకాశకులు: సాధనగ్రంథమండలి, తెనాలి, ప్రతులకు: ప్రకాశకులపేర. 65 పుటలు, వెల. ముప్పావలా.]

అమ్మతో ముచ్చటలాడిన యానందమును అందఱకుఁ బంచిపెట్టుచు సంధ్యావందనమువీూఁది తమ ఉత్కటమగు ప్రీతిని వెల్లడించిన శ్రీ శ్రీయానందనాథులు అందే వేరొకచోట తము స్తోత్రమును సంస్కృతమున బలుకక తెలుగున బలికినచో యమ్మ యేమి గొంతునులుమునా యని యడిగినవారు. వారే మహాసౌరమంత్రపాఠమునకు తెలుగున పద్యానువాదము చేయుట సహజమైన విషయము.

శాక్తమువలెనే సౌరోపాస్తియు చాల అనాది. ఆది శంకరులు ఉపాసనా మార్గమునందలి తీవ్రతను తగ్గించి అరక్తకమైన సౌరమును స్థాపించిరి. రక్తము చిందెడుదాక బొటనవ్రేలు నేల రాచి సాధకుడా నెత్తుటిబొట్టు పెట్టుకొని సౌరము నుపాసించెడు వాఁడని పెద్దలు చెప్పుదురు. శంకరులా తీవ్ర పద్ధతిని మాన్పించిరట. ఈ పుస్తకమున సస్వరముగా ముద్రింపబడిన అఱువదియైదు మహాసౌరమంత్రములు, వానికి శ్రీ శ్రీయానందనాథుల పద్యానువాదమును, అట్లే వారి శిష్యులుచేసిన ఆంగ్లగద్యానువాదమును ఉన్నవి. శ్రీయానందనాథుల ఆంధ్రానువాదము విద్యారణ్య భాష్యము నతిక్రమింపక నడచినది. వారే గ్రంథాది నిట్లు చెప్పుకొన్నారు:

'మంత్రైః స్వమం పదంధ్రాను
వచనం ఫలదం భవేత్,
ఉల్లంఘితం న భాష్యార్థం
విద్యారణ్యకృతం యతః'

మఱి, 'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అనునది సామాన్యమగుమాట ఈ మహాసౌరమంత్ర పాఠమున, ముక్తి, శుభ, జ్ఞాన, కామదములైన మంత్రములు, ప్రజాప్రదములు, ధనద, అన్నదములు, ఆయుష్కరములు, వర్షదములు, పాపహర, రోగహర, దుస్స్వప్నహారి, శత్రుహర, నేత్రరోగహరములు, ఉపప్లవవారకములు నున్నవి. ఆయామంత్రములసంఖ్య వారి ఫలమును సూచించు పట్టిక యొకటి గ్రంథాదిలోనే చూపబడినది.

భాష్యము ననుసరించుటచే గాబోలు అనువాదమున నచ్చటచ్చట విపులతాస్పర్శ కానవచ్చును. ఈ రెండు చిన్నమంత్రముల యనువాదము లెంతచక్కగ నున్నవో చిత్తగింపుడు.

"ఓమ్. ఉదుత్యం జాతవేదసం
దేవం వహన్తి కేతవః దృశే విశ్వాయ సూర్యం"
ఇవె రవి గుఱ్ఱాలు లోక మీక్షించుకొఱకు
విశ్వ విఖ్యాతచరితుని, వెలుగు వాని
నఖిల వేదిని, సర్వ నియంతయైన
వానిఁ జేర్చును పైకి నభంబునందు.

Behold these radiant rays (steeds) of the Sun, the All-famed, Self-effulgent All-mighty Dictator that take him high above so that all the worlds might perceive him.

"శుకేషు మే హరిమాణం రోపణాకాసు దధ్మసి
అథో హారిద్రవేషు మే హరిమాణం దధ్మసి."
ఆకుపచ్చని నాదు చర్మామయమును
బలుకు పిట్టలయందు గోరువంకలందు
నట్టె పచ్చనివగు తాటి చెట్టులందుఁ
బెట్టుచున్నాము మము బాధపెట్టకుండ.

The green skin diseases of mine I place in parrots green, starlings green, and palmyrahs green so that they mav not torment me.

గ్రంథాంతమున సూర్యయంత్రము, అంగన్యాస కరన్యాసములతోడి పూజావిధానమును దెల్పు సూర్యపటలము ఇయ్యబడినవి. ఆసక్తులైనవారికి చక్కగా నక్కఱకు వచ్చెడి గ్రంథము.

ఎస్. కె.

## శ్రీ దేశిరాజు పెదబాపయ్య జీవనస్మృతి, రచనా మంజరి

కర్త: శ్రీ కొమరాజు హనుమంతరావు. క్రౌను 10+376. వెల రూ. 5 లు. ప్రాక్ప్రతీచీ గ్రంథమాల, రాజమహేంద్రవరము.

# గ్రంథ విమర్శనము

తాను నమ్మిన సత్యంకోసం పాటుపడి అత్యల్ప కాలం మాత్రమే జీవించినా, అందరికిని ఆదర్శ ప్రాయులై పేరు గడించినవారు దేశిరాజు పెద బాపయ్యగారు! అచంచల దీక్షగల వ్యక్తులలో వీరగ్ర గణ్యులు! బ్రహ్మసమాజ సిద్ధాంతాల ననుసరించి, ఏకేశ్వరోపాసకులై సమాజ సిద్ధాంత వ్యాప్తికై జీవితం ధారపోసిన మహనీయులు! మిక్కిలి శ్రమపడి సంపాదించిన ప్రభుత్వోద్యోగాన్ని మాట పట్టుదలపై తృణప్రాయంగా విడిచిన ఆత్మాభిమానులు! అట్టి ఆదర్శ వ్యక్తి జీవిత విశేషాలు, వివిధ విషయాలపై వారొసగిన ఉపన్యాసాలు ఈ గ్రంథంలో ఈయబడినవి.!

శ్రీ పెద బాపయ్యగారు శ్రీ వీరేశలింగము పంతులుగారి శిష్యవర్గంలో ముఖ్యులు. ఆయన వలెనే వీరును సంస్కరణాభిలాషులు. సర్వతోముఖ సంస్కరణ వాదం, ఆధ్యాత్మిక జీవనం, నైతికతత్వం, పామర జనాభ్యుదయం, నాట్యకన్య మొదలగు విషయములపై వీరొసగిన ఉపన్యాసాలు వివిధ విషయాలలో వీరి కూలంకష ప్రజ్ఞను స్పష్టపరుస్తున్నాయి.

మరుగుపడిపోతున్న యిట్టి స్వార్థత్యాగుల జీవిత చరిత్రలు నేటి యువక లోకానికి ఆదర్శప్రాయాలై, జీవితంలో చక్కని మార్పులు కలుగుట కెంతో తోడ్పడుతాయి. ఇట్టి గ్రంథం కూర్చిన రచయిత ప్రశంసార్హుడు.

దీనిలో రెండు వందల పుటలకుపైగా శ్రీ పెద బాపయ్యగారి జీవితం, నూరు పుటలలో వారి ఆంగ్లోపన్యాసాల అనువాదం వున్నాయి. జీవిత రచనకంటే ఉపన్యాసానువాదాలు ప్రౌఢంగా ఉన్నవి. గ్రంథం చివర పెదబాపయ్యగారి దినచర్యపుస్తకమునుండి కొన్ని సంఘటనలను గ్రహించి చేర్చడం మిక్కిలి ఉపయోగకరం. జీవిత చరిత్రలు రచించేవారు ఈ పద్ధతిని గూడ గ్రహింపవలసివుంది.

తాను నమ్మిన సత్యాలను ఆచరణలో పెట్టడానికి ఆత్మత్యాగ మొనర్చిన ఆదర్శ పురుషుడు— శ్రీ పెదబాపయ్యగారి చరిత్ర అందరికి పఠింపదగినది!



## గేయసుమ మంజరి

[కర్త: డా॥ అగ్నిహోత్రం రామకృష్ణమాచార్యులు; రాష్ట్రభాషా విశారద, పాటిబండ. శ్రీ విఖనస గ్రంథమండలి, పొన్నూరు వారి ప్రచురణ. పుటలు : 68. వెల 75 న. పై.]

ఈ 'గేయసుమ మంజరి' మూడు భాగాలుగా ఉంది: దేవతా స్తోత్రరూపమున నున్నవి, జాతీయములు, స్వాభావిక సాంఘికములు. మొదటి తెగలో శివుడు, విష్ణువు, తులసి మొదలగువారి మీద పాటలున్నవి. 'ఆసియాలో వాసికెక్కిన దేశమందున పుట్టి'నట్టి భారతీయుణ్ణి ఉద్బోధించే గేయాలు రెండో తెగలో ఉన్నాయి. మూడో తెగలో కవి అప్పుడప్పుడు వ్రాసిన పలువిధాలైన రచనలున్నాయి. 'నా లోకం' 'మీ లోకం' 'మధురగీతం' 'విధురగీతం' మొదలైన శీర్షికలు చూస్తే చాలు ఈ తెగలోని వస్తు స్వభావం తెలుస్తుంది. కచటతపల నే గేయంలోని ఈ మాటలు ఈయన రచనకు మంచిమచ్చు:

'టక్కులతోనే బ్రతికే మనుషులు
టక్కరి కొక్కెరవంటి మనీషులు
టాలా టోలీ మాటలు చెప్పి
టంకము పొడిలా ఉపయోగించే
టక్కరి వెధవల నుక్కడచాలి
టపాకాయలా కాల్చెయ్యాలి.'

## శ్రీ రామానుజచరిత్ర

[కర్త: 'శ్రీ రామానుజదాసుడు' ప్రచురణ: శ్రీ గోదా గ్రంథమాల, శ్రీమన్నారాయణపురము. ప్రతులకు: కొండూరి లక్ష్మీనరసమ్మ, శ్రీ గోదా గ్రంథమాల, ఉల్లిపాలెము పోస్టు, దివి తాలూకా, కృష్ణాజిల్లా. 41 పుటలు. వెల 62 న. పై.]

మహాపురుషుల జీవితములు మహిమోపేతములు. మంత్రతంత్రముల మహిమకంటె వారిలోని వ్యక్తిత్వ మహిమ గొప్పది. గురుకటాక్షమునకు పాత్రుడు కావలెనని ఆరు నెలలు తపస్సుచేసి శ్రీరంగమునకు సమీపమున గల గోష్ఠీపురమున గోష్ఠీపూర్ణులచే మంత్రోపదేశమును పొందిన శ్రీ రామానుజులు లోకమునెడ కరుణాళువై గురుధిక్కారమునకు సైతము సిద్ధపడి సమీపమునందలి ఆలయము గాలిగోపురమెక్కి ఉచ్చైస్స్వరమున మంత్రమందరికి తెలియజెప్పినవారు; విశిష్టాద్వైతప్రవర్తకులు.

శ్రీ గోదా గ్రంథమాలవారు తమ బాలసాహితీ శాఖలో ద్వితీయరత్నముగ ప్రకటించిన ఈ శ్రీ రామానుజ చరిత్రలో వారి చరిత్రమే కాక వారి జీవితమునకు లంకెపడిన మరికొందరు మహాత్ముల విషయములు, రామానుజులు పడిన

రాజకీయమైన భాగాలు తెలియగలవు. ఒక విధముగా నాటి సాంఘికపరిస్థితుల నుద్యోతింప జేయుట ఈ చిన్న గ్రంథమున రచనలోని ప్రత్యేకత. పిల్లలేకాక సామాన్యులకు పెద్దలుగూడ చదువదగిన పుస్తకము.

## చెంచులక్ష్మి

[నాటకము. కర్త: సి. వి. సుబ్బన్న శతావధాని. ప్రతులకు: గ్రంథకర్త, ప్రొద్దుటూరు, కడప జిల్లా. 88 పుటలు. వెల: రు. 1-25. న. పై.]

ఇది రంగవిభజనతో ఐదంకములుగా వ్రాయబడిన స్టేజినాటకము. శ్రీ గరుడాచల నాటక మని దీనికి నామాంతరము. శ్రీ గరుడాచలేశ్వరుడు చెంచులక్ష్మిని వివాహమైన ఈ కథను అనువైన ఉపరూపకముగనో యక్షగానముగనో వ్రాసియుండిన బాగుండెడిది. ఈ స్టేజినాటకము తేటమాటలతో ప్రయోగ సులభముగా ఉన్నది. పాడదలచెడు వారికి పద్యములుకూడ నున్నవి. రచయిత తేటగా కవిత్వము చెప్పగల సమర్థుడు. కాని, అర్థసంగతి సరిగా ఉన్నను, అనౌచిత్యమునకు దారితీసెడి ఈ క్రింది చాపల్యరూపమైన అభిరుచి దోషాన్ని గ్రంథకర్త పరిహరించుకొనుట మంచిది. నారదుడు వనసరశ్శోభ నిట్లు వర్ణించుచున్నాడు. "ఈ వని అవిరళ శ్రీరంజని. వికచ రాజీవ శోభిత లలిత పద్మిని. నిత్యవసంత రాగిణి. మదాలస భ్రమరమాలా కృష్ణవేణి.

ఉ॥ బాలసరస్వతీ మధుర
వాణి పికాంగన, పుష్పవల్లి కా
జాల చరన్మధువ్రత ని
స్వర్ణకలధ్వని ఫుల్లపద్మినీ
లోల సరోజ లక్ష్మియెద
లో మధుపూరగ నాలపించెడిన్
వ్రాలి రసాలశాఖ ఋతు
రాజ సులోచన లాలి తొద్భుతిన్.

ఈ సరస్సులో లేక లేక నేడీ పద్మమొక్కటి పూచినది. ఈ సరోజలములు సూర్యకుమారీ జలముల కంటె శుచిమంతములు: ఇందు జనించిన పద్మమేల భానుమతి కాకుండును?"

నారదునినోట సినిమాతారల నామజపము!

## మాట - మన్నన

[రచయిత: గొర్రెపాటి వెంకట సుబ్బయ్య. దేశీ ప్రచురణ. ప్రతులకు: దేశికవితా మండలి, విజయవాడ-2. పుటలు. 68. వెల. రు. 1.]

సంభాషణల్లో గాలికబుర్లు మొదలుకొని ఘనమైన విషయాలదాకా చాలా దొర్లుతుంటాయి. కాలక్షేపం మొదలుకొని సంస్కారి కావడందాకా దీనికి ఫలాలూ ఉంటాయి. వ్యక్తుల మనసుల్లోని అంతరువులు, దృష్టి ఆయా ప్రయోజనాలను సాధించి పెడతాయి. ఇది కేవలం ప్రయోజనదృష్టి.

సంభాషణను ఒక కళగా చూచినప్పుడు దానికి సద్యఃఫలము ఆనందం అనవా ఆహ్లాదం. ఎదుటివారి భావ ప్రపంచంతో సంపదించి నప్పుడు మనం వారిచేత ప్రభావితులం కావడమో వారి మీద మన ప్రభావాన్ని ప్రసరింప చెయ్యడమో, మనకు తెలియకుండానే జరుగుతుంది. దానివల్ల వ్యక్తిత్వాల కొక సమగ్రత, నిండుతనం, సమత దిద్ది తీర్చినట్లుం డడం మొదలైన లక్షణాలు వస్తాయి. వీటికోసం ప్రతివారు సంభాషించే నేర్పు కృషిచేసి అయినా సాధించుకోవడం అవసరం. సాంఘికంగా కూడా అట్లాటివారికి అనుకూల వాతావరణం అమరి చారవకూ, వ్యవహార దక్షతకూ కారణ మవుతుంది.

మాట - మన్నన అనే ఈ పుస్తకం ఈ విషయాన్ని గురించి చెప్పడానికి ప్రయత్నం చేసింది. ఇంగ్లీషులో ఇలాంటి విషయాలమీద పుస్తకాలు అనేకం ఉన్నాయి. ఆ వ్రాసిన వాళ్లందరూ విషయాన్ని స్వయంగా చక్కగా ఆలోచించి వ్రాశారు. ఇది పరిచితమైనా, సూక్ష్మమైన విషయంకనుక తీర్పులోను చెప్పడంలోను ఆ సూక్ష్మతను పట్టిచూపేశక్తి, నిష్ఠ కావాలి. రంజకంగా మాట్లాడడంకంటె ఏకాంతంగా కూర్చొని రంజకంగా వ్రాయడం ఒకవిధంగా సుకరం. కాని ఈ పుస్తకంలో విషయంలో సూక్ష్మత గాని రంజకత్వం గాని అంతగా లేవు. ఊదరగొట్టడం, చిట్కాలు చెప్పడం కన్పిస్తుంది. 'నేర్పరత్వం' అనే మాట చివరిదాకా 'తవ బాధతి బాధతే' అన్నట్లుగా బాధిస్తుంది.

అనుబంధంగా యిచ్చిన తెలుగు పద్యాలు, సంభాషణనుగూర్చి పాశ్చాత్యుల అభిప్రాయాలు పాఠకులకు చాలా ఉపయోగపడతాయి. సంభాషణ కళ మాత్రమే కాదు శాస్త్రంకూడా అనే ఈ పుస్తకం పాఠకులకు ఏ కొంత ఉపకరించినా మంచిదే.

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor: Sambhu Prasad.